# చతుర

సంపుటి : 7 మార్చి 1984 సంచిక : 2

## —ఈ నెల సమగ్ర నవల

అవిడ విద్యాధికురాలు. ఉద్యోగంలో ఉంది. ఒకరిమీద అధార పడవలసిన అగత్యం లేదు. అయినా "ఇందులో అన్యాయం ఏముంది? మీకో ఆడదిక్కు కావాలి! నాకు ఆశ్రయం కావాలి. కనీసం మీ ఇంటి పనిమనిషినని అనుకోండి. కాకపోతే నలుగురూ వేలెత్తి చూపించకుండా ఉండేందుకు పెళ్ళి అనేది ఒక తంతు మాత్రమే. ఈ వివాహం వల్ల మనిద్దరికీ లాభమే తప్ప ఇందులో ఒకరికి మరొకరు చేసే అన్యాయం ఏముంది? ముఖ్యంగా నాకు కొత్తగా జరిగే అన్యాయం మాత్రం అసలు ఏముంది గనుక..." అని తనకు బాస్ వంటివాడయిన డాక్టర్‌ను నిలవేసి అడిగిందా..




పేరుకు తగిన నిదానం, గుణగణాలు కలిగిన ఆమె తనకన్నా చాలా పెద్ద వయసులో ఉన్న డాక్టర్ని, అందునా భార్య పోయి పిల్లలు కూడా ఉన్నవాడిని అలా ఎందుకు అభ్యర్థించింది? అందుకు అవిడను ప్రేరేపించిన పరిస్థితులేమిటి??

కృష్ణజి

అటు సాంఘిక వాతావరణ ప్రభావాలు, ఇటు మానసిక ఔన్న త్యాలు–దౌర్బల్యాలు మనుషుల్నెలా నడిపిస్తాయో సమర్థవంతంగా చిత్రించిన 'సౌమ్య' ఈ నెల చతుర సమగ్ర నవల.

# నేను మా పళ్ల డాక్టరును అడిగా - కేవలం ఫోర్‌హాన్స్ ఎందుకు ?

"ఎందుకంటే మీ చిగుళ్లు గట్టిగా వుంటే
పళ్లు ఎక్కువ కాలం నిలుస్తాయి..."

**మరి కేవలం ఫోర్‌హాన్స్ మాత్రమే చిగుళ్లను గట్టి పర్చగల ప్రత్యేక అస్ట్రింజంట్ కల్గి వున్నది.**



అమెరికాదేశపు ప్రఖ్యాత దంత వైద్యుడు డా. ఆర్. జె. ఫోర్ హాన్ తాను తయారు చేసిన టూత్ పేస్టులో ఒక ప్రత్యేక అస్ట్రింజంట్ చేర్చాడు. ఇది నేరుగా చిగుళ్ల మీద పని చేసి, వాటిని బిగుతు చేసే ఒక విశిష్ట పదార్థము.

చిగుళ్లను బలపర్చి, పళ్ల మీద వాటికి మంచి పట్టు నిస్తుంది.

ఇలా మీ పళ్లకు దృఢమైన ఆధారం, దీర్ఘ ఆయుస్సు ఇస్తుంది.




**ఫోర్‌హాన్స్ - ఇది పళ్ల డాక్టరు సృష్టించిన టూత్ పేస్టు.**

338 F 172 TEL

ముఖచిత్రం: ఎస్. ఎస్. రతన్

రెండవ కవరు: సూరజ్ ఎన్. శర్మ

మూడవ కవరు: ఎల్. ఆర్. గ్రోవర్

# రచయితలకు ఆహ్వానం

వైవిధ్యంగల ఇతివృత్తాలతో, ఆసక్తికరమైన రచనా సంవిధానంగల నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. ప్రచురించే ప్రతి నవలకు రు.1500/-, అత్యుత్తమ నవలకు రు. 2000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే!

'చతుర'లో బొమ్మలు, ఇతర శీర్షికలుకాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్కన నవల వ్రాత ప్రతిలో మొత్తంమీద 26 వేల పదాలకు తక్కువ కాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో ఒక పేజీలో ఎన్ని పదాలు వచ్చాయనేదానినిబట్టి మొత్తం నవలలోని పదాలను సుమారుగా లెక్క చూసుకోవచ్చును. ప్రస్తుతం వివిధ మాస పత్రికలు ప్రచురిస్తున్న 112 పేజీల నవలలు 'చతుర'లో 70 పేజీలు మాత్రమే అవుతాయి.

* పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలించబడతాయి.
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించ వలసి వచ్చే పక్షంలో అందుకు అభ్యంతరంలేనివారే నవలలను పంపించగలరు.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతోపాటు తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.

## చతుర

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ – 500 004.

# ఉజ్వల ప్రపంచానికి కవాటాలు తెరుద్దాం... రండి!

జీవితంలో రకరకాల అవకాశాలు వస్తూ ఉంటాయి. వచ్చిన అవకాశాలను తెలివిగా ఉపయోగించుకొనే వారినే విజయం వరిస్తుంది. అవకాశాలు అంది రావడానికి డబ్బు అవరోధం కాకుండా మార్గదర్శి మీకు తోడ్పడుతుంది.

మార్గదర్శిలో మీ అవసరాలకు అనుగుణంగా వివిధ రకాల చిట్లు ఉన్నాయి. తేలికయిన వాయిదాల్లో మీరు పొదుపుచేసే వీలుంది. లాభసాటి డివిడెండ్లు కలుపుతూ పెరిగి పెద్దయ్యే మొత్తాన్ని తిరిగి మీరు పొంద వచ్చును. మీ జీవితమూ, మీ తోటివారి జీవితాలూ మరింత శోభాయమానం కావడానికి ఆ మొత్తం ఉపకరిస్తుంది. మార్గదర్శిలో పొదుపు చెయ్యడం నవజీవనానికి నాంది అని లక్షమందికి పైగా ఇప్పటికే గ్రహించారు. మరి, మీ మాటేమిటి?

డబ్బు కోసమేనా మీ చింత - మార్గదర్శి వున్నది మీ చెంత!

m

**మార్గదర్శి**

చిట్ ఫండ్ ప్రైవేటు లిమిటెడ్

మార్గదర్శి హౌస్, ఆబిద్ సెంటర్, హైదరాబాద్ - 500 001

శాఖలు: ● ఆబిద్ సెంటర్, హైదరాబాద్ ● లక్డీకాపూల్, హైదరాబాద్ ● చిక్కడపల్లి, హైదరాబాద్ ● అమీర్‌పేట, హైదరాబాద్ ● కాబ్రా కాంప్లెక్స్, ఎమ్.జి.రోడ్, సికిందరాబాద్ ● బిసెంట్ రోడ్, విజయవాడ ● బందరు రోడ్, విజయవాడ ● మెయిన్ రోడ్, గుంటూరు ● మెయిన్ రోడ్, కాకినాడ ● ఇన్నీసుపేట, రాజమండ్రి ● బళ్ళారి రోడ్, కర్నూలు ● మెయిన్ రోడ్, విశాఖపట్నం ● జె. పి. ఎన్. రోడ్, వరంగల్, ● వైరారోడ్, ఖమ్మం



# చతుర కతలు

## కల్తీ లేని మాయ

‘పొద్దున్న మా కుర్రాడికేం నూనెపోసి పంపావయ్యా? పాడుకంపు కొడుతోందది!” అని ఒక ఖాతాదారండే-

“వేరుశనగ నూనె ఇమ్మంటే మరేదో నూనెపోసి పంపేవేంటి శెట్టిగారూ. ఆ నూనె ఎంత కంపు కొడుతోందో చెప్పలేం” అని ఇంకొక వాడకందారన్నాడు.

“అయ్యా శెట్టిగారూ! పదేళ్ళుగా మీ దగ్గర సరుకులు తీసుకుంటున్నాంగదా. తెలిసినవాళ్ళన్న అభిమానమన్నా లేకుండా ఇంత పాడునూనె పోసి పంపితే ఎలా చెప్పండి?” అని ఇంకో పెద్దమనిషి నిష్ఠూరాలాడేడు.

శెట్టిగారు అందరికీ వినయంగా ఓ నమస్కారంచేసి-

“అయ్యా.. తప్పయిపోయింది. మా పసికుర్రాణ్ని పంపి గోదాములోంచి నూనె డబ్బా పట్టమ్మంటే తెలీక వాడీ డబ్బాను పట్టుకొచ్చాడు. కొత్త కుర్రాడు. వాడికేమీ తెలీదు. అడిగి తెలుసుకునే జ్ఞానం

ఉషా కిరణ్ మూవీస్

# శ్రీవారికి ప్రేమలేఖ

-జంధ్యాల-

రామోజీరావు

రమేష్‌నాయుడు

గోపాలరెడ్డి

నిర్మాణ నిర్వహణ: అట్లూరి రామారావు



Bhaskar





## ప్రవేశపెడుతున్నాం
## టియారా హెర్బల్ సబ్బు
## మీ వంటిని కోమలంగా నున్నగాచేసే
## ప్రకృతి సహజమైన నూనెలతో!

టియారా హెర్బల్ సబ్బు, ప్రకృతిలో లభించే మూడు వనమూలికల సమ్మేళనం. ప్రకృతి సహజమైన నూనెలతో మీ వంటిని కోమలంగా రూపొందిస్తూ, దాంతోబాటే శుభ్రపరచి, తాజాదనాన్నిస్తుంది. టియారా హెర్బల్ సబ్బుతో స్నానంలోని ఆ అనుభవాన్ని పొందండి. ఆ కోమలత్వపు సౌందర్యంతో అలాగే ఉండండి— కేవలం ప్రకృతే యివ్వగల ఆ తీరులో.









# టియారా
## హెర్బల్ సబ్బు

[illegible]ంటికివచ్చే ప్రకృతి సహజమైన కోమలత్వం.

లేదు. రేపీపాటికల్లా మరో డబ్బా తెప్పించి మీకంతా కల్తీలేని నూనె పోస్తాను. దయ చేసి మీరంతా రేపొద్దున్నే రండిబాబూ. జరిగిన ఈ పొరపాటుకు నన్ను మన్నిం చండి. నమస్కారం" అని అందర్నీ పంపించేశాడు శెట్టిగారు.

మర్నాడుదయం ఖాతాదార్లంతా నూనె డబ్బాలతో శెట్టిగారి దుకాణానికి హాజ రయ్యారు. శెట్టిగారు వాళ్ళందరి ఎదుటే సీలు చేసిన కొత్త డబ్బా మూతను కత్తి రించి అందులోంచి కొంత నూనెను ఓ పావులోకి వంచి అందరికీ చూపేరు. దాన్ని అందరూ వాసన చూసి బాగుం దంటే బాగుందన్నారు.

"అసలు నూనంటే ఇదయ్యా! ఇలాంటి నూనె ఇవ్వక నిన్న మాకేదో కంపుకొట్టే కల్తీనూనె ఇచ్చి పంపేవు" అని ఎవరికి తోచినట్టు వారు అనుకుంటూ 'కల్తీ' నూనెకు బదులు 'మంచి' నూనెను పోయించుకుని పొయ్యారు.

అస్సలేం జరిగిందంటే-

శెట్టిగారు పని కుర్రాణ్ని గోడౌం లోంచి ఒక మూలనున్న నూనె డబ్బాని పట్టమ్మంటే పొరపాటున వాడు మరో మూలనున్న డబ్బాని పట్టుకొచ్చాడు. శెట్టిగారు తెమ్మన్నది కల్తీ నూనె డబ్బాని. పనికుర్రాడు తెచ్చింది కల్తీ లేని నిఖార్సయిన నూనె డబ్బాని. కాని పదేళ్ళపైగా కల్తీనూనెను వాడే అలవాట యిన ఖాతాదార్లకు కల్తీలేని నూనె కంపు కొట్టింది! అతి స్వచ్ఛమైన నూనె ఎందుకూ పనికిరానిదయిపోయింది. శెట్టిగారు పొర పాటున మంచినూనె ఇస్తే ఖాతాదార్లకు అతని మీద నమ్మకం సన్నగిల్లింది. మళ్ళీ కల్తీ నూనె పోస్తే ఆయన మంచి వాడయిపోయాడు!

కల్తీలేని మాయంటే ఇదే!

—రామ్

# నమ్మిక

కొత్త పేటలతో, కొత్త బస్తీలతో, కొత్త కాలనీలతో అన్నివైపులా వేగంగా విస్తరి స్తున్న వటవృక్షం వంటి ఆ మహా నగరానికి ఒకే ఒక సమస్య పెద్ద బెడదగా పరిణమించింది.

ఈ నూతన నివాస ప్రదేశాలలో చెరిగేసిన మెరికల మాదిరి చెదురు మదురుగా వున్న ఇళ్లపై సాయుధ బంది పోట్లు దాడిచేసి దోచుకొనటం ఈమధ్య ఎక్కువైపోయింది. ఎడతెగకుండా దోపిడి దొంగలు సాగిస్తున్న ఈ దురాగతాల వల్ల ఈ ప్రాంతాల పౌరులు అరచేతులలో ప్రాణాలు పెట్టుకొని దినమొక గండంగా గడుపుతున్నారు. స్వీయ రక్షణకోసం సాధ్యమైనన్ని పాట్లు పడుతున్నారు.

ఇలా బిక్కుబిక్కుమంటూ బతుకు తున్న అనేక శివారు కాలనీల్లో ఒకటైన ఆ మధ్యతరగతి కాలనీ కాపురస్థులకు ఇటీవల కొంత ఉపశమనం కలిగింది. ఆ కాలనీలో ఈమధ్య ప్రతిరోజూ రాత్రి పూట ఓ లారీ వచ్చి నిలిచి వుండటమూ; డ్రైవరు, క్లీనరు, కూలీలు మొదలైన సదరు శకటం తాలూకు డజను మంది జనాభా కూడా ఆ లారీలోనే గడుపుతూ సందడిగా వుండటమూ ఈ ఊరట, ఉపశమనాలకు కారణం. ఈ వాహనం రోజూ కాలనీకి కలపనో, కంకరనో, ఇసుకనో, ఇనుమునో మోసుకొస్తూ, రాత్రిపూట ఇక్కడ మకాం చేస్తున్నదని వారు ఊహించారు. ఏది ఏమైనా అది తమకు అండగా, రక్షణగా




ఉంటున్నందుకు వారు ఆనందించారు. ఇప్పుడు వారు కలత నిద్రతో గడపటం లేదు. హాయిగా కునుకు తీస్తున్నారు. కంటినిండా నిద్రపోతున్నారు.

తమ పేటకు ఈ సామగ్రుల సరఫరా ఇలాగే ఇంకొంతకాలం అవిఘ్నంగా కొనసాగాలనీ, ఆ లారీ తమ కాలనీ నడిబొడ్డున ఆలాగే... ఆలాగే మరికొంత కాలం మజిలీలు చేస్తుండాలనీ వారు మనసారా కోరుకొన్నారు.

ఇలా ఓ వారం పదిరోజులు గడిచాయి. ఒకనాడు అర్ధరాత్రి ఆదమరచి నిద్రపోతున్న వారి ఇండ్లపై సాయిధ బందిపోట్లు మెరుపులా దాడిచేశారు. ముందు జాగ్రత్త మరచిపోయిన ఆ ఇండ్లవాళ్ళందరూ నిస్సహాయులై బిక్కమొహాలతో చూస్తుండగా ముసుగులతో, మారణాయుధాలతో వున్న దజనుమంది చోరాగ్రేసరులు మోయగలిగినంత సొత్తుతో, అక్కడ సిద్ధంగా ఉన్న లారీలో ఉడాయించారు.

'నమ్మించిదెబ్బకొట్టాలన్న'సూత్రాన్ని ఇంత లాఘవంగా అమలుపరచిన ఆ చోరశకట బృందం చాకచక్యానికి బాధితులు విస్తుపోయారు ఆ మర్నాడు తీరికగా.

—జనార్ధన్



ఉదయం పది గంటలవుతోంది.....

రెండంతస్థుల ఆ హాస్పిటల్ భవన పరిసరాల్లో సందడి పుంజుకుంటోంది.

హాస్పిటల్ ఆవరణలో తప్పని సరిగా వుండాల్సిన ప్రశాంతత, పరిశుభ్రత ఆ హాస్పిటల్‌లో మచ్చుకుకూడా కనిపించడం లేదు.

రకరకాల మందులు, లోషన్సు కలయిక వల్ల వచ్చే వింతవాసనతో ముక్కు పుటాలు బద్దలవుతున్నాయి. నర్సులు, తోటీలు, ఆయాలు హడావిడిగా తిరుగుతున్నారు.

అది డాక్టర్సు రౌండ్స్‌కు వెళ్ళే సమయం.....

డాక్టర్ కృష్ణమోహన్‌గారి వెంట రౌండ్సుకు బయలుదేరాను. డాక్టరుగారు ప్రతి రోగినీ ఆత్మీయంగా పలకరిస్తూ పరామర్శిస్తూ, వ్యాధికి సంబంధించిన ప్రశ్నలు వేస్తున్నారు.

"సిస్టర్! ఈ పేషంట్ బి. పి. నోట్ చేయండి"

"యస్ సర్"

డాక్టరుగారు ఇతర పరీక్షలు పూర్తి చేసే లోపలే పేషంట్ బి. పి చూసి ఛార్ట్ మీద నోట్ చేశాను.

బి. పి. నార్మల్‌గా వుంది.

డాక్టర్‌గారు ప్రిస్క్రైబ్ చేసిన ఇంజక్షన్ చేశాను. మాత్ర మింగించి మరో బెడ్ దగ్గరకు వెళ్ళిన డాక్టరుగార్ని అనుసరించాను.

"సిస్టర్ ! ఈ పేషంట్ కండిషన్ ఎలా వుంది....?" నిద్రపోతున్న ఆమె వంక చూస్తూ అడిగారు.

చెప్పాను.

డాక్టరుగారు చార్టుతీసి ఆ అమ్మాయి హెల్త్ కండిషన్ చూసి తృప్తిగా తల పంకించారు.

ఆ అమ్మాయికి పద్దెనిమిదేళ్ళుంటాయి.

సన్నగా, నాజూగ్గా, జాజి మొగ్గలా వుంది.

పేరు నీరజ. కాలేజీలో రెండో సంవత్సరం బి. యస్సీ చదువుతోంది. కథ మామూలే....

తన కలల రాకుమారుణ్ని పెద్దల ప్రమేయం లేకుండానే ఎన్నుకుంది.

అతనితో సినిమాలూ, షికార్లూ సాగించింది.

కథ ఎన్ని మలుపులు తిరిగినా చివరకు అతడు ఆమెనే వివాహం చేసుకుని తన గుండెల్లో దాచుకోడానికి అతడు సర్వగుణ శోభితుడైన సినీహీరో కాదు...మామూలు మనిషి. డబ్బు, పలుకుబడి తెచ్చిన డాంబికం తప్ప మరే సుగుణమూ లేని సగటు మనిషి.

అమ్మాయి అమ్మ కాబోతుందని తెలిసి వెంటనే ముఖం తప్పించేశాడు. సంగతి తల్లిదండ్రులకు చెప్పలేక, చెప్పకుండా వుండలేక నెలపాటు నరకం అనుభవించింది నీరజ.

ఆ తరువాత ఎవరూ చెప్పకుండానే విషయం అందరకూ అర్థంఅయి చెవులు కొరుక్కున్నారు.

తల్లీ దండ్రీ నెత్తీనోరూ కొట్టుకుని, ఈ కాలపు చదువులను కాసేపు తిట్టుకుని, చెట్టంత కూతుర్ని కొట్టలేకతమ చేతులతో తమ తలనే కొట్టుకుని అదా ఇదా ... అనేసరికి మరికొన్నాళ్ళు గడిచాయి.

ఆ తరువాత వాళ్ళకు తెలిసిన,తోచిన పద్ధతులతో అనాగరికంగా, మోటుగా నీరజ కడుపులో పెరుగుతున్న పాపాన్ని తొలగించ ప్రయత్నించారు. కానీ ఆ ప్రాణానికే పాపం అడ్డంతిరిగి పెద్ద




మోసం రావడంతో పరువూ ప్రతిష్ట తీసి గట్టునపెట్టి కడుపుతీపితో లబో దిబోమంటూ హాస్పిటల్‌లో చేర్చారు.

స్పృహలేని స్థితిలో హాస్పిటల్‌లో చేర్చబడ్డ నీరజ వారం రోజులుగా మృత్యువుతో పెనుగులాడుతోంది.

చివరికి 'థాంక్ గాడ్' అనుకున్నారు డాక్టర్లు.

ప్రమాదం తప్పినా నీరజ ఇంకా సంపూర్ణ ఆరోగ్యవంతురాలు కాలేదు.

ఈ షాక్‌లో ఆ అమ్మాయికి ప్రాణ భయం పట్టుకుంది.

బతుకుమీది కోరికతో తనను బతికించమని కేకలు పెడుతోంది నీరజ.

ఈ అమ్మాయిలు ఎందుకిలా తొందరపడి తమ జీవితాలను నాశనం చేసుకుంటారో...?

సెంటిమెంట్ల సినిమాలూ, ఆధునిక నవలా సాహిత్యం వీరిని తప్పుడు మార్గాన్ని పట్టిస్తున్నాయా?

కేవలం వయస్సు తెచ్చిన తొందరపాటు మాత్రమే కాకుండా, తాము త్వరపడి ఈ అవకాశాన్ని దక్కించుకోలేకపోతే మరెవరయినా ఈ అదృష్టాన్ని తన్నుకుపోతారనే భయం పనిచేస్తోందా?

నీతి అయినా, అవినీతి అయినా ఏదో విధంగా జీవితంలో సుఖప్రదమైన మార్గంలో స్థిరపడాలనే ఆరాటం ముందుకు నెట్టుతోందా?

రౌండ్స్ పూర్తయ్యాయి.

డాక్టరుగారు అలసటగా ఒక కుర్చీలో చేరగిలబడి బొటన వేలితో నుదురు ఒత్తుకుంటున్నారు.

ఆయన ముఖంలో అలసటా ... అశాంతీ....

డాక్టరుగారితో నా పరిచయం వారి కుటుంబ విషయాలు కూడా అడిగి తెలుసుకునేంతగా వుంది.

దానికి కారణం మా విశాల.

విశాల వయస్సులో నాకంటే పెద్దది అయినా నాకు స్నేహితురాలు, ఆత్మీయురాలు.

కబోర్డు సర్దుతూ ఆయన్ను గమనించాను.

కళ్ళు మూసుకుని ఈజీచైర్లో చేరగిలబడి కూర్చున్నారు. డిస్టర్బ్ చేయాలనిపించలేదు.

అయినా అడగకుండా వుండలేకపోయాను.

"డాక్టర్...."

"యస్..."

"ఇవాళ మూడీగా కనిపిస్తున్నారు"

ఏదో ఆలోచనలో వున్న డాక్టరుగారు వులిక్కిపడి కళ్లు తెరిచారు.

మళ్ళీ అదే ప్రశ్న వేశాను.

"విశాల ఆరోగ్యం బావుండలేదు సౌమ్యా"

నాకు తెలుసు. విశాల ఆరోగ్యం ఈమధ్య బాగా క్షీణించింది. తరచూ ఫిట్స్ వస్తున్నాయి.

"మళ్ళీ కంగారుపెట్టిందా?"

"ఈ ఉదయం మళ్ళీ ఫిట్ వచ్చింది. రెస్ట్ తీసుకోమంటే వినదు" బాధగా అన్నారు డాక్టరుగారు.

"ఆయనకేం రెస్ట్ తీసుకోమని బాగానే చెప్తారు. ఈ పిల్లలతో నాకెలా కుదుర్తుందే సౌమ్యా? రమణి పెద్దపిల్ల అన్నమాటేగానీ ఒక్కపనీ చేతకాదుగదా...?" అంటుంది విశాల.

డాక్టరుగారు విశాలను ఎంతగానో ప్రేమిస్తారు. కానీ, ఇంటి పనులలో ఆమెకేమీ సహాయం చెయ్యలేరు.

డాక్టరుగారు ఆ విషయంలో బొత్తిగా

అసమర్థులు.

విశాల పరిస్థితి నాకు బాధ కలిగించింది.

సాయంత్రం డ్యూటీ ముగించుకుని వెళ్ళి విశాలను చూసి రావాలని నిశ్చయించుకున్నాను.

సాయంత్రం ఐదుగంటలయింది.

అప్పటివరకూ నిప్పులు కురిసిన వాతావరణంలో అప్పుడప్పుడే కాస్త చల్లదనం ప్రవేశిస్తోంది.

గ్రీష్మతాపానికి పగలంతా గదుల్లోనే మగ్గిపోయిన రోగులు గూళ్ళు విడిచిన పక్షుల్లా అప్పుడప్పుడే కాస్త గాలి పీల్చుకునేందుకు చెట్లకిందికి చేరుతున్నారు.

నా స్థానంలో వచ్చిన డ్యూటీ నర్సుకు పేషంట్స్ కండీషన్సు... మెడిసిన్సు వివరించి డ్యూటీ అప్పగించాను.

హాస్పిటల్ నుండి బయటికి వచ్చేముందు ఒకసారి నీరజ బెడ్ దగ్గరకు వెళ్ళాను.

"మళ్ళా ఎప్పుడొస్తావు?" బెంగగా అడిగింది.

"రేపు నైట్ డ్యూటీ నాదే"

"అబ్బ. రేపు రాత్రికిగాని కనిపించవన్నమాట."

నాకు నవ్వు వచ్చింది.

అధిగమించిన శారీరక బాధల్లో మా నుండి చల్లని సేవలను స్వీకరించి, మమ్మల్ని అత్యంత ఆదరంగా ప్రేమించినట్లు కనిపించే ఈ మనుషులే ఆ బాధ తగ్గిపోయిన తరువాత మా ఉనికినే గమనించరు.

తమకు ఇలా సేవలుచేయడం కేవలం మా విద్యుక్తధర్మంగానే భావిస్తారు. కాకపోతే దానికి ప్రతిఫలం డబ్బురూపేణా ముట్టజెప్పి ఋణ విముక్తులు కావడానికి ప్రయత్నిస్తారేతప్ప తమ ప్రేమను, ఆదరాన్ని అందించరు.

మేముకూడాఅంతత్వరగానే వాళ్ళనూ, వాళ్ళ స్నేహాన్నీ మరచిపోతుంటాము.

కానీ నీరజ స్నేహంలో నాకలాంటి స్వార్థం, మోసం కనిపించలేదు. అర విరసిన గులాబీలా, మంచున తడిసిన మల్లెలా స్నిగ్ధంగావున్న నీరజ మనస్సు కూడా అంత నిర్మలంగానే వుంది.

"నీరజా ... చదువు అయిపోయిన తరువాత ఏం చేస్తావు?"

"ఏముందక్కా! దొరికితే ఉద్యోగం చేస్తాను"

"నేనోమాట అడుగుతాను. నీకు కోపం రాదుకదూ?"

నీరజ ముఖం మలినమయింది.

పాలిపోయిన పెదవులమీద శుష్కహాసం మెరిసి మాయమయ్యింది.

"అడుగక్కా...నీకు తెలీని రహస్యం నాకేముంది?"

"నీరజా! అతనిమీద నీకింకా ప్రేమ వుందా?" నాలో కుతూహలం తొంగి చూసింది.

నీరజ ఏమీ మాట్లాడకుండా ఆలోచిస్తున్నట్లు చూపులు శూన్యంలోకి గుచ్చి చూస్తోంది.

అతనిమీద తనకింకా ప్రేమ వుందో, లేదో తేల్చుకోలేకపోతోందా? లేక మౌనం అర్ధాంగీకారమా??

ఆ మె తీ రు చూ స్తే "ఉ ం ది" అంటుందేమో అనే భయంతో, ఆ మాట వినేందుకు ఇష్టంలేక, "నిన్నింత మోసం చేసిన అతనంటే నీకేమీ కోపంగా లేదూ?" అన్నాను.

ఈసారి "ఉంది"! అంటుందనే ఆశతో.

నీరజ! ఈసారీ సమాధానం చెప్పలేక

ఆత్మాభిమానం ఎందుకుండదు?

తమనంతగా మోసం చేసినవాడు కనిపిస్తే కాల్చిపారేయాలని వీళ్ళకెందుకు అనిపించదూ?

వాడి తలదన్నేవాణ్ని చేసుకుని వాడి ముఖాన తన్నినట్లు బతకాలని ఎందుకు అనుకోరూ?

పోయింది.

"నీరజా! అతను ఒప్పుకుంటే ఇప్పుడతన్ని చేసుకుంటావా?"

నీరజ చటుక్కున తల ఎత్తింది.

క్షణకాలం ఆ కళ్ళు ఆశతో మెరవడం నేను గమనించకపోలేదు.

నాకు చిరాకువేసింది.

ఏమిటీ ఆడవాళ్లు...వాళ్ళ ఆకర్షణలు..

నమ్మించి నట్టేటముంచి, చావుబతుకుల మధ్య వదిలిపోయినవాణ్ణి ఇంకా ప్రేమిస్తున్నాననుకోవడం, వాడే కావాలని దేబిరించడం తప్ప ఈ ఆడవాళ్ళకు

ఇంకా వాడిమీద ప్రేమ, ఆకర్షణ వుండేందుకు వీళ్ళది ఎలాంటి హృదయం? అదేమన్నా జడపదార్థమా?

వాడు ఇక ఈ పిల్లను ఎలాగూ చేసుకోడు. మరి తరువాత ఈ పిల్ల భవిష్యత్?

అదే అడిగాను.

"ఏముందక్కా! ఏదయినా ఉద్యోగం చేసుకుని బతుకుతాను."

"అంటే ఇంక పెళ్ళి చేసుకోవా?"

"ఎలాగక్కా! మలినమయిన ఈ శరీరాన్ని మరొకరికి ఎలా ఇవ్వను?" బేలగా అడిగింది నీరజ.

శరీరం చెడిపోవడానికి అదేమన్నా 'గుమ్మడికాయా'? పవిత్రత అనేది కేవలం మనస్సుకు సంబంధించినది మాత్రమే కాని, శరీరానికి సంబంధించినది ఎంతమాత్రం కాదు.




నమ్మించి గొంతు కోసిన వాడిని ద్వేషించి, మరో సహృదయుణ్ణి పెళ్ళి చేసుకుని నిండు మనస్సుతో అతన్ని ప్రేమించి సంసారం సాగిస్తే అది పాపం ఎలా అవుతుంది...?

అది ఎవరినీ మోసగించినట్లు కాదే... ఎవరికీ దానివల్ల అన్యాయం జరగదే... మరి అది పాపం ఎలా అవుతుంది...? మోసగించిన వాడి పేరే జీవితమంతా జపిస్తూ బతుకును కష్టాలమయం, కన్నీటి ప్రవాహం చేసుకుంటే అది పాతి వ్రత్యం అవుతుందా...?

జీవితం అనేది ఒక అపురూపమైన వరం. దాన్ని అందంగా మలచుకుని, ఆనందాన్ని నింపుకుని మనం సుఖపడుతూ నలుగురి క్షేమం కాంక్షిస్తేనే జీవితానికి సార్థకత. కావాలని బతుకులో కష్టాలూ, కన్నీళ్ళూ కొనితెచ్చుకోడం వివేకంకాదు.

ఈ విషయాన్నే నీరజకు చెప్పాను.

నీరజ కాబట్టే ఇంతగా నచ్చజెప్పాను.

నిజానికి నాకు అభిమానం లేని ఆడ వాళ్ళంటే చచ్చేంత అసహ్యం.

చాలా మంది ఆడవాళ్ళు అభిమానాన్ని చంపుకుని ప్రేమను దేవిరిస్తుంటారు.

కానీ ఆత్మాభిమానాన్ని నిలుపుకో డానికి ప్రేమ, ఐశ్వర్యం అంతేకాదు తన సనుకున్న సర్వాన్నీ త్యాగం చెయ్య గలగడమే గొప్ప వ్యక్తిత్వం.

నీరజ ఆలోచిస్తూ కూర్చుంది.

ఆమెను అలా ఆలోచనలకు వదిలి పెట్టి నేను బయటికి వచ్చేశాను.

ఆ హాస్పిటల్, ఆ వాతావరణం, మందుల వాసనా, రోగులూ, వారి బాధలూ, అవేవీ తమకు పట్టనట్లుగా అటూ ఇటూ విసావిసా తిరిగే డాక్టర్లూ, నర్సులూ, వారి నుండి సేవలు పొందాలని చూసే రోగులూ... అక్కడ వున్నంతసేపూ నా ప్రాణం ఉక్కిరిబిక్కిరిగా వుంటుంది.

ఇది నా వృత్తిధర్మం ప్రకారం సరి యైన లక్షణం కాదు. కానీ, ఇది నాకు నచ్చని వృత్తి...నా మానసిక ప్రవృత్తికి నప్పని వృత్తి...విధి బలవంతంగా నా మెడకు చుట్టిన వృత్తి. ప్రతి వ్యక్తి తను చేపట్టిన వృత్తిని ప్రేమించి గౌరవించ గలగాలి. అప్పుడే వారా వృత్తికి న్యాయం చెయ్యగలరు. అందులోని తృప్తిని పొందగలరు.

కానీ, దురదృష్టవశాత్తూ నేనుమాత్రం నా వృత్తిని గౌరవించగలనేగానీ ప్రేమించ లేను.

ఆలోచిస్తూ నడుస్తున్న నేను డాక్టరు గారిల్లు, మరో రెండిళ్ళూ దాటేశాననే విషయం గుర్తించి, నా పరధ్యానానికి విసుక్కుంటూ వెనక్కు వచ్చి డాక్టరు గారింట్లో అడుగుపెట్టాను.

ఇల్లంతా నానా గందరగోళంగావుంది.

ఏడుస్తున్న పసిపాప చిన్నిని సముదా యించలేక వీపు మీద రెండు చరుస్తోంది రమణి.

చిన్నిని అందుకుని భుజంమీద వేసు కున్నాను.

"ఎందుకే దాన్నలా కొడుతున్నావ్ రమణీ..." లోపలి నుండి విశాల హీన స్వరం వినిపించింది

"రమణీ! అమ్మకు ఎలా వుంది...?"

"ఉదయం ఫిట్ వచ్చింది ఆంటీ...లేవ లేదు"

చిన్నిని భుజాన వేసుకునే విశాల గదిలోకి అడుగు పెట్టాను.

నా అడుగుల చప్పుడుకు విశాలకళ్ళు తెరిచింది.

పేలవమైన చిరునవ్వుతో నన్ను ఆహ్వా

నించింది. నన్ను కరుచుకుపోయిన చిన్ని ఇంకా వెక్కుతోనే వుంది.

"ఎలా వుంది విశాలా...?" మంచం మీద కూర్చుంటూ అడిగాను.

విశాల నవ్వింది.

పాలిపోయినట్లున్న ఆ ముఖంలో ఆ నవ్వు యొక్క కాంతి ప్రతిఫలించనే లేదు.

"నర్సు బుద్ధి పోనిచ్చుకున్నావు కాదు..." అంది నీరసంగా నవ్వుతూ. నేనూ నవ్వేశాను.

"బావున్నావా సౌమ్యా...." అంది ఆప్యాయంగా నా చేతిని అందుకుంటూ.

"సరి... సరి.... నాకేమయింది....? కానీ నువ్వేమిటిలా అయిపోయావు బొత్తిగా" అన్నాను.

గొంతుపరకూ దుప్పటి కప్పుకున్న విశాల మంచానికి అతుక్కుపోయినట్లుగా చాలా బలహీనంగా వుంది.

నలుగురు పిల్లల తల్లి విశాల. కొందరు ఎంత చదువుకున్నా కొన్ని కొన్ని మూర్ఖత్వాలనుండి బయటపడలేరు.

విశాలా అంతే...

కొడుకుని ఎత్తుకోవాలనే ఆశతో మరుసగా నలుగురు ఆడపిల్లలకు తల్లి అయింది.

నాలుగో కాన్పులో మరి కోలుకోలేనట్లుగా ఆరోగ్యం దెబ్బతింది.

"అమ్మా రమణీ! ఆంటీకి టీ కలుపుకు రామ్మా!"

నూతిలోనుండి పిలిచినట్లుగా పిలిచింది విశాల.

"ఒద్దు విశాలా... నాకోసం పిల్లల్ని ఇబ్బంది పెట్టకు"

ఏడుస్తూ, వెక్కుతూ నా భుజంమీద నిద్రపోయిన చిన్నిని మంచంమీద పడుకోబెట్టి వంటింట్లోకి నడిచాను.

కిందా పైనా పారబోస్తూ మణి వచ్చీరాని విధంగా బియ్యం గాలిస్తోంది. రమణి గిన్నెలన్నీ ముందేసుకుని తోముతూ కూర్చుంది.

చిన్నారి చిట్టి చిట్టిచిట్టి అడుగులతో అక్కలిద్దరికీ అడిగినవి అందిస్తూ సాయం చేస్తోంది.

ముగ్గురి పిల్లల్ని ఆ స్థితిలో చూసిన నాకు కళ్ళు చెమ్మగిల్లాయి. తల్లి అనారోగ్యంతో పిల్లలు నెమ్మదిగా ఇంటి పనులకు అలవాటుపడుతున్నా ఆ పని భారం వాళ్ళ వయస్సుకు మించిందిగానే వుంది.

గబగబా స్టౌ వెలిగించి పాలు వెచ్చబెట్టి హార్లిక్సు కలిపి విశాలకు తాగించి వెంటనే వంటగదిలోకి వచ్చాను. బియ్యంతో అవస్థ పడుతున్న మణి చేతిలోని బియ్యంగిన్నె అందుకున్నాను.

"ఆంటీ ఆంటీ" అంటూ పిల్లలు ముగ్గురూ దగ్గర చేరి కబుర్లు చెబుతోంటే వంట పూర్తిచేశాను.

అప్పటికే తూగుతోన్న చిట్టితోపాటు రమణికీ, మణికీ భోజనం వడ్డించి విశాల దగ్గరకు వచ్చాను.

"సౌమ్యా! నిన్ను శ్రమ పెట్టినట్లున్నారు పిల్లలు... ఉండే లేనిదాన్నయ్యాను.,." విశాల నిట్టూర్చింది.

"చాల్లే. ఈ కబుర్లు ఎప్పటినుండి?" కసురుకున్నాను. ఆ తరువాత విశాలతో కబుర్లు చెబుతూ మరికాసేపు గడిపి ఇంటికి బయలుదేరాను.

పురోగమిస్తున్న ఆధునిక యుగంలో కూడా కొడుకు కావాలనే మూర్ఖపు పట్టుదలతో ఆరోగ్యం చెడగొట్టుకున్న విశాలను చూస్తూ వ్యధ చెందుతుంటారు డాక్టరుగారు.

బలవంతంగానైనా ఆమెకు ఆపరేషన్




చేయించడంగానీ, కనీసం తను చేయించుకోడంగానీ చేయనందుకు పశ్చాత్తాప పడుతుంటాడు ఇప్పుడు.

ఆలోచిస్తూనే ఇల్లు చేరుకున్నాను.

"అరే, బొంగరాల బుగ్గలున్న చిన్నది వచ్చిందిరోయ్"

తాళాలు తీస్తున్న నా చేతులు వణికాయి.

"ఒరేయ్! నాకు తెలీక అడుగుతాన్రా. డ్యూటీ నాలుగింటితోనే అయిపోతుంది కదా....ఇది ఇప్పటివరకూ ఏం చేస్తూన్నట్లురా...?"

ఎదురింటి అరుగుమీది అల్లరిమూక విసుర్లు వెనకనుండి గుచ్చుకుంటుండగా గబగబా తలుపు తెరిచాను.

"కంపెనీకి వెళ్ళి వచ్చిందేమోరా..."

"కాదులేరా. ఏ కుర్ర డాక్టరుకో చలి మంట వేసి వుంటుంది"

తలుపులు మూసుకున్నా విసుర్లు వినిపిస్తూనే వున్నాయి.

అయినా అలవాటయిపోయింది.

నా రాకపోకల టైం టేబిల్ అంతా వీళ్ళకే కావాలి.

నేను ఆలస్యంగా వస్తే ఆదుర్దా పడటానికి గానీ, పట్టించుకోడానికి గానీ నా వాళ్ళంటూ ఎవరూ లేకపోయినా వీళ్ళకు మాత్రం నా గురించిన సమాచారం తప్పనిసరిగా అవసరం.

నా మంచి చెడ్డలు వీళ్ళకు అక్కర లేకపోయినా నా నడత వీళ్ళకు అవసరమైన విషయం.

కూజాలోని చల్లని నీళ్ళుతాగి పడక మీద వాలాను. విశాల బలవంతంతో డాక్టరుగారింట్లోనే భోజనం పూర్తి కావడంతో మరి యిక వంటబాధలేదు.

అలవాటు ప్రకారం ఆలోచన్లు జోరీగల్లా ముసురుకున్నాయి.

అమ్మయ్య....మరో గంటో, రెండు గంటలకో నిద్రపడితే ఈరోజు గడిచి పోతుంది.

ఇలా జీవితంలో ఎన్నిరోజులు బలవంతంగా నెట్టుకెళ్ళనూ...?

నావంటివాళ్ళకు జీవితంలో ప్రతిరోజూ, 'అమ్మయ్య గడిచింది' అనుకునేంత భారంగా సాగిపోతాయి.

సంతోషంలో వున్నప్పుడు రోజులు క్షణాల్లా, దుఃఖంలో వున్నప్పుడు నిమిషాలు యుగాల్లాగానూగడుస్తుంటాయి.

నాకు ఒక్కోరోజు ఒక్కో యుగం.

నిశ్చింత నిండిన బాల్యం జ్ఞాపకం వచ్చి కళ్ళు నిండుకున్నాయి.

అమ్మా, నాన్నా, నేనూ...చింతలులేని చిన్న కుటుంబం.

అమ్మా, నాన్నా ఒకరికోసం ఒకరు పుట్టారా అన్నట్లుగా ఒద్దికగా, అన్యోన్యంగా వుండేవాళ్ళు.

అమ్మా, నాన్నా కూడా వుద్యోగస్థులవడం వల్ల ఆర్థికపరమైన ఇబ్బందులేవీ లేకుండా హాయిగాసాగిపోయేది సంసారం.

అప్పటికి తను 'టెన్త్' చదువుతోంది.

"బేబిని డాక్టరు చదివిద్దామండీ..." అమ్మ కోరిక.

"బేబిని యమ్.యస్సీ చేయించి లెక్చరర్‌ను చేద్దాం"

నాన్నకు ఉపాధ్యాయ వృత్తి అంటే అంత అభిమానం.

"కాదు. డాక్టరునే చేద్దాం"

"వీల్లేదు. లెక్చరర్‌నే చేద్దాం"

"కాదు"

"అవును"

"బేబీ నా మాట వింటుంది..." కన్న తల్లిగా అమ్మ ధైర్యం.

"అదేంకాదు. బేబీ నా మాటే

వింటుంది" యజమానిగా నాన్న ధీమా.

"సౌమ్యా..నువ్వు డాక్టరు చదవ్వూ"

"ఊహుఁ" అన్నాను తల అడ్డంగా తిప్పుతూ.

విజయగర్వంతో నాన్న అమ్మ వైపు చూస్తూ కొంటెగా నవ్వారు.

రోషంతో అమ్మ ముఖం పక్కకు తిప్పుకుంది. అమ్మను అలా చూస్తున్న నాకు అందమైన కావ్యనాయిక గుర్తొస్తుంటుంది.

"బేబీ! నువ్వు లెక్చరర్ అవుతావు కదురా..."

"ఊహుఁ..." అన్నాను మళ్ళీ తల అడ్డంగా తిప్పుతూ.

ఒక్కక్షణం ఇద్దరూ తెల్లబోయారు.

ఆ తరువాత "మరి...?" అన్నారు కోరస్‌గా.

వాళ్ళను ఆట పట్టించాలనిపించింది.

"పెళ్ళి చేసుకుంటాను..." అన్నాను అమాయకంగా ముఖం పెట్టి.

అమ్మా, నాన్నలు ఒక్కసారిగా ఫక్కుమన్నారు.

జలతరంగిణి మోగించినట్లుగా తెరలు తెరలుగా నవ్వుకున్నారు.

అందమైన కల కరిగిపోయినట్లుగా పక్కకు వత్తిగిలి పడుకున్నాను. కంటి చివరలగుండా జారిపోతున్న కన్నీటి జాలు అలవాటుగా దిండులోకి ఇంకిపోతోంది.

మరో కంటిగుండా జారిన కన్నీటి బిందువు ముక్కుమీద ముత్యంలా లైటు కాంతికి తళుక్కుమంది.

ఔను-ఒకోకంటికిఒకోరకంకన్నీరు...

ఒకో గుండెకు ఒకోరకం ఆవేదన...

టిప్‌టాప్‌గా ముస్తాబై స్వేచ్ఛగా తిరిగే నా కంటి నీరు ఏ కంటికీ కనిపిస్తుంది.... నాకు తప్ప.




ఉదయం హాస్పిటల్‌లో ఓ. పి. దాటి, జనరల్ వార్డులో అడుగు పెడ్తూనే మేరీ పరుగెత్తుకుంటూ ఎదురు వచ్చింది.

"సౌమ్యా... వచ్చావా....? నీగురించే ఎదురు చూస్తున్నాను...." అంది కంగారుగా.

మేరీ కంగారు చూస్తే ఆశ్చర్యం వేసింది.

"ఏమిటి మేరీ...? ఏం జరిగింది...?"

"డాక్టర్ కృష్ణమోహన్‌గారి భార్య లేదూ..."

"ఆఁ....విశాల....ఏం జరిగింది?"

నాకు కంగారుగా వుంది; ఆత్రుతగా వుంది.ఏం జరిగిందోననే భయంగా వుంది.

"విశాల ఒళ్ళంతా కాలిపోయింది."

ఒక్కక్షణం మాట రానట్లుగా అయిపోయాను.

నేను వింటున్నదేమిటో అర్థం కానట్లుగా మెదడంతా శూన్యంగా అయిపోయింది.

"ఇప్పుడెక్కడుంది...?" అన్నాను చివరికెలాగో.

"బ్లాక్ రూంలో వుంది. రా.... చూద్దువుగాని..." అంటూ చెయ్యి పట్టుకుని నడిపించుకుని వెళ్ళింది మేరీ.

నా మెదడు మొద్దుబారిపోయింది.

నోటి దుర్వాసన పోగొట్టుకోండి...
దంత క్షయాన్ని ఎదుర్కోండి.




ఎలాగో చూడండి:



మీ పళ్లలో ఇరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి.



కోల్గేట్‌లోని అద్వితీయమైన శక్తి గల నురుగు లోతుగా దూసుకుపోయి, హానికరమైన ఆహారపు తునకలని, సూక్ష్మజీవులని తొలగిస్తుంది.



ఫలితం: ఆత్మవిశ్వాసాన్నిచ్చే తాజా శ్వాస, దంతక్షయం నుంచి రక్షణ, ఆరోగ్యమైన గట్టి పళ్లు.

కోల్గేట్ తాలూకు నమ్మకమైన ఫార్ములా మీ నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా వుండేలా చేస్తుంది...
మీ పళ్ల ఆరోగ్యంగా, దృఢంగా వుండేలా చేస్తుంది.

గుర్తుంచుకోండి, ప్రతిసారి భోజనం కాగానే కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో పళ్లు బ్రష్ చేసుకోండి. నోటి దుర్వాసన పోగొట్టుకోండి...దంతక్షయాన్ని ఎదుర్కోండి.

**దీని తాజా పిప్పరమెంట్ రుచి మీ కెంతో నచ్చుతుంది!**

ఏ ఆలోచనా సాగడం లేదు.... ఆశ్చర్యం తప్ప.

బ్లాక్ రూంలో విశాలను చూస్తూనే వణికిపోయాను.

నిన్న నేను మాట్లాడిన విశాల ఈమే నంటే నమ్మశక్యం కావడం లేదు.

విశాల శరీరం చాలా భాగం కాలి నల్లగా వికృతంగా వుంది.

ముఖం భయంకరంగా తయారయింది.

శరీరం మీది ఆచ్ఛాదన అంతా తొలగించి మంచం చుట్టూ నెట్ వేశారు.

విశాల చావు బతుకుల మధ్య నరక యాతన పడుతూ హృదయ విదారకంగా మూల్గుతోంది.

ముఖమూ,పొత్తికడుపూ కాలి గదంతా కవురు వాసన వేస్తోంది.

ఇలాంటి కేసులు చాలానే చూశాను.

రోజూ ఎన్నో మరణాలు చూస్తూనే వున్నాను.

కానీ, ఆప్తులను ఎప్పుడూ ఇలాంటి పరిస్థితిలో చూడని నేను తట్టుకోలేక పోయాను.

ఏడుస్తూ మంచందగ్గర కూలిపోయాను.

మేరీ నన్ను భుజాలు పట్టుకుని బయటికి తీసుకువచ్చింది.

"చూడు సౌమ్యా! మనం నర్సులం. మనకిలాంటివి కొత్తకాదు. నువ్వే ఇలా బెంబేలు పడితే ఎలా...? నీకు పిల్లలు బాగా అలవాటు కదూ. కాస్త వాళ్ళను దగ్గరకు తీసుకో... భయపడుతున్నారు" అంది అనునయంగా.

అప్పటికి నాకు పిల్లలు గుర్తుకు వచ్చారు.

పిల్లలు ముగ్గురూ వరండాలోకూర్చుని ఏడుస్తున్నారు.

ఇద్దరు పిల్లలూ తల్లి గురించి ఏడుస్తున్నారు. చిన్ని మాత్రం ఏమీ తెలీక అక్కలను చూసి భయపడి ఏడుస్తోంది.

చిన్నిని చేతుల్లోకి తీసుకున్నాను.

నా గుండె చెరువయ్యింది. చిన్నిని గుండెలకు హత్తుకుని వెక్కివెక్కి ఏడ్చాను. దుఃఖపు అల ఉవ్వెత్తునలేచి విరిగి గుండెను తాకింది.

"రమణీ....ఎలా....?" నా గొంతు నుండి మాటలు పెగిలి రావడం లేదు. మోకాళ్ళ మీద తల పెట్టుకుని ఏడుస్తున్న రమణి తల ఎత్తి చూసింది.

కళ్ళు ఎర్రగా వాచివున్నాయి.

రమణి, మణి వెక్కుతూనే విషయం చెప్పారు.

చిన్నిని భుజాన వేసుకుని చిల్డ్రెన్ వార్డు వైపు పరుగు తీశాను.

చిట్టి ముఖం, చేతులూ అక్కడక్కడా కాలివున్నాయి.

మందు రాసిన ముఖం ఒకపక్క నల్లగా కనిపిస్తోంది.

నన్ను చూస్తూనే చిట్టి కళ్ళల్లో నీళ్ళు నిండుకున్నాయి.

"ఆంటీ...." అంటూ నన్ను పట్టుకుని ఏడ్చేసింది.

ఓదార్చేందుకు మాటలే లేని నేనూ ఏడుస్తూ ఎదురుగా కూర్చున్నాను.

"ఆంటీ....అమ్మకు ఎలావుంది...?"

చిట్టి ప్రశ్నకు నేనేమని జవాబు చెప్పను?

మృత్యువు అమ్మ మంచం దగ్గరే పొంచి వుందని చెప్పనా?

మరో రెండు, మూడు గంటల్లో అమ్మ మనల్ని విడిచి మరో లోకం చేరుకోబోతోందని చెప్పనా?

లేదూ, నవ్వుగా 'ఫరవాలేదమ్మా.




అమ్మకు తగ్గిపోతుంద'నిఅబద్ధం చెప్పనా? "అమ్మా" అంటూ అలమటించి పోతున్న ఆ చిన్నారి పాపల్ని ఎలా ఓదార్చను?

"ఆంటీ...అమ్మ"

"అమ్మకు త్వరలోనే తగ్గిపోతుం దమ్మా" అన్నాను గుండెలు కూడదీసుకుని.

నా గొంతు నాకే కృతకంగా వినిపించింది.

నర్సుగా విశాలకు నేనేమీ చెయ్యలేను.

నాకంతటి మనస్థయిర్యం లేదు.

విశాల బాధ చూస్తుంటే, ఇంత బాధ భరించేందుకు ఈ అమాయకురాలు చేసిన పాపం ఏమిటి అనిపించింది.

విశాల మరణం తథ్యం.

కానీ, డాక్టర్లు చివరి వరకూ మృత్యువుతో పోరాడుతూనే వున్నారు. ప్రేతంలా వున్న విశాల బాధకు ఓర్వలేక హృదయ విదారకంగా రోదిస్తూంటే ఆ బాధను పంచుకోలేకా, తీసెయ్యలేకా ఆ క్షణంలో విశాల త్వరగా చచ్చిపోతే బావుండును అనుకున్నాను.

ఆ మధ్యాహ్నానికల్లా పొంచివున్న మృత్యువు విశాలను కబళించింది. భూమి మీదే నరకాన్ని అనుభవించిన విశాల అన్ని బాధలకు అతీతంగా అచేతనంగాపడివుంది.

తెలిసినంత వరకూ డాక్టరుగారి బంధువులకూ, విశాల బంధువులకూ టెలిగ్రాంలు వెళ్ళాయి.

పిల్లల బాధ్యత విశాలగానీ, డాక్టరుగారు గానీ నాకు అప్పచెప్పకపోయినా ఆ బాధ్యత నా పరమైంది.

విశాలకు స్వంత అక్క జానకమ్మ తప్ప ఎవరూ లేరు.

ఆమె రాలేదు.

నా దుఃఖాన్ని నాలోనే ఇముడ్చుకుని పిల్లల్ని ఓదార్చాను.

విశాల అంత్యక్రియల సన్నాహం జరుగుతోంది.

డాక్టరుగారు నాకెక్కడా కనిపించ లేదు.

"రమణీ! నాన్నగారు ఏరమ్మా?"

రమణి ఏడ్చి ఏడ్చి పొడారిపోయిన కళ్ళెత్తి నిర్లిప్తంగా చూసింది.

"అమ్మను ఆ స్థితిలో చూడలేక నాన్నగారు తల గోడకు కొట్టుకుని ఏడుస్తూంటే డాక్టర్ శర్మగారు నాన్నకు ఏదో ఇంజక్షన్ ఇచ్చారు ఆంటీ. అప్పటినుండి నాన్నగారు స్పృహలోలేరు''

మత్తు ఇంజక్షన్ ఇచ్చివుంటారు డాక్టర్ శర్మగారు.

చీకటిపడే వేళకల్లా అగ్నిమిగల్చగా మిగిలిన విశాల శరీరమనే మాంసపు ముద్దకు అంత్యక్రియలు పూర్తయ్యాయి.

చిట్టి హాస్పిటల్‌లోనే వుంది.

వచ్చిన ఒకరిద్దరు బంధువులు వెళ్లిపోయారు.

'పిల్లలు ఎలా...?' అనే విషయం ఒక్కరి ఆలోచనలోకి వచ్చినట్లు కనిపించలేదు.

కాలం విశాలను తన గర్భంలో కలుపుకోగా పిల్లలు బిక్కుబిక్కుమంటూ వంటరిగా మిగిలిపోయారు.

* * *

నెలరోజులు గడిచిపోయాయి...

బంధువులు అందరూ వెళ్ళిపోయారు. ఆ ఇంట్లో ప్రతి అంగుళంలోనూ విశాల లేని లోటు కనిపిస్తూనే వున్నా రోజులు ఎవరికొరకూ మేము ఆగము సుమా అన్నట్లుగా సాగిపోతూనే వున్నాయి.

నాకు ఆ ఇంట్లోంచి అడుగు

కదిపేందుకు వీల్లేక పోయింది.

డాక్టరుగారు ఆయన గది వదిలి అసలు బయటికే రారు.

బిక్కు-బిక్కు-మంటూ ఇంట్లో తిరుగుతున్న పిల్లల మొహాలు చూస్తుంటే కళ్ళు చెరువులే అవుతున్నాయి.

చిట్టిని హాస్పిటల్ నుండి డిశ్చార్జి చేశారు.

డాక్టరు గారికి భోజనం పెట్టడం ఏ పూటకు ఆ పూటే బ్రహ్మప్రళయం అయిపోతోంది.

డాక్టరుగారికి భోజనం తీసుకుని గదిలోకి వెళ్ళాను.

కళ్ళమీద చేతులు పెట్టుకుని వెల్లకిలా పడుకున్నారు.

ఆయన నిద్రపోవడం లేదు.

ఉపవాసాలతో మార్ఫియా మత్తులో లోతుకుపోయి గుంటలు పడిన ఆ కళ్ళనుండి ఒక్కొ కన్నీటి బిందువే జారుతోంది.

భోజన పదార్థాలు బల్లమీద పెడుతూ చిన్నగా చప్పుడు చేశాను.

కళ్ళు తుడుచుకుంటూ ఆయన తలెత్తి చూశారు.

పెరిగిన గడ్డం, లోతుకు పోయిన కళ్ళూ, శిథిలమైన శరీరం...

మార్ఫియా ఆయన శరీరం మీద తన ప్రభావాన్ని పూర్తిగా చూపుతోంది. విశాల మరణం ఆయన్నెంతగా క్రుంగదీసిందో వివరించడం తేలికైన విషయంకాదు. అసలు ఈయన డాక్టరు కృష్ణమోహన్ యేనా అనిపిస్తున్నారు.

"లేచి భోంచేయండి"

"వద్దు సౌమ్యా... ఆకలిలేదు"

"నిన్నటినుండీ మీరేమీ తినలేదు" గుర్తుచేశాను.

"మీరు పిల్లలకోసమైనా ధైర్యంగా వుండక తప్పదు. మిమ్మల్నిలా చూస్తూ వాళ్ళెంత భయపడుతున్నారో మీకు తెలీడం లేదు"

ఆయన ఎలాగయినా మామూలు మనిషి కావాలి.

ఆయన కాస్త మనుషుల్లో పడితే నేను వెళ్ళిపోవచ్చు...

ఇంకెన్నాళ్ళు ఈ ఇంట్లో వుండను...?

నాకెవరూ పెట్టి పోయక పోయినా, నా కష్టం సుఖం అక్కర్లేకపోయినా, నన్ను వెయ్యి కళ్ళతో కనిపెట్టి చూసే లోకం వుందిగా...!

డాక్టరుగారు భోజనానికి లేచే ప్రయత్నం ఏమీ చెయ్యకపోవడంతో మళ్ళీ హెచ్చరించాను.

"ఫర్వాలేదులే సౌమ్యా... భోజనం చెయ్యకపోయినా నేను అంత త్వరగా చచ్చిపోను"

"డాక్టర్...ఎందుకు మిమ్మల్ని మీరలా నిందించుకుంటారు? ఇందులో మీరు చేసిన నేరం ఏముంది....?"

"నేను చేసిన నేరం లేకపోవడం ఏం సౌమ్యా... విశాల మరణానికి నేను కాదూ కారణం?"

కిటికీలోనుండి నిర్లిప్తంగా శూన్యంలోకి చూస్తూ అన్నారు డాక్టరుగారు.

"మీరా!?" ఆశ్చర్యంగా నోరు తెరిచాను.

"ఆఁ... అవును. విశాల మరణానికి పరోక్షంగా కారణం నేనే" ఆయన వ్యధంగా అన్నారు.

నేను మౌనంగా ఆలోచిస్తున్నాను.

స్టౌ వెలిగిస్తూ ఫిట్ వచ్చి పడిపోయిందట విశాల. అప్పటికే అంటుకున్న స్టౌ విశాల చీరకు అంటుకోడం, వెంటనే

మంట అందుకోడం జరిగిపోయిందట. దగ్గర ఎవరూ లేకపోయేప్పటికి ప్రమాదం జరిగిపోయింది. దగ్గరేవున్న చిట్టి తల్లి ఒంటికి మంటలు అంటుకోడం చూసి భయంతో కేకలువేస్తూ తల్లిని చుట్టుకు పోయిందట.

కేకలు విని చిన్నా పెద్దా పోగయ్యే సరికి పరిస్థితి చేయిదాటిపోయింది. చిట్టి మాత్రం చిన్న చిన్న గాయాలతో బయట పడింది.

మరి విశాల చనిపోవడంలో డాక్టరు గారి ప్రమేయం ఏముంది...?

"సౌమ్యా... నిజంగా నేనొక చదువు కున్న మూర్ఖుడిని. కొడుకుమీది కోరికతో విశాల పిల్లలుకనే యంత్రంగా మారి పోతుంటే నచ్చచెప్పలేని అసమర్థుడ్నె అయ్యాను. అప్పుడు నాకు విశాలకోరికే ముఖ్యం అనిపించింది. కనీసం తనకు తెలీకపోయినా నేనైనా ఆపరేషన్ చేయించు కోవల్సింది. అదీ చెయ్యలేదు" కిటికీ ఊచలకు తలకొట్టుకుంటూ డాక్టరుగారు ఉద్వేగంగా అన్నారు.

ఆయన్ని ఎలా ఓదార్చాలో నాకు తెలీడం లేదు.

ఆయన చెప్పేవన్నీ నిజమే. కానీ ఇప్పుడు పశ్చాత్తాపపడి చేయగలిగింది ఏముంది...?

విశాలకు ఇలా ఫిట్స్ వస్తాయని ఆయనేమీ కలగనలేదు కదా! నెమ్మదిగా ఆయన చేయిపట్టి పడకమీద కూర్చో బెట్టాను.

"మీరు అనవసరంగా ఏవేవో ఊహించుకుని మనస్సు పాడు చేసుకుం టున్నారు"

"కాదు సౌమ్యా! నేను బతికినంత కాలమూ నాకీ వేదన, పశ్చాత్తాపమూ తప్పవు"

"మీరు బాధపడుతున్న విషయానికీ, విశాల మరణానికీ ఏమీ సంబంధం లేదు. ఏదో అలా జరిగిపోయింది. విశాల మన అందరికీ దూరం అయ్యింది. కానీ, పిల్లల ముఖాలు చూసి అయినా మీరు మళ్ళీ మామూలు మనిషి కావాలి" అవకాశం దొరికిందికదాని మళ్ళీ గబగబా చెప్పాను.

అంత పెద్దవాడు అలా చిన్నపిల్లా డిలా కన్నీళ్ళు పెట్టుకుంటుంటే నాకు ఏం చేయడానికీ తోచలేదు. ఆయన్ని ఎలా ఓదార్చాలో తెలీలేదు.

అలాగే మంచం దగ్గర ముడుచుకు కూర్చున్నాను. మరికొంత సేపటికి ఆయన తన్నుతాను కంట్రోల్ చేసుకున్నారు.

"సౌమ్యా..ఇక నువ్వెళ్ళు" అన్నారు నావంక చూస్తూ.

"మీరు భోజనం..."

"నేను తరువాత భోంచేస్తాలే... నువ్వెళ్ళు" అన్నారు.

మరి ఆయన్ని బలవంతం చేసే ధైర్యంలేక మౌనంగా గదిలోంచి బయటికి నడిచాను.

పిల్లలందరూ నిద్రపోతున్నారు.

రమణి మంచం పక్కనే నా మంచం. చిన్ని నన్ను కరుచుకుని పడుకుంది. చిన్ని నాకు బాగా చేరువయిపోయింది.

అమ్మకోసం అడగకపోయినా, ఆ పాప కళ్లు 'అమ్మ ఎక్కడ ఆంటీ?' అంటూ ప్రశ్నిస్తున్నట్లుగానే వుంది.

పక్క మంచంలో చిట్టి, మణి పడు కున్నారు. పిల్లలందరిలోకీ తల్లి మృత్యు వుతో పోరాడుతున్నప్పుడు కళ్ళారా చూసిన చిట్టి ఎక్కువ బెంగ పెట్టుకుంది.

రమణి, మణి తమ పనులు తాము చేసుకుంటున్నా క్షణం క్షణం వులిక్కి

పడుతున్నట్లుగా బెదిరిపోతున్నారు.

ఈ పిల్లలు ఎలా? ఈ చంటిపాప ఎలా...? ఇక్కడ నేను ఎంత కాలం ఉండగలను!?

డాక్టరుగారు మనుషుల్లో పడి కాస్తంత ఈ పిల్లల ఆలనా పాలనా చూసుకుంటుంటే నేను వెళ్ళిపోవచ్చు.

ఆలోచిస్తూ డాక్టరుగారి గది వైపు చూశాను.

ఆయన గదిలో లైటు వెలుగుతోంది.

చిన్ని మెడ చుట్టూ చుట్టిన చేతులు నెమ్మదిగా వదిలించుకుని డాక్టరుగారి గదిలోకి అడుగుపెట్టాను.

ఆయన నిద్రపోతున్నారు.

ఆయన నిద్ర స్వాభావికమైనది కాదని నర్సుగా నేను గ్రహించగలిగాను. ఆయన మత్తుగా నిద్రపోతున్నారు...

ఆది నిద్రవల్ల వచ్చిన మత్తు కాదు..

కావాలని కౌగిలించుకున్న మత్తు..

మార్ఫియా కలిగించిన మత్తు..

వస్తూన్న నిట్టూర్పును ఆపుకుంటూ టేబిల్ వంక చూశాను. నేను పెట్టిన భోజనం పెట్టినట్లే ఉంది. నా ప్రయత్నం లేకుండానే నా నుండి నిట్టూర్పు బయట పడింది. డాక్టరుగారికి సరిగా కప్పి, లైట్ తీసి, తలుపులు చేరవేసి చిన్ని పక్కన చోటు చేసుకున్నాను.

ఎలా...? ఎలా...? ఎలా...? ఎలా? అన్న ప్రశ్నతో నా బుర్ర నిండిపోయింది

* * *

నేను నా ఇంటికి వచ్చి నాలుగు రోజులు గడిచాయి...

"చిలుక ఎగిరిపోయిందనుకున్నా నురా..."

"జంట వెదుక్కోడానికి పోయి వుంటుందిరా"

"దీన్ని ఈమధ్య డాక్టర్ కృష్ణ మోహన్ ఇంట్లో చూశాను"

"అవునురా. ఈమధ్య ఆయన పెళ్ళాం ఒళ్లు కాలి చచ్చిందిగా. ఇది ఆయనకు వల వేస్తోందేమోనురా..."

ఇంటికి వచ్చిన రోజున నాకు ఈరకమైన స్వాగతం లభించింది.

నా గుండెకు గళ్లుపడ్డాయి.

ప్రేమించే భర్త, పిల్లలూ, ఇల్లూ, సంసారం ఉన్న విశాలను మృత్యువు కబళించకపోతే – ఎటూ ఎవరూ లేక, వంటరి బతుకును ఈదవ్వలేక ఈడుస్తున్న నావంటిదాన్ని వరించకూడదూ...

మృత్యువు ఎంత భయంకరమైనదో నాకు తెలుసు. పచ్చని కుటుంబంలో మృత్యువు పెట్టే చిచ్చు మిగిలిన జీవితాలకు ఎంతటి క్షోభను కలిగిస్తుందో నాకు తెలిసినంత బాగా మరెవరికీ తెలీదేమో...

మృత్యువు ఆత్మీయుల గుండెల్లో ఎంతటి మానని గాయాన్ని కలిగిస్తుందో నేను ఎరుగుదును.

తల్లిలేని ఆ పసికూనల గుండెల్లోని దుఃఖం నాకు అనుభవమే. భార్యను పోగొట్టుకున్న భర్త ఆవేదనను నేను అర్థం చేసుకోగలను. కూర్చున్నా, పడుకున్నా, ఏ పని చేస్తున్నా నాకు బితుకు బితుకుమంటూ ఇంట్లో తిరుగుతున్న పిల్లలే కళ్ళల్లో మసలుతున్నారు.

వారికోసం నేనేం చెయ్యను...?

రెక్కలు రాని ఆ పసికూనలను నేనెలా సంరక్షించగలను...?

ఈ సమాజం నాకు కనిపించని సంకెళ్ళను విధించింది. ఆ బంధానికి నేను లొంగిపోక తప్పదు. బరువుగా ఉన్న కనురెప్పలను మూస్తూ పడకమీద





వాలాను.

వంట చేసుకోవాలని గానీ, తినాలని గానీ అనిపించడం లేదు.

కడుపునిండుగా మంచినీళ్లు తాగి కళ్లు మూసుకున్నాను.

చిన్ని 'అమ్మా' అంటూ నా మెడ చుట్టూ చేతులు వేసినట్లుగా అనుభూతి కలిగింది.

"చిన్నీ" అంటూ పక్క తడుము కున్నాను.

ఈ కొద్దిరోజుల్లో చిన్ని నాకు బాగా చేరిక అయింది.

చిన్ని "అమ్మా" అని పిలిచే పిలుపు నా హృదయంలోని అట్టడుగు పొరల్లో దాచిన అనేకానేక కోరికలకు నాగస్వరం వూదుతుంది.

మాతృత్వపు వాంఛతో నా హృదయం నిండుకుంది.

చిన్నిని నా చేతుల్లో ఇముడ్చుకు నేందుకు నాగుండెలు తపించిపోతున్నాయి.

ఎక్కడిదీ అనుబంధం....?

ఈ అనుబంధానికి పర్యవసానం ఏమిటి....?

అశాశ్వత మైన ఈ అనుబంధానికి ఆది ఎక్కడ...? అంతం ఎక్కడ....?

ఏ అనుబంధం మాత్రం శాశ్వితమైనది?

నా మనస్సు నన్ను నిలదీసి అడిగింది.

నిజమే. విధి విషపుకోరల్లో చిక్కు కున్న ఏ అనుబంధమూ శాశ్వితం కాదు. తల్లిని బిడ్డల నుండీ, బిడ్డలను తల్లి నుండీ, భర్తను భార్య నుండీ, భార్యను భర్త నుండీ విడదీస్తుంది.

విధి విషపు కోరల్లో పావుగా చిక్కిన ఎందరో అభాగ్యజీవుల్లో నేనూ ఒకదానిని.

తెరలు తెరలుగా పాత జ్ఞాపకాలు....

టెన్త్ పరీక్షలు రాశాను.

మంచి మార్కులతో పాసవుతాననే నమ్మకం వుంది. అప్పుడప్పుడూ నా పైచదువు ఎలాసాగాలి. అనే విషయంలో చిలిపి చిలిపి తగవులు రేగినా అమ్మ-నాన్న వెంటనే కాంప్రమైజ్ అయిపోయేవారు.

నా విషయంలో ఇద్దరిదీ ఒకటే ఆలోచన. అదే – నా భవిష్యత్ బంగారుమయం కావడం; నా భవిష్యత్ ఉజ్వలంగా, ఉన్నతంగా ప్రకాశించడం.

అదే వారి ఆశ .... అదే వారి ఆశయం...అదే వారికి ఆనందం.....

పరీక్షలు పూర్తి అవుతూనే మా స్కూల్లో ఎక్స్‌కర్షన్ ప్రోగ్రాం పెట్టారు.

ఉత్తర భారత యాత్ర.

ఢిల్లీ, ఆగ్రా, అమృతసర్, శ్రీనగర్, కాశ్మీర్.....

నా ప్రయాణానికి ఏర్పాట్లన్నీ జరిగాయి.

ఆరోజు రాత్రికే నా ప్రయాణం.

అమ్మ నా సూట్‌కేస్ సర్దుతూంది. ఆమె ముఖం నిండా దిగులు. ఎప్పుడూ నవ్వుతూన్నట్లుగా వుండే ఎర్రని చిన్ని పెదవులు ముడుచుకున్నాయి.

అమ్మను అలా చూస్తుంటే, ఈ ప్రయాణం మానుకుంటే బాగుండునని పించింది. అమ్మ పడుతున్న దిగులు చూస్తుంటే నాకూ అమ్మను వదిలి వెళ్ళా లనిపించడంలేదు.

అమ్మ వెళ్ళేవరకూ ఏవేవో జాగ్రత్తలు చెబుతూనే వుంది.

ట్రైనెక్కించేందుకు అమ్మ, నాన్న ట్రైన్ దగ్గరకు వచ్చారు.

ట్రైన్ వచ్చే వేళయింది.

అమ్మ, నాన్న మేడమ్‌కు నన్ను అప్పగించి "దయచేసి జాగ్రత్తగా చూడండ"ంటూ అర్థించారు.

అప్పటివరకూ గంభీరంగావున్న నాన్న కళ్ళల్లో కూడా తడి కనిపించేసరికి, 'ఈ ప్రయాణం ఎలాగయినా ఆగిపోతే బాగుండును' అనుకున్నాను.

నేను వెళ్ళనని చెప్పేయాలనుకున్నాను.

కానీ ఏమీ చేయలేకపోయాను. అంత దూరం వచ్చిన ప్రయాణం ఏ వంక మీద ఆపేయాలో నాకు తోచలేదు.

అమ్మ ఇంకా నాకు తీసుకోవల్సిన జాగ్రత్తలు చెబుతూండగానే ట్రైన్ వచ్చింది.

అమ్మా, నాన్నా చెయ్యి ఊపుతూ ప్లాట్‌ఫాం మీద పక్కపక్కగా నిలబడ్డారు.

చెమ్మగిల్లిన నా కళ్ళకు అమ్మా, నాన్నా మసక మసకగా కనిపించారు. ట్రైన్ మొదట వానపాములా కదిలి రానురాను వేగం పుంజుకుంది.

అమ్మా, నాన్నా కంటికి కనిపించనంత దూరం అయ్యారు.

కర్చీఫ్‌తో కళ్ళు అద్దుకున్నాను.

ఈ నెల రోజులే నా జీవితంలో ఇంత మార్పు కలిగిస్తాయని తెలిసివుంటే నేనసలు ఈ ప్రయాణం పెట్టుకోకపోయి వుందును.

జరిగింది తలుచుకుంటే నాకు కన్నీళ్ళు రావడంలేదు. భోరున ఏడవాలనీ అనిపించడంలేదు.

అమ్మా, నాన్నా నాకు చేసిన అన్యాయమే నా గుండెల్లో మారుమోగుతోంది. బీభత్సంగా మారిన ప్రకృతి యావత్తు "మీ డాడీ, మీ మమ్మీ నీకెంత అన్యాయం చేశారో చూశావా....?" అని ఎలుగెత్తి అరుస్తోంది.





నన్ను వినోదయాత్రకు పంపి వాళ్ళు మాత్రం జంటగా స్వర్గారోహణ చేశారు. ఇంతకంటే అన్యాయం మరేం వుంటుంది...?

కన్నబిడ్డననే కనికరం లేకుండా తోడేళ్ళ గుంపుఫుంటి ఈ ప్రపంచంలో నన్ను ఒంటరిగా, దిక్కులేనిదానిగా వదిలి వెళ్ళడానికి వాళ్ళకు మనస్సెలా ఒప్పింది?

ప్రకృతి యావత్తూ ఈ అన్యాయాన్ని నిరసించింది.

ఆకాశం భోరున విలపించింది.

చెట్లు విరిగి నేలకూలి తమ ఆక్షేపణను బలంగా తెలియజేశాయి.

వంగి నేలకంటిన టెలిఫోన్, కరెంట్ స్థంభాలూ, తెగిపోయిన కరెంట్ తీగలూ, విలపించి విలపించి నేలకొరిగిన చెట్లూ, జలమయమైన భూమాతా...

ఊళ్ళూళ్ళ ప్రజలనూ వారి వారి ఆస్థిపాస్థులతో సహా పొట్టనపెట్టుకున్న మృత్యువు భయంకర కరాళ నృత్య ప్రదర్శన కళ్ళారా చూసిన నా మనస్సు బండబారిపోయింది.

మా వూరి ఉనికి తెలుసుకునేందుకే వారం రోజులు పట్టింది.

ఏం జరిగిందీ చెప్పేందుకు కూడా పిట్ట పురుగు మిగలకుండా ఊరు ఊరంతా ధ్వంసం అయిపోయింది.

చీకిపోయిన కళేబరాలు వందలూ, వేలూ... వాటిని పెట్రోలుపోసి ఖననం చేస్తున్నారు ప్రభుత్వ సిబ్బంది.

చాలాగ్రామాల్లో ఎవరో నావంటి దౌర్భాగ్యులు తప్ప అందరూ సకుటుంబంగానే తరలి వెళ్ళారు.

భూమి మీద వున్నా, ఆనందసీమలో వున్నా, మృత్యుముఖంలో వున్నా అందరూ కలిసి ఒక్కచోట వుండేనే

ఆనందం.

కానీ, నాకా అదృష్టం లేదు.

తమను వదలి వినోదయాత్రకని బయలుదేరిన నన్ను అమ్మా, నాన్నా శపించారు.

బతికినంత కాలమూ వారికొరకు ఏడుస్తూ, తపిస్తూ, దిక్కులేకుండా ఒంటరిగా బతకమని శపించి మరీ హాయిగా వెళ్ళిపోయారు.

ఆ ప్రయాణమే లేకుంటే నేనూ హాయిగా అమ్మా, నాన్నతో పాటు వెళ్ళిపోయి వుండేదాన్ని కాదూ!

అమ్మా, నాన్నలను వదిలి వెళ్ళిన నేరానికి నాకు తగిన శిక్షపడింది. ఈ శిక్ష నేను జీవితమంతా భరించాలి తప్పదు.

నా గుండె కరిగింది.

కరిగి కరిగి కన్నీరయింది. ఆ కన్నీటి ప్రవాహంలో అమ్మనూ, నాన్ననూ అన్వేషిస్తున్నాను.

తప్పదు... బతుకంతా ఈ శిక్ష అనుభవించక తప్పదు. చివరిసారిగా అమ్మనూ, నాన్ననూ ప్లాట్‌ఫాం మీద చూశాను. అప్పుడు కూడా కళ్ళనిండుగా చూసుకోకుండా పాడు కన్నీరు అడ్డుపడింది.

అదే చివరి చూపు... అదే చివరి వీడ్కోలు ... అమ్మా, నాన్నా జంటగా ప్లాట్‌ఫాం మీద నిలబడ్డట్లుగా నా కళ్ళకు అగుపించారు.

గోడమీది దృశ్యం మాయమయ్యింది. కళ్ళనిండుగా నీరు నిండి చెంపలను తడిపేసింది కన్నీరు.

ఇహ ఈ ఒంటరి బతుకు మోయక తప్పదు...

కళ్ళు తుడుచుకుని లేచి మంచినీళ్ళు తాగి పడక మీద వాలాను.

చిన్ని ఏం చేస్తోందో?

పడుకుందో? లేకపోతే రమణిని ఏడి



పిస్తోందో??

చిన్ని మునుపటి కంటే ఆరోగ్యంగా వుంది. కాస్త ఒళ్ళు చేసిందేమో ఉంగరాల జుత్తుతో ముద్దొస్తూంది.

చిట్టి మాత్రం ఇంకా మామూలు మనిషి కాలేదు.

పిల్ల ఎప్పుడూ బెంగగా ఏదో పోగొట్టుకున్నట్లు నిరాసక్తంగా వుంటుంది. తల్లి మరణంతో ఆ వయస్సు పిల్లల్లో సహజంగా ఉండాల్సిన చురుకుదనం చిట్టిలో మాయమైపోయింది.

చిట్టి ఎప్పటికి కోలుకుంటుందో?

ఆలోచిస్తూనే ఎప్పుడో నిద్రలోకి జారిపోయాను.

* * *

డ్యూటీలో వున్నాను.

విశాల మరణం సంభవించినప్పటి నుండీ డ్యూటీ సరిగా చేయలేకపోతున్నాను.

పరధ్యానం, నిర్లిప్తతా నాలో చోటు చేసుకున్నాయి.

తప్పదు... చెయ్యాలి కాబట్టి ఏదో చేస్తున్నాను అన్నట్లుంది నా వైఖరి.

పనిలో ఉత్సాహంకానీ, చేస్తున్న సేవలో ఆత్మీయతకానీ ఉండటంలేదు.

ఎప్పుడూ ఏవో ప్రశ్నలు... జవాబు దొరకని ప్రశ్నలు.

ఎందుకీ జీవితం? ఎంతకాలమిలా?

మోయలేని ఈ వంటరి బతుకును మోస్తూ ఎంతకాలం జీవించాలి?

ఎవరికోసం బతకాలి?

జవాబు లేని ప్రశ్నలు.

ఈ నాలుగు రోజులుగా మరీ భారంగా గడుస్తున్నాయి రోజులు.

ప్రతి మనిషిలోనూ, ప్రతి వస్తువులోనూ 'అమ్మా... అమ్మా' అని పిలుస్తూన్న చిన్ని ముఖం కనిపిస్తుంటే నా మనస్సు వికలమైపోతోంది.

"పిల్లలు ఎలావున్నారో...వచ్చి వారం అయ్యింది. సాయంత్రం వెళ్ళి చూసి రావాలి" పైకే గొణుక్కున్నాను.

'సాయంత్రం వెళ్ళి చూసిరావాలి' అనే ఆలోచన ఏదో చెప్పలేని ఊరట కలిగించింది. అందుకే ఆ మాట పదే పదే మనస్సులో మననం చేసుకున్నట్లుగా గొణుక్కున్నాను.

"సౌమ్యా! డాక్టర్ కృష్ణమోహన్ గారు పిలుస్తున్నారు" మేరీ వచ్చి పిలిచింది.

"ఇప్పుడు నువ్వు వాళ్ళింట్లో లేవా?" మేరీ ప్రశ్న.

"ఊహూఁ" తల తిప్పాను.

ఎందుకు పిలిచారో అర్థంకాలేదు. ఒకవేళ పిల్లలకు బాగుండలేదేమో... ఈ ఆలోచనతో నా కాళ్ళూ చేతులూ వణికాయి.

"ఎక్కడ వున్నారు?"

"కన్సల్టింగ్ రూంలో" జవాబుచెప్పి మేరీ బూట్లు టకటకలాడించుకుంటూ వెళ్ళిపోయింది.

ప్రపంచంలో అందరూ ఉత్సాహంగా ఉండగలరు ఒక్క నేను తప్ప. నేను వెళ్ళేప్పటికి డాక్టరుగారు ఎప్పటిలాగే కళ్ళకు చేతులు అడ్డం పెట్టుకుని ఆలోచిస్తూ కూర్చున్నారు.

తలుపు చప్పుడుకు తల ఎత్తి చూశారు.

విశాల మృతి ఆయన్నెంతగా దెబ్బ తీసిందో స్పష్టంగా తెలిసిపోతోంది.

ఈ మనిషి ఎప్పటికైనా మామూలుగా అవుతారా?

"పిలిచారట" అన్నాను - ఆయన ఎంతకూ మాట్లాడకపోవడంతో.




"ఔను సౌమ్యా... రమణి నిన్ను రమ్మంది"

"అలాగే. ఈవేళ నేనే వద్దామను కుంటున్నాను" చెప్పేసి బయటికివచ్చాను.

ఆవేళ డ్యూటీ అయిపోవడంతోనే నేరుగా డాక్టరుగారింటికి వెళ్లాను.

నన్ను గుమ్మంలో చూస్తూనే రమణి– "ఆంటీ" అంటూ మోకాళ్లమీద తల పెట్టుకుని ఏడ్చేసింది.

"ఆంటీ... నాకు ఈ ఇంట్లో భయ మేస్తోంది. చిన్ని 'అమ్మా అమ్మా' అంటూ ఏడుస్తూ నా ప్రాణం తీస్తోంది. చిట్టిని చూ స్తు ం టే అదేమయిపోతుందోనని భయంగా వుంది" వెక్కిళ్లమధ్య చెప్పింది రమణి.

"నాన్నగారు ఉన్నారుకదమ్మా భయం ఎందుకు?" ఓదార్పుగా రమణి వీపు నిమురుతూ అన్నాను.

"నాన్నగారు పగలు హాస్పిటల్‌లో వుంటారు. ఇంటికి వచ్చి ఒకోసారి భోజనం కూడా చేయకుండా మంచానికి అడ్డంపడతారు. అలా పడుకుని ఎప్పటికి లేస్తారో కూడా తెలీదు. నాన్నగార్ని అలా చూస్తుంటే భయంవేస్తోంది ఆంటీ"

నాకు అర్థం అయింది.

డాక్టరుగారు తన బాధను మరిచి పోయేందుకు మత్తును ఆశ్రయిస్తున్నారు.

ఈ పసివాళ్ల గతేమిటి?

ఈ లోపుగా చిన్ని తప్పటడుగులతో వచ్చి "అమ్మా" అంటూ నన్ను వాటేసు కుంది.

చిన్ని బాగా చిక్కిపోయింది. సరియైన పోషణలేక ఉంగరాలజుత్తు అట్టలుకట్టింది. ముఖం పీక్కుపోయి కాళ్ళూ చేతులూ సన్నగా కాడల్లా అయిపోయాయి.

ఈసురోమన్నట్లున్న చిన్నినిచూస్తుంటే నా కళ్లు తడి అయ్యాయి.

నా మెడచుట్టూ చేతులుచుట్టి నన్ను అతుక్కుపోయింది.

ఆప్యాయంగా గుండెలకు అదుము కున్నాను.

అప్పటికి నా ఆర్తి తీరింది. నా తపన చల్లారింది.

నాకో విషయం స్పష్టంగా తెలిసింది.

నా బాధా, నా దిగులూ, నా ఒంటరి తనం ఎందుకో నాకు అర్థం అయ్యింది.

నన్ను ప్రేమించేవాళ్లు కావాలి...

అలాగే నా ప్రేమను పంచేందుకు కూడా ఓ ఆలంబన కావాలి.

నన్ను ప్రేమించేవాళ్ళు నాకు కరు వైనా కనీసం నా ప్రేమను పంచుకునే వాళ్ళయినా నాకు కావాలి...

చిన్నికి తల్లిప్రేమ కావాలి... చిన్ని నాకు కావాలి.

"రమా! చిన్ని ఇలా అయిపోయిం దేమ్మా...?" లోతుకు పోయిన చిన్ని పాల బుగ్గలు చూస్తూ అడిగాను.

"ఏం చెయ్యను ఆంటీ! తింటూనే, పాలు తాగుతూనే ఏడుస్తుంది. ఊరుకో బెడితే ఎంతకూ ఊరుకోదు" ఏమీ చెయ్యలేని నిస్సహాయత రమణి కళ్ళ నిండుగా నీళ్లు తెప్పించింది.

"పోనీ, నాకు కబురు చెయ్యలేక పోయావా...?" నా మాటలు నాకే ఎబ్బెట్టుగా వినిపించాయి.

తల్లికి దూరమై, తండ్రి ఆలనా పాలనా నోచుకోని పిల్లల యోగక్షేమాలు కనుక్కునేందుకు నాకు కబురు చెయ్యాలా?

"నాన్నకు మూడు రోజుల కిందనే చెప్పాను ఆంటీ...మరేమో..."

ఏమిటి అన్నట్లుగా రమణి వైపు

చూశాను.

రమణి చెప్పాలా ఒద్దా అన్నట్లుగా సంశయంగా చూసింది.

"ఫరవాలేదు. చెప్పు రమణీ..."

"ఆంటీ ఎప్పటికీ మన ఇంట్లో ఎలా వుంటుందమ్మా...? మన మంచి చెడ్డలు మనం చూసుకోవల్సిందే" అన్నారు నాన్న.

నేను మౌనంగా వుండిపోయాను.

"ఆంటీ! నా పరీక్షలు దగ్గర పడుతున్నాయి"

రమణి భావం అర్థం అయ్యింది.

తల్లి పోయినప్పటినుండీ రమణి స్కూలుకు వెళ్ళడం లేదు. చిన్నిని కని పెట్టుకుని ఇంట్లోనేఉంటుంది.

ఆరోజు నుండి నా దినచర్య మారి పోయింది.

ఉదయమే డాక్టరుగారింటికి వచ్చి పిల్లల్ని తయారుచేసి, స్కూలుకు పంపి చిన్నిని నాతోపాటు హాస్పిటల్‌కు తీసు కెళ్ళడం ప్రారంభించాను. నైట్ డ్యూటీ రోజున పగలంతా అక్కడే గడిపేదాన్ని.

చిన్ని నాతో పాటు హాస్పిటల్‌లోనే తిరిగేది. అక్కడే ఆడుకునేది. డాక్టర్ కృష్ణమోహన్‌గారి పాపగా, తల్లిలేని బిడ్డగా అక్కడి స్టాఫ్ అందరికీ చిన్ని అంటే ఎంతో సానుభూతి...ముద్దు.

నా డ్యూటీ అయిపోతూనే చిన్నిని ఇంట్లో వదిలి, ఇంటికి వెళ్ళేదాన్ని. అప్పటికీ వదలని చిన్నిని ఏమార్చి ఇంటికి వెళ్ళడం గగనమే అయ్యేది. నేను వెళ్ళిన తరువాత చిన్ని 'అమ్మ....అమ్మ' అంటూ రమణిని ఏడ్పించేదట.

నా టైంటేబిల్ మారిన విషయం నా బాడీగార్డులు గమనించారు. ఉదయం పెందలాడే ఇంటి నుండి బయటపడిన నేను తిరిగి చీకటిపడి ఏ ఎనిమిదింటికో ఇల్లు చేరుకుంటున్నాను.

ఒక్కోసారి భోజనం కూడా డాక్టరు గారింట్లోనే అయిపోతోంది.

ఏమిటో...నేను పోనుపోను ఊబిలో చిక్కుకుపోతున్నానా?

ఈ సంసారంతో ఇంత అనుబంధం పెంచుకుంటున్న నేను చివరికి ఎక్కడ తేలుతాను...??

ఈ రకమైన ఆలోచనలతో వేగిపోయినా, ఇప్పుడు నాకు రోజులు కాస్త సంతోషంగానే గడుస్తున్నాయి.

చిన్ని ఆలనా పాలనలో, ఆటపాట లలో నాకు అంతులేని తృప్తి కలుగుతుంది.

నావాళ్ళు కాకపోతేనేం...?

ఎవరికో ఒకరికి నా అవసరం వుంది అనుకుంటే తృప్తిగా వుంది.

మరి లోకం మాటో...?

ఇప్పటికే నలుగురూ నా గురించి చెవులు కొరుక్కోవడం, హాస్పిటల్‌లో చిన్ని నన్ను అమ్మా అని పిలవడంతో హేళనగా నవ్వుకోడం నాకు తెలిసిన విషయాలే. వెధవ లోకం...పోనీ ఏట్లో పడి కొట్టుకు పోనీ... ఎప్పుడూ ఎవరో ఒకర్ని వేలెత్తి చూపాలి అనుకునే ఈ వెధవలోకంతో నాకు పనిలేదు.

దాన్ని నేను లెఖ్ఖచేయనుగాక చేయను.

ఏ ఆలంబనా లేకుండా నేను వంటరి తనంతో తపించిపోయినప్పుడు ఈ లోకం 'అయ్యోపాపం' అనుకుందా....?

ఏ తప్పూ చేయకుండా నేను రవంత మానసిక శాంతి పొందితే ఆక్షేపించే ఈ హృదయం లేని లోకం ఏమనుకుంటే మాత్రం నాకు లెఖ్ఖేమిటి...?




ఆవలిస్తూ మంచం మీదికి ఒరిగాను. ఉదయం ఎనిమిదిగంటలయి ఉంటుంది.

పిల్లల్ని స్కూలుకు పంపే హడావిడిలో చాలా బిజీగా వున్నాను.

ముందుగదిలో డాక్టరుగారు ఎవరితోనో మాట్లాడుతున్నారు.

"ఆంటీ... నాకు జడ వెయ్యవూ?" మణి దువ్వెన తీసుకుని జుట్టు విప్పుకుని నా వెంట వెంట తిరుగుతోంది.

పని తొందరలో నేను వంటగదిలో అటూ ఇటూ తిరుగుతుంటే చిన్ని నాతో పాటు నా చెంగు పట్టుకుని చిన్ని చిన్ని అడుగులు వేస్తూ తిరుగుతోంది.

రమణి పరీక్షలు దగ్గర పడ్డాయనే భయంతో శ్రద్ధగా చదువుతోంది.

"మణీ! రెండు కప్పుల కాఫీ పట్రామ్మా..." బయటినుండి డాక్టరుగారు కేకవేశారు.

గబగబా రెండు కప్పుల కాఫీ కలిపి పట్టుకెళ్ళి టేబిల్ మీద పెట్టాను.

ఆ కొత్తమనిషి నావంక నిశితంగా చూస్తుంటే అప్రయత్నంగా అతనివంక చూశాను.

అతను డాక్టరుగారి పోలికతో వున్నాడు. డాక్టరుగారి కంటే పెద్దవాడే అయినా ఆరోగ్యంగా వుండటంతో చిన్నవాడిగా కనిపిస్తున్నాడు.

నేనిచ్చిన కాఫీ అందుకుంటూ నావంక అదోలా చూస్తూండటంతో నా ఒంటిపైన తేళ్ళూ, జర్రులూ పాకినట్లయి వెంటనే గదిలోకి వచ్చేశాను. వాళ్ళమాటలు గదిలోకి స్పష్టంగానే వినిపిస్తున్నాయి.

"ఈ పిల్లనేనన్నమాట నువ్వుంచుకున్నది"

అతనిగొంతు పచ్చిగా అసభ్యంగా పలుకుతుంటే కోపంతో నా వళ్ళు మండిపోయింది. గబగబా వెళ్ళిఆ పెద్దమనిషిని ఆ చెంపా ఈచెంపావాయగొట్టాలన్నంతగా ఆవేశం వచ్చింది.

డాక్టరుగారి మాట వినిపించకపోవడంతో ఈ మాట విన్న ఆయన షాక్ తిని వుంటారని ఊహించుకున్నాను.

"నువ్వు హాస్పిటల్ లో పనిచేసే నర్సమ్మను ఉంచుకున్నావని చెప్పుకుంటుంటే నమ్మలేకపోయాను. అయితే నిజమేనన్నమాట అయినా కృష్ణా..."

"అన్నయ్యా! మతిలేకుండా మాట్లాడకు. సౌమ్య వింటే బాధపడుతుంది''

"బాధపడుతుందా? ఎందుకూ? నలుగురు పిల్లల తండ్రిని వల్లో వేసుకు కులుకుతుంది చాలక బాధపడడమొకటి. ఏదీ ఇటు పిలువ్. మొహం మీదే కడిగేస్తాను. అయినా విశాల పోయి ఆర్నెల్లన్నా కాలేదు. నీకిదేం బుద్ధిరా. నలుగురు పిల్లల తండ్రివి. ఆ పిల్లల్ని ఏం చేద్దామనుకుంటున్నావు?''

ఆయనలా ఎడతెరిపి లేకుండా మాట్లాడుతుంటే తల గోడకు వేసి కొట్టుకోవాలనిపించింది.

పిల్లలు ముగ్గురూ బొమ్మల్లా నిలబడ్డారు వింటూ.

డాక్టరుగారు వారించాలని చూసినకొద్దీ ఆయన రెచ్చిపోతున్నారు.

"అయినా మగాడివి నీకు లేకపోతే పోయింది. ఆడదానికి దానికి ఉండాలిగా. ఉద్యోగం కూడా వెలిగిస్తుందాయె.ఎర్రగా బుర్రగా కూడా వుందిగా. దానికి మరో మగాడే దొరకలేదా? ఒరే కృష్ణా... నీకు అంతగా పెళ్ళిచేసుకోవాలనివుంటే చెప్పు. మనసూరమ్మత్త కూతురు... ఏదీ కమల. దాన్ని మాట్లాడతాను. దానికీ ఎలాన్నా సంబంధాలు కుదరడం లేదు. లక్షణంగా

పెళ్ళి చేసుకో. కమల అయితే పిల్లల్ని కడుపున పుట్టిన బిడ్డల్లా చూసుకుంటుంది. చూడూ! నువ్విట్లా అడ్డమైనదాన్నీ చేరదీస్తే పిల్లలు ఆగం అయిపోతారు. అదికాస్తా డబ్బూ దస్కం చేజిక్కించుకుని ఎవణ్నో వేసుకు పోయిందంటే ఆ తరువాత ఏమనుకునీ లాభం వుండదు..."

ఆయన హితబోధ ఇంకా పూర్తి కాకుండానే నేను రోడ్డుమీది కొచ్చాను. ఎంత విచిత్రమైందీ లోకం...

విశాలచచ్చిపోయినరోజు బంధువులను కున్న వాళ్ళందరికీ టెలిగ్రాంలు ఇస్తే వచ్చినవాళ్ళు నలుగురు. వారిలో ఈ పెద్దమనిషి ఒకడు. అందరితో పాటు ఏదో అయిందనిపించి చేతులు దులుపుకుని బండెక్కాడు. ఆడ తోడు లేకుండా నలుగురి ఆడపిల్లలతో ఎలా అవస్థ పడతాడు అని ఆలోచించినవాళ్ళు ఒక్కరూ లేరు ఆనాడు.

'పోనీ నాలుగు రోజులు పిల్లల్ని మేం తీసుకెడతాం....' అని అన్నవాళ్ళూ లేరు. నిజానికి మనస్ఫూర్తిగా ఓదార్చిన వారేలేరు.

ఎక్కడ మనం కాస్త మెత్తగా వ్యవహరిస్తే బాధ్యత మనను అంటుకు పోతుందో అన్నట్లుగా అంటీముట్టనట్లుగా మసలుకున్నారు.

ఈరోజు అయినవాళ్ళమంటూ, శ్రేయోభిలాషులమంటూ వచ్చి సలహాలు చెబుతున్నారు.

సలహాలు అందించనూ వచ్చు, పెళ్ళి సంబంధాలు వెతకనూ వచ్చు. కానీ తనను గురించి నీచంగా మాట్లాడే హక్కు ఎవరిచ్చారు..?

ఎందుకీ మనుషులు ఇంత స్వార్థపరులుగా వుంటారు....?

రోడ్డు దాటి హాస్పిటల్‌లో అడుగు పెట్టాను.

సేవాధర్మంలో నా అవమానాలూ, నా బాధలూ, నా కన్నీళ్లూ, చివరికి నన్ను నేను మరచిపోవాలని నిర్ణయించుకున్నాను.

"హాయ్ సౌమ్యా... నీ కూతురేదే?" మేరీ ఆశ్చర్యంగా కనుబొమలు ఎగరేస్తూ అడిగింది.

ఆ గొంతులో పలికిన హేళనా, వ్యంగ్యం నన్ను సూదులతో పొడిచి నట్లయింది - అంతకు పూర్వం కలిగిన గాయంతో.

"కూతురా... వాడ్డూయూ మీన్?"

ఈమధ్య కాలంలో వాళ్ళకు చిన్ని మీదా, డాక్టరుగారిమీదా కలిగిన సాను భూతి మంచు కరిగినట్లుగా కరిగి పోయింది.

వాళ్ళ సహజమైన స్వరూపాలు బయటపడటం ప్రారంభించాయి.

"ఐ మీన్...నీ స్టెప్ డాటర్"

"నువ్వే నయమే సౌమ్యా....పురిటి వాసనా, బాధా లేకుండానే అమ్మ వయ్యావు" నవ్వుతూఅందుకుంది పక్కనే వున్న లక్ష్మి.

"యూ ఫూల్స్...స్కౌండ్రల్స్! అలా మాట్లాడేందుకు మీకు సిగ్గువేయడంలా?"

"ఓయబ్బ...వుంటే లేదుగానీ, అంటే వచ్చింది" మోటుగా అంది మేరీ.

"ఏమిటి ఉంది?" అప్పటికే గాయ పడ్డ నా మనస్సుపై కారం రాచినట్లుంది ఈ అసహ్యకరమయిన సంఘటన.

"మాతో చెప్పించాలనా? అయినా మాకేం భయం. అందరూ అనుకునే మాటేగా?"

"అదే ఏమిటి అంటున్నాను"

"ఏముంది? కుమారి సౌమ్య డాక్టర్





కృష్ణమోహన్‌గారి 'పెట్' అని" 'కుమారి' అన్నదగ్గర ఒత్తిపలుకుతూ అంది మేరీ.

నాలో రోషం, దుఃఖం, ఆవేశం పోటీ పడుతున్నాయి.

నన్ను నేను నిగ్రహించుకోడం కష్టమై పోతోంది.

లోకమంతా అనుకుంటున్న విష యానికి అనవసరంగా తోటివాళ్ళతో ఘర్షణపడటం అవివేకమనే నా మనస్సు హెచ్చరిస్తోంది.

మేరీతో ఘర్షణపడి లాభమేమిటి? అయినా లోకం అంటే ఎవరూ? ప్రత్యే కంగా లోకం అంటూ ఎక్కడయినా వుందా?

ఈ మేరీ, ఈ లక్ష్మి, ఈ రోజీ- వీళ్ళంతా కాదూ లోకం అంటే?

వీళ్ళు వేసిన అభాండం కాదూ ఇది. ఆర్తులయిన పసివాళ్ళను అక్కున చేర్చుకుని ఓదార్చినందుకు ఈ లోకం నా కిచ్చిన బహుమానం కాదూ ఇది. వాళ్ళకు మల్లే స్వార్థపూరితంగా బతకనందుకు ఈ లోకం నాకువేసిన శిక్షకాదూ ఇది...

సరే, చూస్తాను. ఈ లోకానికి ఎదురు తిరిగే నిలబడతాను.

ఐవిల్ టీచ్ దెమ్ ఎ లెసన్. నేను పవిత్రంగా, భయంగా ఒదిగి ఒదిగి వున్నందువల్ల ఈ లోకం నాకేమీ మంచి పేరు ఇవ్వలేదు. కాబట్టి ఇప్పుడు ఎదురు తిరిగినందువల్ల కొత్తగా నాకు కలిగే నష్టం కూడా ఏమీ వుండదు.

నాలో మొండి ధైర్యం అదో రకమైన తెగింపు ప్రవేశించాయి.

'ఏం మాట్లాడుతున్నానూ?' అనే ఆలోచన కూడా లేకుండా పోయింది.

"అవును మేరీ. నిజమే. నేను డాక్టరు గారి పెట్‌నే. అయితే ఇప్పుడేమయిందీ" తాపీగా అడిగాను.

ఒక్కక్షణం మేరీ, లక్ష్మి తెల్ల బోయారు.

నేనంత డైరెక్టుగా ఒప్పుకుంటానని వాళ్ళనుకోలేదు.

నాలో ప్రతీకార వాంఛ సెగలు పొగలు కక్కుతోంది.

ఎలాగయినా వాళ్ళను మరో దెబ్బ తీయాలనుకున్నాను.

"అయినా మేరీ...బాయ్ ఫ్రెండ్స్‌తో తిరిగి సినిమాలూ, షికార్లూ ఎంజాయ్ చేసి అబార్షన్లు చేయించుకునేదానికన్నా ఇది తప్పు కాదుకదా...?"

మేరీకి నాకు తెలిసే నాలుగు అబార్షన్స్ అయ్యాయి.

"ఇహ లక్ష్మి సరే!కట్టుకున్న మొగుడికి ద్రోహంచేస్తూ డాక్టర్లతో, పేషంట్లతో షికార్లు కొట్టిందానికన్నా ఇది తప్పుకాదు కదా...?"

చాలా మృదువుగా, కామ్‌గా, కూల్‌గా అన్నాను ఆ మాటే!

నా పెదవులమీద కసి నిండిన మంద హాసం.

వాళ్ళ మొహాలు పాలిపోయాయి.

పాలిపోయి కళ తప్పిన వాళ్ళ మొహాలు చూస్తుంటే జాలివేసింది. ఏమిటి.... నేనేనా ఇంత కర్కశంగా మాట్లాడింది?

నాకు నేనే చాలా ఆశ్చర్యపోయాను.

ఆరోజంతా డాక్టర్ కృష్ణమోహన్ గారిని తప్పించుకు తిరగడానికి ప్రయత్నించాను.

ఆయన మొహం చూడ్డానికే చాలా సిగ్గుగా, అభిమానంగా వుంది.

అయినా ఎవరి బతుకులు వాళ్ళవి.

ఎవరి సంసారాలు వాళ్ళు చక్కదిద్దుకో వాళ్లే తప్ప ఎవరు మాత్రం చేయగల దేముంది...?

ఏమన్నా వున్నా ఇంటా బయటా ఇలాంటి హేళనలు భరిస్తూ ఎంతకాలం వాళ్ళకు అండగా వుండగలను...?

నా వల్ల అనవసరంగా డాక్టరుగారు కూడా అవమానాల పాలవుతున్నారు. ఇక ఏమైనా సరే - డాక్టరుగారింటికి వెళ్ళకూడదు.

నాలుగు రోజులు పోతే పిల్లలు వాళ్ళే అలవాటు పడతారు.

"సౌమ్యా..."

వాష్ బేసిన్‌లో చేతులు వాష్ చేసుకుంటూ ఆలోచనలో మునిగిపోయిన నేను తృళ్ళిపడి తలఎత్తి చూశాను.

ఎదురుగా డాక్టర్ కృష్ణమోహన్.

ఎప్పుడూ లేనిది ఎందుకో భయం వేస్తోంది. మమ్మల్ని ఎవరైనా గమనిస్తున్నారేమో అని చుట్టూ చూశాను.

అక్కడవున్న నాలుగు జతల కళ్ళూ మమ్మల్నే గమనిస్తున్నాయి.

దొంగలను రెడ్ హాండెడ్‌గా పట్టుకున్న సి.ఐ.డి. ఆఫీసర్లలా మావంక విజయగర్వంతో చూస్తున్నారు మేరీ, లక్ష్మి...

అప్రయత్నంగా నాకు నవ్వు వచ్చింది.

మనుషులంటే భయంతో ఇలా వణికి చచ్చే నేనేనా లోకాన్ని ఎదిరించేది?

"సౌమ్యా..."

డాక్టరుగారు తిరిగి పిలవడంతో ఉలికిపాటుతో నా ఆలోచనలకు బ్రేక్ వేసి "యస్ డాక్టర్..." అన్నాను.

"సౌమ్యా! ఉదయం జరిగినదానికి అన్నయ్యకు బదులుగా నేను క్షమాపణ కోరుకుంటున్నాను" అక్కడే వున్న కుర్చీలో కూర్చుంటూ అన్నారు.

ఆ విషయం గురించి ఆయన ఎంతో బాధపడుతున్నట్లుగా ఆయనగారి మ్లానమైన ముఖమే చెబుతోంది.

డాక్టరుగారి నోటివెంట ఈ ప్రస్తావన వింటూనే నా తల నేలకు వంగిపోయింది అభిమానంతో.

డాక్టరుగారు నా ముఖం వంకే చూస్తున్నారు.

నాకు అర్థం అయ్యింది -

ఆయన నానుండి ఒక స్నేహపూరితమైన మాటనుకోరుతున్నారు. నా నుండి ఆ మాట వినకపోతే ఆయనకు శాంతి వుండదు. అయినా ఆయన చేసిన తప్పేముంది ... అంతగా బాధ పడేందుకు?

"ఇందులో మీరు చేసిందేముంది?" అన్నాను తల వంచుకుని.

"ఎవరు చేసినా నా వల్లేకదూ నీకింత అవమానం" ఆయన గొంతు వణికింది.

"ఫరవాలేదు డాక్టర్! నాకిలాంటివి అలవాటే. మీరు బాధపడకండి"

ఆయన్ని అంతకంటే ఎలా కన్‌సోల్ చెయ్యాలో నాకు తెలీలేదు.

"సౌమ్యా! నేనొక మాట చెబుతాను. ఏమీ అనుకోవుకదూ?"

డాక్టరుగారి ధోరణిలో మార్పుకు ఆశ్చర్యపోయాను.

ఏమిటి చెబుతారు? క్షణంలోనే నా మనస్సు పరిపరివిధాల ఆలోచించింది.

"యస్ డాక్టర్..చెప్పండి"మనస్సును కూడదీసుకుని ఎలాగో అన్నాను.

"సౌమ్యా..." ఎలా చెప్పాలో అర్థం కానట్లు ఒక్కక్షణం మౌనంగా ఉన్నారు. ఆయన ఏం చెప్పాలనుకుని అలా సందిగ్ధావస్థలో పడ్డారో నా ఆలోచనకు





అందడంలేదు.

మౌనంగా ఆయన ముఖంలోకి చూస్తూ కూర్చున్నాను.

"సౌమ్యా! రేపటినుండీ నువ్వు ఇంటికి రావద్దు" ఎటో చూస్తూ నెమ్మదిగా అన్నారాయన.

గురిచూసి కొట్టిన బాణం గురి తప్పకుండా వచ్చి గుండెల్లో గుచ్చుకుంది. విలవిలలాడిపోయాను.

సిగ్గుతో, అవమానంతో, బాధతో హృదయం మెలితిరిగింది.

అంటే...అంటే నేను తనకొరకే... కేవలం స్వార్థపు ఊహతోనే ఆయన ఇంటికి వెడుతున్నట్లుగా అభిప్రాయపడుతున్నారా?

ఈ భూమి రెండుగా చీలి నాకింత చోటిస్తే...

"సౌమ్యా...మరోలా అనుకోవద్దు. నీ అభిమానం, ఆత్మీయతా నేనెప్పటికీ మరిచిపోలేను. పిల్లలూ, నేనూ నీకెంతో ఋణపడివున్నాం. కానీ సౌమ్యా...నా స్వార్థంకోసం నిన్ను ఉపయోగించుకోలేను. నా వల్ల నీవు నింధలపాలు కావడం నేను సహించలేను. నువ్వు పెళ్ళి కావలసినదానివి. పిల్లా పాపలతో కళకళలాడాల్సినదానివి. ఇలాంటి నిందలు మీద పడితే నీ భవిష్యత్ ఏమవుతుంది? సౌమ్యా .... నేనన్నానని బాధపడకు. అర్థంచేసుకో"

చివరి మాటలంటూ ఆయన నెమ్మదిగా లేచి వెళ్ళిపోయారు.

నేను చివరివరకూ పెదవి విప్పకుండా వింటూ కూర్చున్నాను.

హమ్మయ్య...డాక్టరుగారికి నాపట్ల ఎలాంటి నీచమైన అభిప్రాయమూ

లేదన్నమాట. కేవలం నా భవిష్యత్తును దృష్టిలో పెట్టుకునే అలా అన్నారు. నా మనస్సు తేలికపడింది.

అయితే ఈ విషయం నేను ఇంత క్రితమే నిర్ణయించుకుని ఉండటంచేత వెళ్ళడమా మానడమా అనే విషయాన్ని గురించి ఎక్కువగా తర్జనభర్జన పడ లేదు.

పిల్లలమీద మమకారం, వారి తోడి అనుబంధాన్ని క్రమంగా దూరం చేసు కునేందుకే నిర్ణయించుకున్నాను.

* * *

రాత్రి పన్నెండు గంటలయింది.

నైట్ డ్యూటీ కావడంతో నిద్రపోవ డానికి ఉండదు.

కళ్లు మంటలుగా ఉన్నాయి. నిద్ర ముంచుకువస్తోంది.

కానీ నిద్రపోవడం తటస్థిస్తే స్టాఫ్ నర్సుతో చీవాట్లు తినాలి; డాక్టర్లు విసిరే చెణుకులు భరించాలి.

నిద్రను ఆపుకునే ప్రయత్నంలో లేచి వెళ్ళి చల్లని నీళ్ళతో ముఖం కడుక్కుని పుస్తకం పట్టుకు కూర్చున్నాను.

నవల చాలా ఇంటరెస్టింగ్‌గా సాగి పోతోంది.

చక్కని వాయిద్యంలో అపశ్రుతిలా మధ్య మధ్య ఒక ముసలాయన దగ్గు వుండీ వుండీ ఖంగున వినిపిస్తోంది.

మిగిలిన రోగులందరూ ప్రశాంతంగా నిద్రిస్తుండటంతో వార్డు ప్రశాంతంగా వుంది. క్రమేపీ ముసలాయన దగ్గు ఎక్కువైపోయింది.

ఖళ్ళు ఖళ్ళున దగ్గుతూ ఉంగలు చుట్టుకుపోతున్నాడు.

ఆయాసంతో రొప్పుతూ "నర్సమ్మా" అంటూ పిలిచాడు.

"ఏం తాతా...పిలిచావా?" అన్నాను దగ్గరగా వెళ్ళి.

"ఔను తల్లీ! ఈ పాడు దగ్గు నన్ను నిద్రపోనీయదు" దగ్గుతూ మరి చెప్పలేక ఆగిపోయాడు.

దగ్గరగా వెళ్ళి గుండెలు సవరించాను.

"తాతా .... డాక్టరుగారు ఉదయం పరీక్షచేసి మందు ఇచ్చారుకదూ? ఏమీ తగ్గినట్లులేదూ?"

"తగ్గదమా పాడా తల్లీ! ఈ రోగం నాతోనే పోవాలి తప్ప తగ్గదు. అమ్మా... నర్సమ్మా! చచ్చి నీ కడుపున పుడతాను. నిద్రపోడానికి ఏదయినా మందు ఇవ్వు తల్లీ..."

ఈసారి వచ్చిన దగ్గుతెర ముస లాయన ఊపిరి తిరక్కుండా ఊపేసింది. పక్కనే కూజాలో ఉన్న నీళ్లు గ్లాసులో వంపి తాగించాను.

మంచినీళ్లు తాగి కొంచెం తేరు కున్నాడు ముసలాయన.

నిద్రపోయేందుకు ఏదైనా మందు ఇవ్వమంటూ మళ్ళీ ప్రాధేయపడ్డాడు.

"తాతా! డాక్టరుగారికి తెలీకుండా మేమేమీ మందు ఇవ్వకూడదు"

"నర్సమ్మ తల్లీ! చూస్తున్నావుగా. తెల్లవార్లూ ఎంతకని బాధపడను తల్లీ..." రొప్పుతూ అన్నాడు ముసలాయన.

నైట్‌డ్యూటీ డాక్టర్ డాక్టర్ వేణు మాధవ్.

ఆయనను డిస్టర్బ్ చేయడం నాకు ఇష్టంలేదు.

ముసలాయన బాధ చూస్తుంటే చేయక తప్పదనిపించింది.

నెమ్మదిగా లేచి డాక్టర్ వేణుమాధవ్ గదివైపు దారితీశాను.

డాక్టర్ వేణుమాధవ్ గదితలుపు చేర





వేసి ఉంది. గదిలో లైట్ వెలుగుతోంది.

నెమ్మదిగా తలుపు మీద 'నాక్' చేశాను.

"యస్...కమిన్"

తలుపు తెరుచుకుని లోపలికి వెళ్ళిన నేను తిరిగి ఒక్క క్షణంలోనే గిరుక్కున వెనక్కి తిరిగాను.

డాక్టర్ వేణుమాధవ్ లోపల కేవలం ఒక లుంగీతో మాత్రం పడుకుని ఉన్నాడు.

ఆ లుంగీ కూడా వంటిని సరిగా కప్పకుండా అస్తవ్యస్తంగా ఉంది.

అసలు డ్యూటీలో ఉన్న డాక్టరు అలాంటి డ్రస్సింగ్‌లో ఉండకూడదు.

అందునా అలా వంటిమీద స్పృహ లేనట్లుగా, వంటి మీద బట్టకూడా సరిగా లేని స్థితిలో నన్ను ఎలా రమ్మన్నాడు లోపలికి...?

'బాస్టర్డ్...' కసిగా తిట్టుకున్నాను.

అయినా తప్పదు... వాళ్ళకు సబార్డినేట్సుగా వాళ్ళతో మాట్లాడకా తప్పదు... వాళ్ళ ఆర్డర్స్‌కు ఒబే కాకా తప్పదు.

అలాగే గుమ్మం ముందు నుంచున్నాను.

మరో రెండు నిమిషాల తరువాత డాక్టర్ వేణుమాధవ్ లుంగీ సర్దుకుంటూ బయటికి వచ్చాడు.

"వాట్ సౌమ్యా... ఏమైనా పనిమీద వచ్చావా?"

"యస్ డాక్టర్..."

నాలోని అసహ్యాన్నీ, కోపాన్నీ లోలోపల దాచుకుంటూ సౌమ్యంగా జవాబు చెప్పాను.

"ఓ... అయ్‌సీ!" అయితే లోపలికి రాకుండా ఇక్కడ నించున్నావేం?"

వెకిలిగా నవ్వుతూ అన్నాడు.

నాకు వళ్ళంతా కారం రాచుకున్నట్లుగా ఉంది.

ఈడియట్... ఎంత అసహ్యంగా మాట్లాడుతున్నాడు?

"లోపలికిరా... సౌమ్యా..."

"ప్లీజ్ డాక్టర్...కాల్ మి సిస్టర్"

"ఓ...అయ్‌సీ అయినా సౌమ్యా... పిలుపులో ఏముంది? భావం ముఖ్యంగానీ. సిస్టర్ అని పిలిచినంత మాత్రాన మీరు అందరికీ అక్కలూ చెల్లెళ్లూ అయిపోతారా?"

ఇతనితో ఎక్కువ మాటలు పెంచడం కంటే పని చూసుకుని బయట పడటం మంచిది.

"డాక్టర్! నాలుగో నంబర్ పేషంట్ ఆస్తమాతో బాధపడుతున్నాడు... నిద్ర పట్టక అవస్థపడుతున్నాడు"

"ఎవరూ...? ఆ ముసలాడా...? అయినా సౌమ్యా...నీకు ముసలాళ్ళంటేనే ఇష్టమే"

అతని గొంతులో ధ్వనించిన శ్లేషకూ, హేళనకూ మరి మాట్లాడలేకపోయాను.

"అయినా ఈ చల్లని రాత్రి వెచ్చగా కబుర్లు చెప్పకోక ఈ ముసలి గొడవెందుకు సౌమ్యా"

"డాక్టర్...ఆ పేషంట్..."

"లెట్ హిమ్ గోటు హెల్... కమాన్ సౌమ్యా గదిలో ఎవరూ చూడరులే..."

నాకు అసహ్యమేసింది. అవతల ఆ ముసలిప్రాణం బాధతో అలా కొట్టుకుపోతూంటే ఇక్కడ ఇతనిలా... అయినా ఇతని సంగతి తెలిసే రావడం నాదే బుద్ధి తక్కువ.

సభ్యతా సంస్కారాల మాట అటుంచి కనీస మానవత్వం కూడా లేని మనిషి.

అతని మూడ్ చూస్తుంటే అతనేమి

ఇచ్చేలా లేదు.

అక్కడి నుండి నా టేబిల్ దగ్గరకు వెళ్ళిపోయాను.

అంతకంటే నేనేం చేయగలను..?

ఆ ముసలి తాత పడుతున్న బాధ నాకు వినిపిస్తూనే ఉంది. అతని బాధను చూస్తూ, భరిస్తూ రాయిలా అలా చూస్తూ కూర్చున్నాను.

ఇదీ...మా...మానవత్వం.

ఇదీ...మా... సేవాధర్మం...

* * *

ఆ వేళ నాకు డ్యూటీ లేదు....

ఉదయం, మధ్యాహ్నం అంతా బద్ధకంగా పడుకుని సాయంత్రం లేచి ఫ్రెష్‌గా స్నానం చేసి తలచిక్కు తీస్తుకుంటున్నాను.

జుట్టుతో కుస్తీ పడుతుండగా తలుపు చప్పుడూ, దానితో పాటుగా "అక్కా! తలుపు తియ్యి..." అనే నీరజ గొంతూ వినిపించాయి.

తలుపు తీసి నవ్వుతూ నీరజను ఆహ్వానించాను.

"అక్కా! ఇంట్లో ఉన్నావో లేదో అనుకుంటూ వచ్చాను. హమ్మయ్య ఉన్నావు...." అంది నీరజ మంచం మీద బాసింపట్టు వేసుకు కూర్చుని.

"ఏమిటి నీరజా.... ఏమైనా అర్జంటు పనా?"

"పనేమీ లేదక్కా! ఒక విషయంలో నీ సలహా కావల్సి వచ్చాను"

"ఏమిటబ్బా అంత గొప్ప విషయం! అయితే ఒక్క క్షణం ఉండు. ఈ తల కాస్త ముడివేసుకు వచ్చి నీ దగ్గర కూర్చుంటాను..." అన్నాను జుట్టు చేత్తో మెలిపెడుతూ.

"వద్దక్కా! నేను చిక్కుతీసి జడ వేస్తాను. ఇలా రా..."

నీరజ దువ్వెన చేతుల్లోకి తీసుకుంది. నేను నీరజ ముందు కూర్చున్నాను. గట్టిగా దువ్వితే నాకెక్కడ నొప్పికలుగు తుందో అన్నంత నెమ్మదిగా జాగ్రత్తగా చిక్కులు తీస్తూ నీరజ అంది- "నీ జుట్టు భలే జుట్టక్కా. మీగడలా ఎంత మెత్తగా, పొడవుగా వుందో...."

"ఊఁ.... జుట్టుకేం బాగానే వుంది. అదృష్టమే బాగుండలేదు"

"నీ అదృష్టానికేం అక్కా! హాయిగా ఉద్యోగం చేసుకుంటూ స్వేచ్ఛగా బతుకుతున్నావు"

"ఊఁ... నీకూ అలాగే కనిపిస్తోందన్న మాట. సర్లే...ఏమిటో చెబుతానన్నావు"

నీరజ ఎలా మొదలు పెట్టాలో తెలీనట్లుగా మౌనంగా ఉండిపోయింది కొన్ని క్షణాలు.

"ఏమిటి అంత సిగ్గు పెళ్ళికూతుర్లా!"

"అదేనక్కా! అమ్మావాళ్ళు పెళ్ళి పెళ్ళంటూ గొడవ పెట్టేస్తున్నారు"

"హాయిగా చేసేసుకో...ఇంకాఆలస్యం ఎందుకు...?"

"నువ్వూ అలాగే చెప్తున్నావా?"

"ఎవరు చెప్పినా అదే చెబుతారునీరజా! ఇంతకూ నీ అనుమానం ఏమిటి?"

"అదికాదక్కా...ఒకసారి ఇలాజరిగిన నాకు మళ్ళా పెళ్ళేమిటి?"

"ఊఁ... పిచ్చికుదిరింది, తలకు రోకలి చుట్టమన్నాడట నీలాంటి వాడొకడు. పిచ్చి పిచ్చి అనుమానాలు పెట్టుకోకుండా హాయిగా పెళ్ళి చేసుకో"

"గతాన్ని మరచిపోలేకపోతున్నా నక్కా"

"గతం... గతమంటే జరిగిన దురదృష్టకరమైన సంఘటననా? లేక




ఆ ఈడియట్‌నా?"

"జరిగిన పాపాన్ని ఎలా మరచి పోనక్కా...?"

తను ఎవరిని మరచిపోలేక పోతోందో స్పష్టంగా తెలుసుకోలేకపోతోంది నీరజ.

"జరిగింది పాపమే అంటున్నావుగా! ఆ పాపాన్ని పదే పదే గుర్తుచేసుకోడంలో అర్థం లేదు. పైగా మరింత పాపం కూడాను"

నీరజ జడ మీదే దృష్టిని నిలిపినట్లుగా మౌనంగా జడ అల్లుతోంది.

"ఇంతకూ మీ వాళ్ళేమైనా సంబంధం చు శారా?"

"ఔనక్కా! అందుకే నాకు చాలా భయంగా వుంది."

"ఈ వూరేనా? ఏం చేస్తున్నాడట?"

"ఈ వూరేనక్కా...ఏదో ప్రయివేట్ కంపెనీలో సేల్సుమేనేజర్ అట. కట్నం పాతిక వేలు"

"అంటే అంతా సెటిల్ అయిపోయి నట్లేనా?"

"దాదాపు సెటిల్ అయిపోయినట్లే. నాకేమో భయంగా వుంది"

"నీరజా!మాటిమాటికి భయం..భయం.. నాకేమో భయంగా వుందిఅంటావు. నీ భయం ఏమిటో, దేని గురించో నాకు అర్థం కావడం లేదు"

"అదికాదక్కా! పెళ్ళయ్యాక ఈ విషయం ఆయనకు తెలిస్తే?"

నీరజ భయం అర్థమైంది. ఆమె భయంలో అర్థముంది కూడా. నీరజ మీద జాలితో నా కళ్ళు చెమరించాయి.

నిజానికి సృష్టిలో స్త్రీ జాతిమీద నాకు కలిగే ఒకే ఒక్క భావం... అది ఈ దేశంలో...కాదు కాదు ఈ ప్రపంచం మొత్తంలోనే ఏ పురుషుడైనా పెళ్ళికి ముందు తన జీవితం గురించి భార్యకు తెలుసుందేమో అని భయపడతాడా?

కేవలం ఆ భయం కారణంగా వివాహం మానుకోడానికి సిద్ధపడతాడా?

లేదు...లేదు...పురుషుడు దేనికీ భయ పడే అవసరం లేకుండా సంఘం అతనికి కాపుంటుంది.

అసలు సృష్టి తీరే పురుషుడికి అను కూలంగా వుంది.

ఇంతకింతగా ఎంత గగ్గోలుపెట్టినా స్త్రీ పురుషునితో సమానంగా బతకలేదు.. బతకనివ్వరు...అంతే.

"చెప్పక్కా....పెళ్ళయ్యాక తెలిస్తే?"

ఎంత దయనీయమైన పరిస్థితి. జీవి తంలో తెలిసీ తెలీని వయసులో చేసిన చిన్న తప్పుకు బతుకంతా భయపడుతూ, ఉలిక్కి ఉలిక్కిపడుతూ జీవించవలసి రావడం కంటే శిక్ష మరేముంటుంది జీవితానికి?

ఏదో చెప్పాలి..లేకపోతే నీరజ మరింత భయపడుతుంది.

"ఎలా తెలుస్తుంది నీరజా...?" ఇది అర్థంలేని ప్రశ్న అని నేనెరుగుదును!

"ఎందుకు తెలీకూడదక్కా! నన్నూ, తననూ ఎరిగినవాళ్ళెవరైనా తటస్థపడి ఓర్వలేక చెప్పవచ్చు"

"ఎప్పుడో ఏదో జరుగుతుందని ఇప్పటినుండే భయపడుతూ బతకడం అవివేకం నీరజా. తెలిస్తే అప్పుడు చూసు కుందాం. ఎప్పటికీ తెలీకపోతే మరీమంచిది. తెలిసినా క్షమించగలిగే సహృదయులు కూడా వుంటారు మగాళ్ళల్లో. అవన్నీ ఇప్పుడే ఆలోచించి మనస్సు పాడుచేసు కోడం అనవసరం"

"అక్కా! పోనీ ఒక పని చేస్తేనో..."

ఏవిటన్నట్లుగా నీరజ వైపు చూశాను

అల్లిన జడ ముందుకు వేసుకుంటూ.

"ఎవరి ద్వారానో ఆయనకు తెలిసే కంటే ముందుగా నేనే చెప్పేస్తే...?"

నీరజ అమాయకత్వానికి నవ్వాలో, ఏడవాలో అర్థం కాలేదు.

"చాలా గొప్పపనే చేస్తావు. పిచ్చి పిచ్చి ఆలోచనలతో తెలివితక్కువ పనులు చెయ్యకు"

నీరజ ఆలోచిస్తున్నట్లు మౌనంగా ఉండిపోయింది.

"నీరజా! అమ్మావాళ్ళు చెప్పినట్లు విని పెళ్ళిచేసుకో. మనం అనుకోకూడనిది ఏదైనా ఎదురైతే తరువాత చూసుకోవచ్చు"

"మోసం చేసినట్లు అవుతుందేమో"

ఇన్ని సెంటిమెంట్లున్న ఈ స్త్రీజాతి సుఖపడమంటే, శాంతిగా బతకమంటే ఎలా బతుకుతుంది?

పెళ్ళికిముందు మరో స్త్రీతో పరిచయమున్న పురుషుడెవరైనా తన కాబోయే భార్యను మోసం చేస్తున్నాననీ, అన్యాయం చేస్తున్నాననీ ఆలోచిస్తాడా?

"పెళ్ళి తరువాత నీ ప్రవర్తనలో తప్పువుంటే అది మోసం చేసినట్లు అవుతుంది. నీరజా... స్త్రీ గానీ, పురుషుడుగానీ పెళ్ళికి ముందు ఒకరి జీవితాల గురించి మరొకరు పట్టించుకోకూడదు. అదే న్యాయం"

"అంతేనా అక్కా"

"అంతే"

నేను లేచి స్టౌ వెలిగించి టీకి నీళ్ళు పెట్టాను.

"నీరజా... లేచి ముఖం కడుక్కో. అలాకాస్త షాపింగ్‌కు వెళ్ళాలి" అన్నాను డికాక్షన్ వడకడుతూ.





"ఏం తీసుకుంటావక్కా?"

"సోప్స్, సర్ఫ్, చీరలకు రెండుఫాల్స్ తీసుకోవాలి. నువ్వు అటునుండి అటే ఇంటికి పోదువుగాని"

నీరజ లేచి బాత్‌రూంలోకి వెళ్ళింది. రూంకు తాళం వేసి బయటికి వచ్చాం.

చల్లగా ఉండటంతో ఇద్దరమూ మెల్లగా కబుర్లు చెప్పుకుంటూ నడుస్తున్నాం షాపింగ్ సెంటర్‌కు.

'సౌమ్యా...సౌమ్యా....'

కేకలు వేసినట్లే ఎవరో పిలుస్తూండటంతో పక్కకు తిరిగి చూశాను. డాక్టర్ వేణుమాధవ్ రోడ్డుకు అడ్డంపడి పరుగెత్తుకొస్తున్నాడు - ఎంతో అవసరంగా కలుసుకోవాలన్నట్లు.

ఒక డాక్టరు అలా కేకలు పెడుతూ, తోసుకుంటూ, నెట్టుకుంటూ రావడం ఎంత అసహ్యంగా ఉండాలో అంత అసహ్యంగానూ ఉంది.

నడిరోడ్డుమీద ఆడవాళ్ళను అనవసరంగా పలకరించి నిలబెట్టి మాట్లాడ్డమే ఎంతో అసభ్యంగా ఉంటుంది - ఎంతో పరిచయం, స్నేహం ఉంటే తప్ప.

పైగా నడిరోడ్డు మీద పేరుపెట్టి కేకలు వేస్తూ పిలవడం...

లాగి గూబపగలగొట్టాలన్నంత కోపం వచ్చింది.

ఇంత వెకిలి వేషంతో రొమాన్స్ జరుపుతున్న మేరీ, లక్ష్మిలమీద జాలి కూడా కలిగింది.

ఎట్టకేలకు వేణుమాధవుడు రొప్పుతూ రోజుతూ దగ్గరగా వచ్చాడు.

"గుడీవినింగ్ సౌమ్యా" అన్నాడు కొంచెంగా ఎగపోస్తూ.

"గుడీవినింగ్ డాక్టర్"

"హల్లో నీరజా... బావున్నారా?"

బావున్నానన్నట్లుగా తల ఊపింది

నీరజ బిడియంగా.

"ఎందాకా?" అన్నాడు మాతోపాటు చనువుగా కలిసి నడుస్తూ.

"షాపింగ్ సెంటర్ వరకూ"

"అహ...అలాగా. నేనూ అటే. పదండి"

ఇద్దరమ్మాయిల కంపెనీ దొరికిన సంతోషంతో వేణుమాధవుడు ఏవిటేవిటో మాట్లాడుతున్నాడు అర్థం లేకుండా.

"డాక్టర్... మీ ఆరోగ్యం ఎలా ఉంటుందిప్పుడు?" లోగొంతుతో మృదువుగా, సౌమ్యంగా అడిగాను.

"నాకేం సౌమ్యా... అయామ్ ది హెల్దీ పర్సన్ విత్ యంగ్ బాడీ" అన్నాడు గర్వంగా.

"అహ...ఈమధ్య ఒకపక్క చెంప అంతా వాస్తే పిప్పి పన్నేమో అనుకున్నాను"

వేణుమాధవ్ ముఖం ఎర్రగా కంది పోయింది కోపంతో.ఏదో గొణుక్కుంటూ చరచరా వెళ్ళిపోయాడు

నవ్వుకున్నాను.

నీరజ తెల్లబోయి చూస్తూంది డాక్టరుగారి నిష్క్రమణ ఘట్టం.

"అదేంటక్కా .... అతనలా వెళ్ళిపోయాడు?" అంది.

"అదంతేలే...ఈమధ్య ఓ లేడీడాక్టరు చెయ్యి పట్టుకున్నాడట వంటరిగాచూసి. ఇంకేముంది .... ఆమె కాళికావతారమెత్తి గూబ వాయించేసింది. రెండురోజుల వరకూ ఆ వాపు తగ్గలేదు. అదీ సంగతి"

నీరజ నవ్వింది.

"ఎంత చనువున్నట్లుగా వచ్చాడో" అంది కొంచెం ఆశ్చర్యంగా.

"వాడంతేలే. చూసేవాళ్ళకు వాళ్ళతో తనకెంతో చనువున్నట్లు కనిపించాలని వెధవ హైరానపడతాడు"

"మీ ఇద్దరికి బాగా పరిచయం ఉందనుకున్నాను అతనలా పిలుస్తూ వస్తే"

"పరిచయం లేకేం అతను డాక్టరు. నేను నర్సు. మామధ్య పరిచయం ఇలా ఏడుస్తుంది"

ఆ తరువాత గబగబా షాపింగ్ పూర్తి చేసుకుని నీరజను రిషా ఎక్కించి నేనూ రిషా మాట్లాడుకున్నాను – ఒక్కదాన్నీ నడచి ఇంటికి రావడానికి బోర్ ఫీలవుతూ.

* * *

అనుకున్నట్లుగానే పదిహేను రోజులు గడవకుండానే నీరజ వెడ్డింగ్ కార్డు తీసుకు వచ్చింది.

"హాయ్ నీరజా! విష్ యూ హేపీ మేరీడ్ లైఫ్" అన్నాను సంతోషంగా వెడ్డింగ్ కార్డు అందుకుంటూ.

"ఏం హేపీనో అక్కా! నాకు చాలా భయంగా వుంది" అంది దిగులుగా.

నిజమే..ఆ పిల్ల భయం ఆ పిల్లది.

ఏ వేణుమాధవుడిలాంటివాడో పచ్చగా బతుకుతుంటే చూడలేక చిచ్చుపెట్టడని గ్యారంటీ ఏముంది?

ఏమయినా క్షణ క్షణం భయం భయం...

"అక్కా! నువ్వు తప్పకుండా వస్తావు కదూ?"

"ఏం? నేను రాకపోతే పెళ్ళి చేసుకోవా?" అన్నాను హాస్యంగా.

"అలా అనకక్కా...నువ్వుంటే నాకు ధైర్యంగా వుంటుంది. వస్తావుకదక్కా"

"సరేనన్నానా"

నీరజ మరీ మరీ చెప్పి మరీ వెళ్ళింది.

అప్పటికి నీరజను ఒదిలించుకునేందుకు, ఆ పిల్లను కష్టపెట్టడం ఇష్టంలేకా 'సరే' అన్నా అసలు నాకు వెళ్ళే ఉద్దేశం

అసలు లేదు.

మావంటి నర్సుల ఉనికి అక్కడ అనవసరం. పైగా మాతో స్నేహం ఆ పిల్లకు అంత గౌరవాన్ని కూడా కలిగించదు.

'ఈ నర్సమ్మ మూలంగా మా పిల్ల గుట్టు బయటపడుతుందేమో' అని ఆ తల్లిదండ్రులు భయపడినా ఆశ్చర్యపోనక్కరలేదు.

నీరజ పెళ్ళికి వెళ్ళలేదు-ఆ పిల్ల బాధ పడుతుందని తెలిసినా. ఆ తరువాత రెండు నెలలకు నీరజ కలిసి బాగా దెబ్బలాడింది పెళ్ళికి రానందుకు. నీ పెళ్ళికి రానంటూ నిష్ఠూరాలాడింది.

నేను నవ్వేసి ఊరుకున్నా నా మాటకు.

నీరజ చాలా సంతోషంగా వుంది.

జీవితం ఒక స్థిరమైన మార్గం చేరుకున్నప్పటి ఆత్మవిశ్వాసం ఆ కళ్ళలో తళతళలాడుతోంది.

"నీరజా! ఏమిటి విశేషాలు...?"

"నేను చాలా సంతోషంగా ఉన్నానక్కా! ఆయన చాలా మంచివారు. నన్ను చాలా ప్రేమగా చూసుకుంటున్నారు. కాని, ఇంత సంతోషంలో కూడా ఎప్పుడూ ఏదో భయం మనస్సును పీకుతుంటూనే వుంటుందక్కా!''

నాకు జాలివేసింది.

దాంపత్యజీవితంలో ప్రేమకు, అనురాగానికి మూలం నిర్భయం... ఒకరిపట్ల ఒకరికి విశ్వాసం...

గతం నీరజను వెంటాడుతూ ఆమె దాంపత్య మధుర సంగీతంలో అపశ్రుతిలా వినిపిస్తోంది.

ఆ భయం ఇప్పుడప్పుడే ఆమెను వదలిపోదు.

"నీరజా .... భయం ఎందుకు? ఏది జరిగితే అదే జరుగుతుందని నిర్భయంగా వుండు. నువ్వనుకున్నావా నీకు పెళ్ళవుతుందనీ, ఇంత మంచి భర్త దొరుకుతాడనీ. అలాగే అన్నీ మంచే జరుగుతాయని ఆశిద్దాం. ఏమైనా నువ్వు భయపడ్డం ... బెంగపడ్డం పూర్తిగా అనవసరం..."

నీరజకు ధైర్యం చెప్పాను.

"నీ మాటలు నాకు టానిక్‌లా పని చేస్తాయక్కా"

''ఔను మరి ... నర్సును కదూ" అన్నాను నవ్వుతూ.

"అక్కా! ఆయన వస్తారు ... ఇంక నేను వెడతా" నంటూ నీరజ వెళ్ళిపోయింది.

నీరజ బతుకులో వసంతం వచ్చినందుకు నాకు చాలా సంతోషం అనిపించింది.

* * *

మూడు రోజులుగా డాక్టరుగారు హాస్పిటల్‌కు రావడంలేదు. ఏమై ఉంటుంది? వారికేమయినా బావుండలేదా?

ఆ దిక్కుమాలిన మత్తు మందుతో ఈమధ్య మరింత తీసిపోతున్నారు. ఆయనకు క్రమేపీ అది ఒక వ్యసనంగా మారిపోయింది.

ఒకవేళ పిల్లలకేమయినా బాగుండలేదేమో?

ఈ ఆలోచన నాకు చాలా దిగులు కలిగించింది.

చిన్ని ఎలా ఉందో?

చిన్నిని చూసి ఇప్పటికి రెండు వారాలు దాటిపోయింది.

ఆ సాయంత్రమే డాక్టరుగారి ఇంటికి వెళ్ళి పిల్లల్ని చూసేందుకు నిశ్చయించుకున్నాను.




ఆ నిర్ణయం నాకెంతో తృప్తిని కలిగించింది.

ఆ సాయంత్రం హాస్పిటల్ నుండి బయటికి వస్తూనే డాక్టరుగారింటికి బయలు దేరాను.

నా మనస్సంతా ఆందోళనగా ఉంది. ఎప్పుడెప్పుడు పిల్లల్ని చూస్తానా అని ఆరాటపడుతూ వేగంగా నడుస్తున్నాను.

హలో సౌమ్యా..."

ఎవరో పిలిచినట్లుగా అనిపించి వెనక్కు తిరిగి చూశాను.

డాక్టర్ వేణుమాధవ్—

నా మనస్సు ఉసూరుమంది.

ఈ జిడ్డును ఎలా వదిలించుకోవాలి?

"గుడీవినింగ్ మిస్ సౌమ్యా" అన్నాడు దగ్గరగా వచ్చి అతి మర్యాద ఒలకపోస్తూ; కేవలం 'గుడీవినింగ్' చెప్పేందుకే నడిబజారులో ఆపినట్టు.

"గుడీవినింగ్ డాక్టర్"

"సౌమ్యా! ఎంతో కాలంగా నీకో విషయం చెప్పాలనుకుంటున్నాను"

గురుడు సూటిగా విషయంలోకి వచ్చేస్తున్నట్లున్నాడు.

"ఐలవ్ యూ సౌమ్యా! ఐ లవ్ యూ సోమచ్..." అన్నాడు అదోరకం ఆవేశం ప్రదర్శిస్తూ డ్రెమటిక్ గా.

నాకు నవ్వు వచ్చింది.

'నీ తలకాయ..నీకు నటించడం కూడా రాదు' అనుకున్నాను మనస్సులో. కానీ పైకి మాత్రం "థాంక్యూ డాక్టర్" అన్నాను.

"సౌమ్యా...నీకు ఇష్టమైతే మనిద్దరం



మ్యారేజ్ చేసుకుందాం"

పెళ్ళి పేరు చెబితే ఏ ఆడపిల్లయినా ఇట్టే లొంగిపోతుందని వాడి నమ్మకం లాగుంది!

పెళ్ళి పేరుతో పెళ్ళికి ముందే అమ్మాయిల్ని స్వంతం చేసుకోవచ్చు.

సినిమాలకూ, షికార్లకూ తిప్పి ఎంజాయ్ చెయ్యొచ్చు.

ఇదో మాస్టర్ ప్లాన్...

"థాంక్యూ డాక్టర్...అలాగే.మీవంటి గొప్ప డాక్టరు పెళ్లాడతానంటే కాదంటానా"

వేణుమాధవ్ ముఖం వెలిగిపోయింది.

"నాకూ చాలా సంతోషంగా ఉంది డాక్టర్.కానీ..."

"ఏమిటి సౌమ్యా?"

"ఏమీలేదు. మీ అర్ధాంగి నీ, మేరీనీ, లక్ష్మినీ సంప్రదించి ముహూర్తం పెట్టించండి. లేకపోతే ఒకళ్ళు కొరకంచూ, మరోకళ్లు చీపురుకట్టా, ఇంకొకళ్లు పచ్చడి బండతో మిమ్మల్ని దీవించడానికి తయారవుతారు. అప్పుడు మీరు హనీమూన్‌కు హాస్పిటల్‌కు వెళ్ళాల్సొస్తుంది"

అటుగా పోతున్న రిక్షాను ఆపి అందులో కూర్చుని పోనివ్వమన్నాను.

ఇప్పుడు వేణుమాధవుడి ముఖారవిందం ఎలా ఉంటుందో ఊహించగలను.

ఇడియట్ ... పెళ్ళి చేసుకుంటాడట పెళ్ళి. ఇద్దరి బిడ్డల తండ్రి ... చక్కని భార్య. వీడికి పెడబుద్ధులెందుకో?

రిక్షా డాక్టరుగారి ఇంటి ముందు ఆగడంతో రిక్షావాడికి డబ్బు ఇచ్చి గబగబా లోపలికి నడిచాను.

లోపలి దృశ్యం చూస్తూనే బ్రమ్మపడి పోయాను.





ఒళ్లుతెలీని జ్వరంతో చిన్ని మంచం మీదపడి ఉంది. చూస్తూనే నా కాళ్లూ చేతులూ బిగుసుకుపోయాయి.

ఈ ఇంటికీ, ఈ పిల్లలకూ దూరమై నేనెంత తప్పుచేశానో నాకు బాగా అర్థమయింది. చిన్ని పక్కనే మంచంలో కూర్చుంటూ, చిన్నిని చేతుల్లోకి తీసుకున్నాను.

నాకు దుఃఖం ఆగడంలేదు.

స్పృహలోలేని చిన్ని నా చేతుల్లో తోటకూర కాడలా వేలాడిపోతోంది. డాక్టర్‌గారు ట్రీట్‌మెంట్ ఇస్తున్నా ఈ పిల్ల ఎందుకిలా అయ్యిందో నాకు అర్థం కాలేదు. చిన్ని జ్వరతీవ్రతతో ఎగిరెగిరి పడుతోంది.

"చిన్నికి ఇలా ఉన్నా నాకు కబురు చెయ్యలేదేం డాక్టర్"నా గొంతులో కోపం, నిష్ఠూరం పోటీపడుతున్నాయి.

డాక్టరుగారు తప్పుచేసినట్లుగా తల వంచుకున్నారు.

"మీరు చాలా కఠినమైన వారు. పిల్ల ఇలా మంచంపడితే ఏవేవో అనుమానాలతో పిల్లను బలిచేయాలనుకున్నారా? కనీసం ఒక నర్స్‌గానయినా నాకు కబురు చేయవచ్చునే?" కోపంతో నా గొంతు వణుకుతోంది. దాచుకోవాలన్నా కన్నీళ్లు దాగడంలేదు.

ఇంతకుముందెప్పుడూ డాక్టరుగారితో ఇన్ని మాటలు మాట్లాడి ఉండలేదు.

"సారీ సౌమ్యా....పొరపాటయింది"

ఇక ఆ తరువాత నేనేమీ మాట్లాడలేదు. కానీ నాకుమాత్రం మనస్సులో కష్టంగానే ఉంది.

"ఆంటీ! మీరు రావడం మంచిదయింది. లేకపోతే చిన్ని బతికిఉండేది కాదు" అంది రమణి కన్నీళ్ళతో.

డాక్టరుగారు పెద్ద బరువు దించు

కున్నట్లుగా తేలికగా నిట్టూర్చారు.

ఆ తరువాత రెండురోజులకు చిన్ని జ్వరం తగ్గుముఖం పట్టింది.

స్పృహవచ్చిన తర్వాత మొట్ట మొదటిగా నన్ను చూసిన చిన్ని, "అమ్మా" అంటూ నా మెడచుట్టూ చేతులు పెనవేసి ఆర్తిగా అల్లుకుపోయింది. పూచిక పుల్లల్లా ఉన్న ఆ చేతులు బలహీనంగా వేలాడిపోతుంటే గువ్వలా నా ఒడిలో ముడుచుకుపోయింది.

నేను మళ్లా తనకు కనబడనేమో అనే భయంతో కాబోలు "అమ్మా అమ్మా" అంటూ నన్ను పెనవేసుకుపోతోంది మాటిమాటికీ.

చిన్నిది మనోవ్యధ..అమ్మకోసం పడే ఆరాటం...చిన్ని పిలుపు నా గుండె పొరలను చీల్చుకుని అణగారిన మమత లను తట్టి కుదిపి లేపింది.

"చిన్నీ" అంటూ చిన్నిని పదిలంగా గుండెలకు హత్తుకున్నాను. ఎన్ని నిందలు రానీ, ఎన్ని అవమానాలు ఎదురవనీ ఏది ఏమయినా కానీ ఈ చిన్నికి మాత్రం దూరంగా ఉండలేను.

చిన్నిని నానుండి ఎవరూ విడదీయ లేరు.

## 3



డి.యమ్.ఓ.గారు పిలుస్తున్నారంటూ స్టాఫ్‌నర్స్ చెప్పడంతో కంగారువేసింది.

డి. యమ్. ఓగారు పిలుస్తున్నారూ అంటే అది మామూలు విషయంకాదు. దేనికి పిలుస్తున్నారో? ఏం అడుగుతారో? ఏం చెప్పాలో?

తడబడుతూ డి.యమ్.ఓగారి ఆఫీసు రూంవేపు అడుగులువేశాను. డి.యమ్.ఓ. గారంటే స్టాఫ్ అంతటికీ సింహస్వప్నం. ఒణుకుతూ స్ప్రింగ్‌డోర్ నెట్టాను.

కందిపోయిన ముఖంతో డాక్టర్ కృష్ణ మోహన్‌గారు కూడా అక్కడే కూర్చు న్నారు.

నాకు విషయం అర్థమైంది.

మా విషయం డి.యమ్.ఓ.గారి వరకూ వచ్చిందన్నమాట.

నాలో ఏదో మొండిధైర్యం ప్రవే శించింది.

అంతకుముందున్న ఒణుకుస్థానే ఏదో నిర్లక్ష్యం... ఏమయితే కానీ ఏమవుతుందో చూద్దాం అన్న తెగింపు.

ఎదురుగావెళ్ళి నమస్కారం చేశాను.

ఎదురుగా అన్ని ఛైర్స్ ఖాళీగా ఉన్నా అయన నన్ను కూర్చోమని చెప్పలేదు. ఒక మామూలు నర్సును గౌరవించాల్సిన అవసరం వాళ్లకు లేదు. వాళ్ళు ఆఫీసర్సు...

ఆఫీసర్సు ఆఫీసర్సును మాత్రమే లేక అంతకు పైమెట్టులో ఉన్నవారిని మాత్రమే గౌరవించాలి అనే నియమాన్ని వాళ్ళు అక్షరాలా పాటిస్తారు.

"నీ పేరు సౌమ్యక దూ?" పులి ఎదురుగా ఉన్న లేడిపిల్లతో మాట్లాడేతీరు బహుశా ఇదే కావచ్చు.

"ఔను" అన్నట్లుగా తల ఊపాను.

"నీకెవరూ లేరుకదూ?"

అవమాన భారంతో నా తల కృంగి పోయింది. నువ్వు దిక్కులేని దానివికదూ

అన్నట్లుంది ఆ ప్రశ్న.

"నువ్వు ఇప్పుడు ఎక్కడ ఉంటున్నావు?"

చెప్పాను.

డి. ఎమ్. ఓ. డాక్టరుగారి వంక చూశారు. 'చూశావా పట్టేశాను...' అన్నట్లుగా ఉంది ఆ చూపు.

"చూడండి మిస్టర్ కృష్ణమోహన్! ఇది పూర్తిగా మీ పర్సనల్ మేటరే అనుకోండి. అయినా మాంసం తింటున్నామని ఎముకలు మెడలో వేసుకోలేం కదా....?"

"చదువుకున్న మీలాంటివాళ్ళు కూడా నైతికంగా ఇలా దిగజారి..." డి.ఎమ్.ఓ.మాట ఇంకా పూర్తి కాకముందే డాక్టర్ కృష్ణమోహన్ దిగ్గున లేచి నించున్నారు.

ఆయన ముఖం కోపంతో కంది పోయింది. కోపం ఆపుకుంటున్నట్లుగా పిడికిళ్ళు బిగపట్టారు.

"సారీ సర్! సౌమ్యా, నేనూ పెళ్ళి చేసుకోబోతున్నాము. రిజిస్టర్ మారేజీకి అప్లికేషన్ పెట్టాము. పద సౌమ్యా" అంటూ నడిచారు.

''వ్వాట్?" అంటూ నోరు తెరిచిన డి.ఎమ్.ఓ గారు ఎప్పటికి నోరు మూశారో చూడకుండానే నేనూ తలవంచుకునిడాక్టరు గారి వెనకే నడిచాను.

అయితే నాకూ చాలా ఆశ్చర్యంగా ఉంది.డాక్టరుగారు ఏమిటి ఇలా అన్నారు?

ఏమంటేనేంలే? వాడి నోరు తక్కున మూయించారు.

కానీ, తరువాత....?

పోనీ, ఎలా జరిగినా నాకేమీ అభ్యంతరం లేదు.

అందుకే ఇప్పటికి కొన్ని నెలలుగా డాక్టరుగారి ఇంట్లోనే ఉంటున్నా నాకేమీ అభ్యంతరం లేకపోయింది.

"సారీ సౌమ్యా ... వాడేదో వాగుతుంటే వాడి నోరు మూయించేందుకు కోపంతో ఏదో అనేశాను. నువ్వు బాధ పడకు''

నేను మౌనంగా తల వంచుకుని నించున్నాను.

"క్షమించు సౌమ్యా" అన్నారు బాధ పడుతూ.

"మీరు కోపంతో అన్నారు...నిజమే. కానీ మరో నాలుగు రోజులు పోయింతరువాత మాత్రం వాళ్ళు మళ్ళా అడగరా?"

"నిజమే. కానీ, అవన్నీ నేనా క్షణంలో ఆలోచించలేదు"

"పోనీ, ఇప్పుడాలోచించండి"

"అంటే...?"

"అంటే ఏముంది? ఈ లోకం ఎలాగూ మిమ్మల్నీ, నన్నూ జతచేసింది. వాళ్ళు అనుకుంటున్నట్లుగానే మనం ఎందుకు ఏకం కాకూడదూ?"

"సౌమ్యా" ఒక్కసారి కేక పెట్టినట్లుగా అరిచారు డాక్టరుగారు.

ఉలిక్కిపడి నిటారుగా కూర్చున్నాను.

"ప్లీజ్....సౌమ్యా! నన్ను అపార్థం చేసుకోకు. నాకలాంటి ఉద్దేశం లేదు''

"కానీ నాకు ఉంది''

డాక్టరుగారు తెల్లబోయారు.

'ఇలా మాట్లాడుతోంది సౌమ్యేనా?' అన్నట్లు వింతగా, అయోమయంగా చూశారు.

"ఎందుకు అంతలా ఆశ్చర్యపోతున్నారు? నాకు చిన్నికావాలి. మీకు ఓ ఆడ తోడు కావాలి. ఆ తోడు నేనే ఎందుకు కాకూడదూ? ఆ అవకాశం నాకే ఎందుకు ఇవ్వకూడదూ?"

"సౌమ్యా! నీకెలా చెప్పాలి?" బాధగా నుదురు రాచుకుంటూ అన్నారు డాక్టరు గారు.

"మీరేమీ చెప్పవద్దు. అన్ని విషయాలూ నాకు తెలుసు"

"ఏమిటి తెలుసు నీకు? నువ్వేం మాట్లాడుతున్నావో నీకు తెలుస్తోందా ముందు?" కోపంగా అడిగారు డాక్టరు గారు.

కానీ అది తెచ్చిపెట్టుకున్న కోపం. కోపం కంటే ఆయనలో బాధే ఎక్కువగా ఉంది.

"ఆ...తెలుసు. జీవితంలో ఒంటరితనంతో విసిగిపోయాను. నాకు రక్షణ కావాలి. నా జీవితానికో ఆలంబన కావాలి"

"అందుకని ఏవిధంగానూ ఈడూ జోడూ కలవని నన్ను పెళ్ళి చేసుకుంటావా? సౌమ్యా...నీకు తెలీదు. నిన్ను భర్తగా ఏవిధంగానూ సుఖపెట్టలేను"

"అక్కర్లేదు...నాకే సుఖాలూ అక్కర్లేదు. కేవలం మీ భార్యగా ఉంటే చాలు. మీకు భార్యను కాలేకపోయినా మీ పిల్లలకు తల్లినౌతాను. ఆ సంతోషం నాకు చాలు. మీ అండ నాకు కావాలి. ప్లీజ్....కాదనకండి"

"సౌమ్యా....ఏమిటీ పిచ్చి మాటలు? నా పిల్లలకోసం నిన్ను అన్యాయం చెయ్యనా?"

"ఇందులో అన్యాయం ఏముంది? మీకో ఆడదిక్కు కావాలి. నాకు ఆశ్రయం కావాలి. కనీసం మీ ఇంటి పనిమనిషి అనుకోండి. కాకపోతే నలుగురూ వేలెత్తి చూపించకుండా ఉండేందుకు పెళ్ళి అనేది ఒక తంతు మాత్రమే. ఈ వివాహం వల్ల ఇద్దరికీ లాభమే కానీ ఇందులో ఒకరిని ఒకరు చేసే అన్యాయం ఏముంది? ముఖ్యంగా నాకు కొత్తగా కలిగే అన్యాయం మాత్రం ఏముంది?"

"కేవలం ఆశ్రయంకోసం ఇలాంటి పెళ్ళికి నీవు ఇష్టపడటం, నేను చేసుకోడం అన్యాయం కాకపోతే మరేమిటి?"

"ఇది అన్యాయం కాదు. ఒప్పందం మాత్రమే"

"సౌమ్యా...నా మాట విను. నీకు మంచి వరుణ్ని వెదికి నీ పెళ్ళి స్వయంగా నేను జరిపిస్తాను. ఇలాంటి వెర్రి ఆలోచనలు మానుకో"

"వద్దు డాక్టర్ ... వద్దు. నన్ను దూరం చేయకండి. ప్లీజ్ ... నా కోరిక కాదనకండి"

* * *

డాక్టరుగారితో నా వివాహం క్లుప్తంగా రిజిస్ట్రారు ఆఫీసులో జరిగిపోయింది.

మా వివాహం స్టాఫ్‌లో పెద్ద సంచలనమే లేవదీసింది. అందరూ ముక్కుమీద వేలేసుకున్నారు.

డబ్బున్న డాక్టరును పెళ్లాడిన సౌమ్య అదృష్టవంతురాలని కొందరన్నారు.

డబ్బుకోసం ముసలాణ్ని కట్టుకుందని మరికొందరన్నారు.

"ఈ అమ్మాయికి ఇదేం పిచ్చి" అని కొందరంటే,

"ఈ డాక్టరుకు మాత్రం బుద్ధి ఉండక్కర్లా? నలుగురి పిల్లల తండ్రి. ఈ వయసులో ఈయనకు పెళ్ళేమిటి" అని మరికొందరన్నారు. అయితే ఇవన్నీ చాటుమాటుగా అనుకున్న మాటలే.

మా ముందు మాత్రం అందరూ మమ్మల్ని అభినందించారు.

"అక్కా...నా పెళ్ళికి నువ్వు రాకపోయినా నీ పెళ్ళికి నేను వచ్చాను

చూడు" అంది నీరజ నవ్వుతూ.

ఎవరు ఏమనుకున్నా, ఎలా అనుకున్నా నాకుమాత్రం చాలా సంతోషంగా ఉంది.

నేను ఇల్లాలినయ్యాను అనుకుంటే పట్టలేనంత ఆనందంగా ఉంది; నా బంగారు తల్లికి తల్లినయ్యాననుకుంటే చెప్పలేనంత గర్వంగా ఉంది. డాక్టరుగారి ముఖం మాత్రం ఏ భావానికీ అందకుండా నిర్లిప్తంగా ఉంది. ఈయన ఈ సంఘటనకు ఏమాత్రమూ సంతోషించడంలేదని నాకు స్పష్టంగా తెలుసు.

రమణి ఈ వార్త విని ముభావంగా ఉండిపోయింది.

ఆ పిల్లకు సంతోషంగా ఉందో లేక అయిష్టంగా ఉందో నేను కనిపెట్టలేక పోయాను.

నిజానికి చిన్నపిల్లగా ఆమె మనోభావాలకు నేను అంతగా ప్రాధాన్యం ఇవ్వలేదనే చెప్పాలి.

* * *

"నేను జాబ్‌కు రిజైన్ చేద్దామనుకుంటున్నాను" అన్నాను ఒకరోజు డాక్టరుగారితో.

"జాబ్ లేకుండా నీకెలా తోస్తుంది?"

నేను నవ్వాను.

"నలుగురు పిల్లల తల్లికి ఇంట్లో తోచకపోవడం అంటూ వుండదు"

డాక్టరుగారు జాలిగా చూస్తూ - "అయ్‌సీ" అన్నారు.

"రిజైన్ చెయ్యమంటారా?"

"నీ ఇష్టం"

"అంటే మీకు ఇష్టంలేదా?" కయ్యానికి కాలుదువ్వుతున్నట్లు అల్లరిగా అడిగాను.

"పిచ్చి సౌమ్యా! నీకు ఎలా నచ్చితే అలా చెయ్యి. నువ్వు సుఖంగా, సంతోషంగా వుండటమే నేను కోరుకొనేది"

ఆవిధంగా నాకు మొదటినుండే అయిష్టంగా వున్న ఆ జాబ్‌కు గుడ్‌బై చెప్పేశాను.

గృహిణిగా సక్రమంగా నా బాధ్యతలు నిర్వహించగలిగితే అంతే చాలు.

అందులోనే నాకు తృప్తి.

* * *

ఆకాశం వెన్నెల కురుస్తోంది.

నిశ్శబ్ద నీరవ ప్రకృతిలో పరిమళం నింపిన పవనాలు మత్తుగా హాయిగా వీస్తున్నాయి.

గాలి ఓ రకమైన సుగంధాన్ని నింపుకు తెస్తోంది. మల్లె జాజి, రాత్‌కీ రానీ పరిమళాలు ఒక వంక, వెన్నెల స్నానాలు చేస్తున్న ప్రకృతి పరిమళాలు ఒకవంక మనస్సును మత్తులో ముంచేస్తున్నాయి.

నా తనువంతా వెన్నెల స్నానం చేస్తున్నట్లుంది. ఇలాంటి అద్భుతమైన వెన్నెల దినాల్లోనే దేవకన్నెలు భూలోక విహారానికి వచ్చేవారట.

దేవకన్యలు ఎలా ఉండేవారో...?

తలమీద ఎవ్వరిదో చెయ్యి మృదువుగా పడేప్పటికి ఒక్కసారిగా ఉలిక్కిపడ్డాను.

నిద్రపోతున్న డాక్టరుగారు ఈవేళప్పుడు ఇలా బయటికి వచ్చారేమిటి?

నిద్ర పట్టలేదేమో...

ఆయన ఆప్యాయంగా నా జుట్టు నిమురుతూ "సౌమ్యా... ఇంకా నిద్రపోలేదా?" అన్నారు_నేను లేచిన కుర్చీలోనే కూర్చుంటూ, నావంక పరిశీలనగా చూస్తూ.

ఆ స్వరంలో పలికిన ఆత్మీయతకు నా కళ్లు చెమ్మగిల్లాయి.

'లేదు' అన్నట్లుగా తల అడ్డంగా





తిప్పాను.

"నిద్ర పట్టడంలేదా?"

ఆయన గొంతుఆర్ద్రంగావినిపించింది.

చెమ్మగిల్లిన నా కళ్ళల్లో కన్నీళ్లు సుళ్లు తిరిగాయి.

ఇంత ఆత్మీయమైన పిలుపు విని కొన్ని సంవత్సరాలు గడిచిపోయింది. నన్ను ఆదరించేందుకూ, కనీసం ఆత్మీయంగా పిలిచేందుకు గానీ నాకెవరున్నారు?

ఈ కొద్దికాలంలో డాక్టరుగారితో అనుబంధం ఏర్పడ్డా ఆయానా, నేనూ చనువుగా మాట్లాడుకున్న సమయాలు చాలా తక్కువ. అమ్మా, నాన్న పోయిన తరువాత నాపట్ల ఇంతటి ఆత్మీయత కనబరిచినవాళ్లు ఒక్కరూ లేరు.

ఎంతో కాలంగా పోగొట్టుకున్నాను అనుకున్న అమూల్య సంపద చేజిక్కినంత ఆశగా, ఆబగా ఆయనవంక చూశాను.

నా కళ్ళల్లో సుళ్ళు తిరిగిన నీళ్లు బుగ్గలమీద జారి ఆ వెన్నెల వెలుగులో తళుక్కుమన్నాయి.

ఆయన జాలిగా నావంక చూశారు. ఏదో బాధతో ఆయన ముఖం మలినమైంది.

"సారీ సౌమ్యా! నిన్ను సుఖపెట్టలేని అశక్తుణ్ని. నన్ను క్షమించు"

మరో మాటకు అవకాశం ఇవ్వకుండా తలవంచుకుని నెమ్మదిగా గదిలోకి వెళ్ళిపోయారు.

నా కన్నీళ్లు చూసి ఆయన బాధ పడుతున్నారు. ఆ విషయం నాకు స్పష్టంగా తెలిసింది.

కానీ నా కన్నీళ్ళను ఏ విధంగా అర్థం చేసుకున్నారు?

ఆయనను చేసుకున్నందుకు నేను బాధ పడుతున్నాననుకుంటున్నారు; పశ్చాత్తాప పడుతున్నాననుకుంటున్నారు.

తనివ్వలేని సుఖాల గురించి నేను బాధ పడుతున్నాననుకుంటున్నారు.

ఎంత అన్యాయంగా మాట్లాడారు...?

సిగ్గుతో, న్యూనతా భావంతో నా తల వాలిపోయింది. నిజానికి ఈ వయస్సులో అందరికీ ఉండే కోరికల వేడి నన్నింకా చేరలేదనే చెప్పాలి.

కారణం...నన్ను కరిగించి కలల్లో తేలించే పురుషుడెవ్వరూ నా పరిధిలో నాకు తటస్థపడక పోవడమే.

"చూడండీ! మీరూహించింది అబద్ధం. నాకు ఏ కోరికలూ లేవు. కోరికలతో నేను వేగిపోవడం లేదు. మిమ్మల్ని వివాహం చేసుకున్నందుకు నేనేమీ పశ్చాత్తాప పడటంలేదు.

అన్ని విషయాలూ తెలిసే మనస్ఫూర్తిగా నేనీ వివాహానికి అంగీకరించాను. ఎటూ ఏ దిక్కులేని నాకు మీ అండ, మీ ఆప్యాయతే గొప్ప వరం. ఈ వరం చాలు నాకు. ఈ సౌభాగ్యంతో నేను నిశ్చింతగా రోజులు గడిపేస్తాను. దయచేసి నన్ను అపార్థం చేసుకోకండి".. ఇవేకాదు, ఇంకా ఎన్నో ఎన్నో చెప్పాలనుకున్నాను. కానీ ఒక్కమాట కూడా చెప్పలేకపోయాను.

వెల్లకిలా పడుకుని కళ్ళ మీద చేతులుంచుకుని ఆలోచిస్తున్న ఆయన్ను చూస్తుంటే మనస్సు చివుక్కుమంది.

పలకరించేందుకు ధైర్యం చాలలేదు. నెమ్మదిగా వచ్చి చిన్ని పక్కలో చోటు చేసుకున్నాను.

నా తొందరపాటు చర్యతో ఆయనకు తీరని వేదన కలిగించాను. ఆయన బాధ పడుతున్నారు. కేవలం నా గురించి బాధ

పడుతున్నారు. ఆయన బాధ పడకుండా ఉండటానికి నేనేం చేయగలను?

వెన్నెల రాత్రులలో నాకు ఒకపట్టాన నిద్రపట్టదు. ఆ ప్రకృతి...ఆ పరిమళాలు నాలో ఏదో ఆనందాన్ని నింపుతాయి. వెన్నెలను చూస్తుంటే ముఖ్యంగా అమ్మ గుర్తుకు వస్తుంటుంది. గడచిన జ్ఞాపకాలను తలచుకుంటుంటే ఎంత సమయమైనా ఇట్టే గడచిపోతుంది.

ఈ విషయాన్ని డాక్టరుగారికి అర్థమయ్యేలా చెప్పాలి. నేనేమీ బాధపడటం లేదని ఆయనకు నమ్మకం కలిగేలా ఇప్పుడే చెప్పకపోతే ముందు ముందు ఆయన ఇంకా ఎక్కువ బాధపడేందుకు అవకాశం ఉంటుంది.

వెంటనే లేచి డాక్టరుగారి గదిలోకి వెళ్ళాను.

కానీ....నా దురదృష్టం... ఆయన అప్పటికే మత్తులోకి జారిపోయారు.

మంచం మీద అస్తవ్యస్తంగా పడి ఉన్నారు.

ఈమధ్య కొన్ని రోజులుగా డాక్టరుగారు మత్తు ఇంజక్షన్ తీసుకోడం లేదు.

ఒక విధంగా ఆయనా అలవాటుకు దూరం అవుతున్నారని సంతోషించాను.

కానీ...మళ్ళీ ఈరోజు ఆయన ఈ స్థితికి నేను కారణమయ్యాననే బాధ నా హృదయాన్ని శూలంతో గుచ్చింది. కానీ నేను చెయ్యగలిగిందేం ఉంది?

ఆయన తలగడ సరిచేసి, దుప్పటికప్పి పక్కనే ఉన్నకుర్చీలో అలాగే కూర్చుండిపోయాను.

ఆలోచిస్తూ, ఆలోచిస్తూ నిద్రలోకి జారిపోయిన నేను తిరిగి కళ్ళు తెరిచేసరికి తూరుపు తెల్లవారింది.





ఉలిక్కిపడి లేచి చూసుకున్నాను.

రాత్రి కుర్చీలో ఎలా కూర్చున్నానో అలాగే నిద్రపోయాను. కానీ రాత్రి నేను డాక్టరుగారికి కప్పిన దుప్పటి నా వంటి మీద ఉంది. డాక్టరుగారు లేచి నాకు దుప్పటి కప్పారన్నమాట. ఆయన గదిలో నిద్రపోయాను అనుకుంటే చాలా సిగ్గు వేసింది... ఆయన ఏమనుకుంటారు?

గబగబా లేచి ఓరగా వేసి ఉన్న తలుపు తెరచుకుని బయటికి వచ్చాను.

గది గుమ్మం ముందే ఎదురైన రమణి నావంక అదోమాదిరిగా చూసింది.

ఇంతకు ముందు అలాంటి రమణిని నేనెప్పుడూ చూసి ఉండలేదు. రమణి చూపులకు తెల్లబోయిన నేను పైనుండి కిందికి నా వంక నేను ఒక్కసారి చూసుకున్నాను.

రాత్రంతా నిద్రపోవడం చేత రేగి ముఖాన పడుతున్న జుట్టూ వాడిపోయి నలిగి వేలాడుతున్న పువ్వులూ ... నిన్నటి సాయంత్రం స్నానం చేసి కట్టిన తెల్లని ఇస్త్రీ చీర నలిగిపోయి ఉంది.

తలఎత్తి రమణి వైపు చూశాను.

రమణి ఇంకా నా వైపు అలాగే చూస్తోంది.

రమణి చూపుల్లో నిరసన భావం... అసహ్యం కొట్టవచ్చినట్లు కనిపిస్తోంది.

నాకు అర్థం అయ్యింది.

కానీ...నేను నోరు విప్పి ఏమని చెప్పను?

'లేదు రమణీ... మీ అమ్మ స్థానంలో నేను మీ నాన్నతో సుఖం పంచుకోలేదు' అని చెప్పాలా?

'నేను కేవలం ఆంటీగానే ఉండిపోతాను. కానీ అమ్మను కాను' అని చెప్పాలా?

అయినా నేనేం నేరం చేశాను?

ఆయన నాకు భర్త. నాభర్తతో నేను సుఖపడకూడదా? ఏం తప్పు చేశానని ఈ పిల్లకు నేను సంజాయిషీ ఇచ్చుకోవాలి?

"రమణీ...అప్పుడే నిద్ర లేచావా...?" అన్నాను ఏదో ఒకటి మాట్లాడాలని.

రమణి నా ప్రశ్నకు సమాధానం చెప్పకుండా విసురుగా వెళ్ళిపోయింది. నా హృదయం చివుక్కుమంది.

చెదిరిన హృదయంతోనే ఆనాటి కార్యక్రమంలో మునిగిపోయాను. ఆయన హాస్పిటల్‌కు వెళ్ళే వేళయింది.

హడావిడిగా కాఫీ టిఫిన్ తీసుకుని ఆయన గదిలోకి వెళ్ళాను – ఆలస్యం అయితే ఏమీ తినకుండా వెళ్ళిపోతారనే భయంతో.

"సౌమ్యా... ఈ రోజు వంట ఏంచేస్తున్నావు?" అన్నారు డాక్టరుగారు టిఫిన్ తింటూ.

నాకు ఆశ్చర్యం వేసింది.

చేసింది ఏదో పెడితే మాట్లాడకుండా తినడం తప్ప ఆయనెప్పుడూ వంటను గురించిన ఆసక్తి కనబరచలేదు.

"ఏం చెయ్యమంటారు?" అన్నాను నవ్వుతూ.

ఇంత కాలానికి డాక్టరుగారు తిండి విషయంలో శ్రద్ధ చూపిస్తున్నారు అన్న సంతోషంతో.

"ఏమేమి చేస్తావో, ఏమేమి చెయ్యాలో నాకైతే తెలీదు కానీ ఈవేళ వంట మాత్రం స్పెషల్‌గా వుండాలి" అన్నారాయన నవ్వుతూ. తండ్రినిఏదోఅడిగేందుకువచ్చిన రమణి మా ఇద్దరినీ చూసి విసురుగా వెళ్ళిపోయింది.

ఆయనా విషయం గమనించలేదు కానీ రమణి ముఖంలోని అసహ్యం, నడకలోని విసురూ నా దృష్టిని దాటిపోలేదు.

"ఇంతకూ ఎందుకూ అని అగడవేం...?" అన్నారాయన అలాగే నవ్వుతూ.

"చెప్పండి" నవ్వడానికి ప్రయత్నించాను.

"ఈ రోజు మనింటికి ఒక గెస్ట్ వస్తున్నాడు. కాస్త నువ్వుకూడా నీట్ గాఉండు. వడ్డించేవాళ్ళు కంటికింపుగా లేకపోతే భోజనం సహించదు" ఆయన ఆ మాటలంటూ నవ్వారు.

ఆయనలా చింతలేకుండా నవ్వుతూ ఉంటే నాకెంతో ఆనందంగా ఉంది. ఆయన్ని ఎప్పుడూ అలా చూడటం ఇష్టం.

పిల్లలంతా స్కూలుకు వెళ్ళిపోయారు.

చిన్ని వెంటపడి తిరుగుతూంటే కబుర్లు చెబుతూ వంట త్వరగా మొదలుపెట్టాను.

బంగాళా దుంపల వేపుడు, సాంబారు, కొబ్బరి పచ్చడి, ఓ కూర, ఓ స్వీట్ తో ఆ రోజు వంట పూర్తిచేసి, శుభ్రంగా స్నానంచేసి చిన్నికి కూడా స్నానం చేయించి ముస్తాబు చేశాను.

ఆయన స్పెషల్ గా తయారవ్వమన్నారు. అంటే... ఎలా ? నవ్వుకున్నాను.

బీరువా తెరచి చీరలన్నీ ముందు పెట్టుకుని కూర్చున్నాను.

ఏ చీర కట్టుకోవాలి?

ఏ చీర కట్టుకుంటే ఆయనలో తృప్తి కనిపిస్తుంది? చీరలన్నీ తీసీ, పెట్టి చివరికి నెమలి కంఠం రంగు జరీచీర, మాచింగ్ బ్లౌజ్ సెలక్టు చేసుకున్నాను.

ఇన్ని కనకాంబరాలు మాలకట్టి తలలో తురుముకుని అద్దం ముందు నిలబడి చూసుకున్నాను.

ఒక పుస్తకం తెరిచి ముందు పెట్టుకుని ఆయన కోసం ఎదురు చూస్తూ కూర్చున్నాను.

ఎక్కువ సేపు ఎదురు చూడకుండానే ఆయన మరో వ్యక్తిని వెంటతీసుకుని వచ్చారు.

"సౌమ్యా!"

వారి పిలుపు విన్న నాకు బయటికి రాక తప్పలేదు.

"సౌమ్య" అంటూ కొత్త వ్యక్తికి నన్ను పరిచయం చేస్తూ చిరునవ్వు నవ్వారు.

నాకు చాలా కష్టం అనిపించింది ఆ పరిచయానికి.

'ఏం...? ఈమె నా మిసెస్ సౌమ్య' అని చెప్పకూడదూ? లేకపోతే ఈమె మిసెస్ కృష్ణమోహన్ అని చెప్పవచ్చునే? తాడూ బొంగరం లేనిదానిలా సౌమ్య అట సౌమ్య...కసిగా పెదవి కొరుక్కుంటూ తలెత్తి చూశానా వ్యక్తి వంక. అంతే... చిరునవ్వుతో నాకు నమస్కరిస్తున్న అతని వంక అలా గుర్తుపట్టి చూస్తూండిపోయాను ప్రతి నమస్కారం కూడా చేయకుండా.

"సౌమ్యా! ఇతడు మనకు బాగా కావలసినవాడు. మిస్టర్..." మాటా పలుకూ లేకుండా అలా గుర్తుపట్టి చూస్తూండిపోయిన నా వంక చూస్తూ "సౌమ్యా! ఇతను నీకు తెలుసా....?" అన్నారు.

నేను అయోమయంగా తల ఊపుతూ "మీరు...మీరు మౌళికదూ" అన్నాను సంతోషంతో తడబడుతూ.

అతను ఆశ్చర్యంగా నావంక చూశారు.

"అవును. ఇతను నీకు పరిచయమేనా...?"

"నాకు పరిచయం లేదు. కానీ...





తెలుసు"

ఈసారి మౌళి ఏదో అర్థం అయినట్లుగా చిరునవ్వు నవ్వారు.

ఆయన మా ఇద్దరి వంకా మార్చి మార్చి చూస్తున్నారు.

మౌళి నవ్వుతూ వంగి సోఫాలో ఉన్న పుస్తకం తీసి వెనక్కు తిప్పి ఆ వెనక ఉన్న తన ఫొటో చూపించి మళ్ళీ నవ్వాడు.

'అదా సంగతి' అన్నట్లుగా డాక్టరుగారు ఫక్కున నవ్వారు.

అలా నవ్వుతూనే, "ఇదేనయ్యా మీ రచయితలతో వచ్చిన చిక్కు. ఏ విషయాన్నీ సూటిగా మాబోటివాళ్ళకు అర్థం అయ్యేలా చెప్పరు కదా...? 'వెన్నెల్లో వేడి' అంటారు. చలిగాలి సతాయిస్తుందంటారు. మాబోటి డాక్టర్లు మిమ్మల్ని అర్థం చేసుకోడం కష్టమేనయ్యా" అన్నారు.

మౌళి నవ్వారు.

నా ముఖం వెలిగిపోతోంది. మౌళి నా అభిమాన రచయిత. అతన్ని చూడాలని ఎన్నాళ్లుగానో కలలు గంటున్నాను.

అనుకోకుండా లభించిన ఈ ఆనందంతో నా ముఖం వెలిగిపోతోంది. ఆ వెలుగు నా ముఖంలో, కళ్ళల్లో, పెదవుల మీదా చిరునవ్వుగా ప్రతిఫలిస్తోంది.

నా సంతోషాన్ని గమనించిన డాక్టరుగారు చిరునవ్వు నవ్వారు.

"అమ్మయ్య...ఇక నా బాధ్యత తీరిందయ్యా. మీకు స్నేహం కలిపే శ్రమ నాకు తప్పింది" అన్నారు నవ్వుతూ.

మౌళి ఎప్పటిలాగే చిరునవ్వునవ్వారు.

బక్కగా, పొడవుగా, చామన ఛాయగా అనిపించే మౌళి ముఖానికి అతని చిరునవ్వే వింత ఆకర్షణ.

ఆ చిరునవ్వులో స్నేహం వెల్లి విరుస్తున్నట్లుగా ఉంటుంది.

అతను మాట్లాడని ఎన్నో విషయాలు మాట్లాడినట్లుగా అనిపిస్తుంది ఆ ఒక్క నవ్వుతో.

ఎప్పుడూ నవ్వుతున్నట్లుగా కనిపించే పెదాలు, నవ్వినప్పుడు మెరిసే కళ్ళు - ఇవితప్ప అతనిలో ప్రత్యేకంగా చెప్పుకోదగ్గ అందాలు లేవనే చెప్పాలి.

కానీ, ఆవే ఎన్నో అందాలకు దీటుగా ఉండి అతని వ్యక్తిత్వాన్ని చాటుతున్నాయి.

భోజనం చేస్తూకూడా మౌళి ఏమీ మాట్లాడలేదు. డాక్టరుగారే అవీ ఇవీ మాట్లాడుతున్నారు.

"సౌమ్యా! ఆ హల్వా రచయితగారికి మరికాస్త వడ్డించు. తీపితింటే తియ్య తియ్యని రచనలు చేస్తారు" అన్నారు నవ్వుతూ.

మౌళి వద్దన్నట్లుగా ప్లేటుకు చేతులు అడ్డం పెట్టడంతో వడ్డించబోయిన నేను చేతులు వెనక్కు తీసుకున్నాను.

"అరే...సౌమ్యా! అతనికంటే నువ్వే ఎక్కువ మొహమాట పడుతున్నావు. ఇటివ్వు నేను వడ్డిస్తాను" అన్నారు చనువుగా. నేను హల్వా డిష్ అందించాను.

మౌళి ప్లేటుకు రెండు చేతులూ అడ్డం పెట్టుకుంటూ, "డాక్టరుగారూ! తీపి ఎక్కువగా తింటే తీపి తీపి రచనల మాట ఏమోకానీ షుగర్ కంప్లెయింట్ మాత్రం తప్పనిసరిగా పట్టుకుంటుంది" అన్నారు నవ్వుతూ.

"ఆ మాట అనాల్సింది మేము. నీకేమయ్యా బాబూ యువకుడివి.



అమృతం తినకపోతే ఎలా...? తిండి కలిగితె కంచకలదోయ్" అంటూ బలవంతంగా మౌళి ప్లేట్లో స్వీట్ వడ్డించారు డాక్టరుగారు. ఆయనలా చిన్న పిల్లాడిలా చలోక్తులాడుతూ భోంచేస్తుంటే నాకెంతో ముచ్చటగా ఉంది. డాక్టరుగారు ఎప్పుడూ ఇలా ఉంటే...?

నవ్వు ముఖంతో వాళ్ళిద్దరి సంభాషణా వింటూ కూర్చున్నాను.

"అబ్బ డాక్టరుగారూ .... చాలా ఎక్కువ తినిపించేశారు. వంటకాలు రుచిగా ఉండటంతో ఎక్కువ తినేశాను"

"మరేమనుకున్నారు? మా సౌమ్య వంట అంటే అమృతం అనుకోండి. తనలా కబుర్లు చెబుతూ వడ్డిస్తుంటే ఎంత తింటానో నాకే తెలీదు" మెచ్చికోలుగా నావంక చూశారు నవ్వుతూ.

అతిథితో పాటుగా డాక్టరుగారు కూడా నా వంటానూ, వడ్డననూ పొగుడుతుంటే సిగ్గుగా తల వంచుకున్నాను. గృహస్థ జీవితంలో గృహిణి పొందే ఆనందం మొదటిసారిగా నేను రుచి చూశాను.

ఆ తరువాత డాక్టరుగారూ, మౌళీ కూర్చుని మాట్లాడుతూంటే నేను గదిలోకి వెళ్ళి కూర్చున్నాను.

"సౌమ్యా ... ఏమిటి మీ రచయిత గారితో మాట్లాడకుండా వెళ్ళి గదిలో కూర్చున్నావు...?"

డాక్టరుగారి పిలుపుతో ఇక మర్యాదగా ఉండదని వెళ్ళి వాళ్ళదగ్గర కూర్చున్నాను.

ఆకాస్త పరిచయంలోనే మౌళిని మిత భాషిగా అర్థం చేసుకున్నాను. మామూలుగా మనం నాలుగైదు వాక్యాలలో చెప్పే విషయాన్ని మౌళి ఒక్క చిరు





నవ్వుతోనో, ఓ కంటిచూపుతోనో, లేక "ఔను" "కాదు," "ఆహఁ"లతోనో చెప్పగలడు. అతని రచనా విధానం కూడా చాలావరకు అలాగే ఉంటుంది.

విషయాన్ని సూటిగా, క్లుప్తంగా చెప్పి మెప్పించగల చాతుర్యం మౌళి కలానికి ఉంది.

కాసేపు కూర్చుని మౌళి వెళ్ళిపోయారు.

చాలాకాలం తరువాత ఆరోజు చాలా హాయిగా ఆనందంగా గడిచిపోయినట్లనిపించింది.

నా వైవాహిక జీవితంలో మొదటి సారిగా మంచి గృహిణిగా గుర్తింపు, ప్రశంస లభించినరోజు అది.

ఒక ప్రఖ్యాత రచయిత మా కుటుంబ స్నేహితుడు అనుకుంటే నాకు కొంచెం గర్వంలాంటి భావం కూడా కలిగింది.

* * *

మౌళీ, నేనూ డ్రాయింగ్ రూంలో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నాము.

ఈమధ్య మౌళి డాక్టరుగారితో ఒకటి రెండుసార్లు రావడంతో మామధ్య కాస్త బెరుకు తగ్గిన మాట నిజమే కానీ అయినా ఫ్రీగా మాట్లాడుకోలేకపోతున్నాము.

డాక్టరుగారు మౌళితో ఓ పది నిమిషాలు గడిపి "సౌమ్యా..మీ రచయిత గారిని ఎంగేజ్ చెయ్యి. నాకవతల ఓ అర్జంటుపని ఉంది. చూసుకుని వస్తాను" అంటూ వెళ్ళిపోయేవారు.

ఇక నాకు మౌళి ఎదురుగా కూర్చుని మాట్లాడక తప్పేదికాదు.

"నేనూ వచ్చేస్తున్నానండీ" అంటూ లేచే మౌళి భుజాలమీద చేతులువేసూ "ఫరవాలేదు...కూర్చో. ఓ పదినిమిషాల్లో వచ్చేస్తాను" అంటూ బలవంతంగా కూర్చోపెట్టేవారు.

ఈయనగారు లేకుండా ఆయన్ను కూర్చోబెట్టడం ఎందుకూ పనిలేక ? ఈయనతో ఏం మాట్లాడుతూ కూర్చోనూ? మనసులోనే విసుక్కునేదాన్ని.

పరాయి మగాళ్ళతో మాట్లాడే అల వాటు ఉన్నప్పటికీ అప్పుడు డ్యూటీ, హాస్పిటల్ వగైరా విషయాలను గురించి అవసరంగా కానీ, అనవసరంగాకానీ పిచ్చాపాటి మాట్లాడుకునేవాళ్ళం.

మరి మౌళితో మాట్లాడేందుకేము న్నాయి?

మా మధ్య అంత చనువు కూడా లేదు.

ఏదో కొంత సాహిత్యం చదివినప్ప టికీ వాటిని గురించి విమర్శించేంతగానీ, చర్చించేంతగానీ సామర్థ్యం నాకు లేదు.

ఏవో పొడిమాటలు తప్ప మా మధ్య మాటలు జరగడంలేదు. ఇంతలో రమణి పుస్తకాలు పట్టుకుని లోపలికి వచ్చింది.

రమణి మౌళివంక ఆసక్తిగా చూడటం గమనించాను.

'ఇతనేనా ప్రఖ్యాత రచయిత మౌళి అంటే?' అన్న భావం ఉంది ఆ చూపులో.

"ఈమె మా పెద్దమ్మాయి రమణి" అంటూ రమణిని మౌళికి పరిచయం చేశాను.

మౌళిని పరిశీలించడంలో మునిగి పోయిన రమణి నా పరిచయ వాక్యాలు పట్టించుకోలేదు.

పట్టించుకునేఉంటే "మా పెద్దమ్మాయి" అంటూ పరిచయం చేసినందుకు చిటచిట లాడేదే.

నా అదృష్టం బాగుండి మౌళి ముందు నాకు అవమానం జరగలేదు.

మౌళి చిరునవ్వుతో నమస్కరించారు. రమణి అతని చిరునవ్వుకు ముగ్ధురాలై నట్లుగా అతని వంక చూస్తూ ప్రతి నమస్కారం చేసింది.

"రమణీ....మౌళిగారితో మాట్లాడుతూ ఉండు. నేను వెళ్ళి కాఫీ తెస్తాను"

లేచి వంటగదిలోకి వెళ్లాను.

"మీరు చాలా పుస్తకాలు రాశా రటగా?"

"ఎవరు చెప్పారు?" నవ్వుతూ అడి గారు మౌళి.

"ఆంటీ చెప్పింది"

'ఆఁ...ఏవో కొన్ని' అన్నట్లుగా చిరు నవ్వు నవ్వి ఉంటారు మౌళి.

"మీ పుస్తకాలు ఏమీ చదవలేదు. అయినా మీతో స్నేహం చేసుకోవాలని ఉంది"

"ఎందుకూ?" నవ్వుతూ అన్నారు మౌళి.

"మీ అంత గొప్ప రచయిత నా ఫ్రెండు అని చెబితే ఫ్రెండ్సులో నాకు చాలా గొప్పగా ఉంటుంది"

వంటగదిలో ఉన్న నాకు రమణి మాటల తీరు నవ్వు తెప్పించింది.

ఇప్పుడు మౌళి ముఖం ఎలా ఉంటుందో?

నవ్వుతూ కాఫీ కప్పుతో బయటికి వచ్చాను.

మరికాస్త ఆలస్యం అయితే ఈ పిచ్చిమొద్దు ఇంకా ఏం మాట్లాడుతుందో?

మౌళి కాఫీ తాగి – "మరి వస్తానండీ.. డాక్టరుగారు వచ్చేసరికి ఎంత ఆలస్యం అవుతుందో?" అంటూ లేచారు.

*　　*　　*

"అమ్మా ! నాకు జడవెయ్యవూ?" చిట్టి జడ విప్పుకుని దువ్వెన పట్టుకుని నా వెంట వెంట తిరుగుతోంది.

"ఒక్క నిముషం ఆగమ్మా...కాఫీ

వడపోసి నీకు జడవేస్తాను. నాన్నగారికి హాస్పిటల్‌కు టైం అవుతోంది"

"చిట్టీ...ఇలారా" రమణి కసురుతూ పిలిచింది. "అమ్మా బొమ్మా అంటూ ఆవిడగారి చుట్టూ తిరగకపోతే జడ వెయ్యమని నన్ను అడగకూడదూ?"

రమణి కసురుతూ చిట్టికి జడ వేస్తోంది.

కాఫీ కలుపుతున్న నా చేతులు ఆగి పొయ్యాయి.

ఈ పిల్ల ఈ విషాన్ని మిగతా పిల్లలకూ కొంతకొంతగా ఇంజక్టు చేస్తుందా? ఇది ఇలాగే కొనసాగితే నాపట్ల పిల్లల వైఖరి ఎలా మారుతుంది!?

రమణి ప్రవర్తన నా పట్ల రోజు రోజుకూ విపరీతంగా మారుతోంది.

పెద్ద పిల్ల. ఏమీ అనడానికీ లేదు. అనకుండా ఉండేందుకూ లేదు. డాక్టరు గారికి ఈ విషయాలు తెలీవు.

ఆయన ఇప్పుడిప్పుడే విశాల మరణం కలిగించిన దుఃఖంనుండి కోలుకుంటు న్నారు. ఈ విషయాలు తెలిస్తే పరిస్థితి మళ్ళా మొదటికి వస్తుంది.

ఏమిటో మనస్సంతా చేదు తిన్నట్లుగా ఉంది.

కేవలం ఈ పిల్లల కోసమే నేనీ తాళి కట్టించుకున్నది. చివరికి ఈ పిల్లలే మానసికంగా నాకు దూరం అయితే ఇక నాకు మిగిలేదేముంది...?

చెప్పుకుని మనస్సు తేలిక చేసుకునేం దుకు గానీ, సలహా తీసుకునేందుకు గానీ నాకు ఎవరూ లేరు.

* * *

"సౌమ్యా ..... దీపావళి ఇంకెన్నా ళ్ళుంది?"

"ఇంకెన్నాళ్ళేనా..ఎల్లుండేపండుగ" పనిమనిషితో బూజులు దులిపిస్తూ ఇల్లు సర్దిపెడుతూ చెప్పాను.

"సాయంత్రం వెళ్ళి పిల్లలకూ, నీకూ బట్టలు తెచ్చుకో"

"మీరూ రండి. నా ఒక్కదానికి ఏం తెలుస్తాయి..?" అన్నాను ఎప్పటిలాగే. కానీ ఆయన రారు. ఎప్పుడూ అందరికీ కావలసిన బట్టలు నేనే తీస్తుంటాను.

నా అంచనాలు తారుమారు చేస్తూ, "అయితే సరే ... సాయంత్రం రెడీగా ఉండు. నేను వచ్చి తీసుకెడతాను" అన్నారు.

ఈసారి నాకు చాలా ఆశ్చర్యం వేసింది.

ఆయన వచ్చేవేళకు చిన్నీ, నేనూ నీట్‌గా తయారయి ఎదురుస్తూ కూర్చున్నాము.

"సౌమ్యా!రెడీ అయ్యావా!?" అంటూ ఆయన వచ్చారు. నా ఒళ్ళోనే కూర్చున్న చిన్నిని చూస్తూ-"చిన్నీ! అమ్మా, నేనూ బజారుకు వెళ్ళి నీకు కొత్త గౌను,బొమ్మలు తెస్తాము. ఇంట్లోనే ఆడుకోమ్మా" అన్నారు చిన్నిని ఎత్తుకుని ముద్దు పెట్టుకుంటూ.

చిన్ని బుద్ధిగా తల ఊపుతూ తండ్రి బుగ్గమీద తిరిగి ముద్దుపెట్టుకుంది.

"రమణీ... చెల్లెలిని తీసుకో, మేం బజారు వెడుతున్నాం"

నేను చూస్తూ నించున్నాను.

నాకు చిన్నిని తీసుకుని వెళ్ళాలనే ఉంది. అయినా ఏమీ మాట్లాడకుండా ఉండిపోయాను.

చిన్ని టాటా చెబుతుండగా ఆయనతో పాటుగా కారెక్కాను. రమణి చూపులు ఈర్ష్యగా నా వెన్నును గుచ్చు తూనే ఉన్నాయి. ఇది నాకు సరికొత్త

అనుభవం. పెళ్ళయి ఇంతకాలమైనా ఆయనతోపాటుగా నేనెప్పుడూ బైటికి వెళ్ళలేదు.

జీవితంలో గృహిణిగా మారగలననే ఆశ నాకెప్పుడూ లేదు.

ఇది అనుకోని వరం.

ఆయనకూ, నాకూ ఈడూ జోడూ లేకపోవచ్చు. కానీ ఆయన నా భర్త. ఆయన వెంట గృహిణి హోదాలో నేను బయటికి వెడుతున్నాను

...ఈ ఊహ నాకెంతో ఆనందాన్ని ఇచ్చింది.

కారు స్వయంగా ఆయనే డ్రైవ్ చేస్తున్నారు. ఆయన పక్కన నేను. కారు కొన్ని మలుపులు తిరుగుతూ వెళ్ళి బజారులో ఆగింది.

డ్రైవ్ చేస్తున్న ఆయనను చూస్తుంటే ఈయనకు డ్రైవింగ్‌లో చాలా నేర్పుంది అనిపించింది.

నాలుగయిదు షాపులు తిరిగి రమణికి, నాకు కావలసిన చీరలు, మిగతాపిల్లలకు కావలసిన బట్టలూ తీశాను.

"హలో డాక్టర్. హౌ ఆర్ యూ" చిరునవ్వుతో ఓ వ్యక్తి డాక్టరుగారిని సమీపించారు.

"క్వయిట్ ఓకే" డాక్టరుగారు నవ్వుతూ కరచాలనం చేశారు.

"ఏమిటీ....బట్టలు తీస్తున్నారా?"

"ఆఁ.... పండుగ కదూ"

"ఈమె ఎవరూ? మీ పెద్దమ్మాయా?"

నా ముఖం పాలిపోయింది. చేతిలో ఉన్న షర్టుపీస్ జారిపోయింది. బట్టలు చూసే మిషతో అటుతిరిగి నించున్నాను.

కొంతమందికి ఏదో ఒకటి మాట్లాడాలీ అన్న యావతప్ప ఏం మాట్లాడుతున్నామనే స్పృహ ఉండదు.

ఆయన ఏదో చెప్పారు. అదేమిటో నాకు సరిగా వినిపించలేదు. కానీ అవతలి వ్యక్తి ఆశ్చర్యంగా, ఆసక్తిగా నావంక చూడటం మాత్రం నేను గమనించాను.

నాకు చాలా ఇబ్బందిగా అనిపించి ముఖం చాటుచేసుకుని కూర్చున్నాను. ఆ తరువాత బట్టల ఎంపిక త్వరగానే జరిగి పోయింది.

నాకు నచ్చినవేవో పాక్ చేయించాను.

'ఈ బట్టలు తీయనా?' అని అడిగేందుకు కానీ, కనీసం 'ఇవి బాగున్నాయా?' అనేందుకు కానీ, చివరకు ఆయన ముఖం చూసేందుకు కానీ ధైర్యం చాలడంలేదు.

గబగబా వెళ్ళి కారులో కూర్చున్నాను.

ఇంతక్రితం బయలుదేరినప్పుడు కలిగిన గర్వం, ఉత్సాహం, ఆనందం నాలో ఇప్పుడు మచ్చుకు కూడా లేవు.

ఒకరకమయిన పిరికితనం ఆవహించింది.

"సౌమ్యా ... చిన్నికి ఏం తీసుకున్నావూ?"

చెప్పాను.

ఇది మామూలుగా ఆయన పట్టించుకోని విషయం.

కానీ ఒకరకమైన ఆత్మగ్లానితో నేను ముడుచుకుపోయి ఉండటం ఆయన గమనించారు.

నన్ను ఏదో ఒక మాటల్లోపెట్టి ఆ విషయాన్ని మరిపించాలని ఆయన ప్రయత్నం. నేను కొంచెం కూడా బాధ పడటం ఆయన సహించలేరు.

ఆయన తన భార్యగా తను ఇవ్వవలసినవాటినన్నింటినీ నాకు ఇస్తారు... ఇచ్చారు. స్నేహం,ఆప్యాయతఅందిస్తారు.

సాధ్యమయినంత వరకూ నన్ను సంతోషంగా ఉంచేందుకు ప్రయత్నిస్తూ

వుంటారు. ఈ వయస్సులో నేను ఆయనకు అదనపు బాధ్యతగా మారాను.

భార్యగా నాకు ఇంతకంటే ఏం కావాలి?

ఆయన ఇవ్వలేని వాటిని కోరను. ఆయన ఇచ్చేవాటిని తృప్తిగా, ఆప్యాయంగా అందుకుంటాను.

ఈ వరం చాలు నాకు.

ఇంతకంటే ఒకప్పుడు నేను ఎక్కువగా కోరుకున్నదీ లేదు; ఇప్పుడు కోరుకుంటున్నదీ లేదు.

"సౌమ్యా! కాఫీ తాగుదామా?"

"వద్దు... వద్దు..." అన్నాను కంగారుగా.

ఆతర్వాత కారు వెళ్ళి ఓ సినిమా హాలు ముందు ఆగింది. నాకు ఆ సమయంలో సినిమా చూసే మూడ్ బొత్తిగా లేదు. అందుకే కారు దిగకుండా మొండిగా అందులోనే కూర్చున్నాను.

"దిగు సౌమ్యా" డాక్టరుగారు నవ్వుతూ అన్నారు.

"ఊహుఁ...సినిమా వద్దు. ఇంటికి వెళ్ళిపోదాం"

"ఏమిటి డాక్టర్.. కారుకు అతుక్కుపోయారు?"

ఆ సమయంలో మౌళిని అక్కడ చూసి ఆశ్చర్యపోయాను.

"చూడు మౌళీ!సౌమ్య కారు దిగదట" నవ్వుతూ రిపోర్ట్ చేశారు డాక్టరుగారు. మౌళి కారులోకి తొంగిచూశారు.

ఒక్క క్షణం మౌళి కళ్ళు తళుక్కున మెరవడం నా దృష్టిని దాటిపోలేదు. చిరునవ్వుతో అతని ముఖం కాంతివంతమయ్యింది.

"అరే. సౌమ్యగారిని కూడా తీసుకొచ్చారే..." అన్నాడు ఆశ్చర్యం, ఆనందం నిండిన స్వరంతో.

అంటే మౌళిని డాక్టరుగారు ముందే ఆహ్వానించారన్న మాట.

"తీసుకొచ్చాను. అయితే ఏం లాభం? ఆవిడగారు కారు దిగనంటుందే" డాక్టరుగారు నవ్వుతూ అన్నారు.

మౌళి చిరునవ్వుతో 'ఔనా?' అన్నట్లు నావంక చూశారు.

ఇక ఏం మాట్లాడినా బావుండదు పరాయి వ్యక్తి ముందు. మౌనంగా డోర్ తెరుచుకుని కారు దిగాను.

"అమ్మయ్య.దేవి కరుణించిందయ్యా. ఇక వెళ్ళి టికెట్సు తెస్తాను" నవ్వుతూ వెళ్ళిపోయారు డాక్టరుగారు.

ఎప్పటిలాగే మౌళి పెదవులు చిరునవ్వుతో విచ్చుకున్నాయి. నా కళ్ళు మాత్రం సిగ్గుతో వాలిపోయాయి.

అక్కడ మౌళి, నేను మిగిలిపోయాము.

నాకు చాలా బెరుగ్గా ఉంది. బిడియంగా ఉంది. తెలిసినవాళ్ళెవరయినా ఇతనితో నన్ను చూస్తే...? మంచో చెడో ఆయన్నూ, నన్నూ కలిపి అనుకుంటే అది వేరే విషయం. కానీ మౌళినీ, నన్నూ కలిపి అనుకుంటే మాత్రం అది భరించలేని విషయమే అవుతుంది.

మమ్మల్ని అలా వదిలి వెళ్ళినందుకు ఆయన మీద నాకు చాలా కోపమే వచ్చింది. టికెట్స్ కొరకు మౌళిని పంపి తానుండకూడదూ? నా మొర ఆలకించినట్లుగా డాక్టరుగారు టికెట్స్‌తో తిరిగి వచ్చారు.

ముగ్గురం హాల్లో కూర్చున్నాము.

మౌళి పక్కనే కూర్చునేందుకు ఏదోలా అనిపించింది. స్వేచ్ఛ.. సమానత్వం.. అంటూ ఎన్నెన్ని ఉద్యమాలు

లేవదీసినా స్త్రీ అంత స్వేచ్ఛనూ అనుభ వించలేదు.

ఆయన పక్కనే ఉన్నా నా భయం నాది.

నలుగురూ మమ్మల్నిద్దరినీ పక్క పక్కన చూసి ఏమనుకుంటారో? తెలిసిన వాళ్ళు చూస్తే ఎన్నికథలు అల్లి ప్రచారం చేస్తారో....

"మీరు ఇటు వచ్చి కూర్చోండి" అన్నాను నెమ్మదిగా ఆయనతో.

"ఫరవాలేదు. కూర్చో" అంటూ డాక్టరుగారు సినిమా చూడటంలో లీనమై పోయారు.

నేనూ మనస్సు సినిమావైపు లగ్నం చేయడానికి ప్రయత్నించాను.

అసహ్యంలో కూడా ఆనందం కోసం వెదుకులాట అంటారు ఇదేనేమో....

ఇంటర్వెల్ అయింది. లైట్స్ వేయడం తోనే మళ్ళీ నాలోని భయం నేనూ నీతో పాటే సుమా అన్నట్లుగా తల ఎత్తింది.

దానికి తోడుగా డాక్టరుగారు లేచి బయటికి వెళ్ళారు.

మళ్ళా మౌళీ, నేనూ మిగిలిపోయాం. తప్పు చేసినట్లు భయంతో తల ఎత్తలేక పోతున్నాను.

లేచి డాక్టరుగారు ఖాళీ చేసిన కుర్చీలో కూర్చుందామంటే సభ్యత అడ్డువస్తూంది.

అలా కూర్చుంటే మౌళి ఏమను కుంటారు...?

వట్టి 'అడవి మనిషి' అనుకోరూ?

ఇంత అనాగరికంగా ప్రవర్తించి నందుకు ఆయనకూ కోపం వస్తుంది.



"సౌమ్యా... మీకు ఆరోగ్యం సరిగా లేదా?"

"అబ్బే...బ్బే.... బాగానే ఉన్నానే"

"మరి ఇంతలా చెమటలు పడుతున్నా

యేం....?"

మౌళి సన్నింత పరిశీలనగాచూశారన్న మాట. అయితే నాలో భయాన్ని కూడా గమనించి ఉంటారా....?

కర్చీఫ్‌తో గట్టిగా ముఖం తుడుచుకుని, నాలోని ఆందోళనను జయించి స్థిరంగా, స్థిమితంగా ఉండేందుకు మనస్సును కూడతీసుకుంటున్నాను.

"సౌమ్యా! ఓ మాట అడుగుతాను చెబుతారా?"

నా గుండె గుబగుబలాడింది. ఏం అడుగుతారో....

"అడగండి..."అన్నాను బింకంగా.

"నాపట్ల మీఅభిప్రాయమేమిటి....?"

నేను తెల్లబోయాను.

ఇదెక్కడిప్రశ్న. అతను నా అభిమాన రచయిత.

అంతకుమించి అతని పట్ల తాను ఏ విధమైన అభిప్రాయమూ ఏర్పరచుకో లేదు.

నేను మాట్లాడకపోవటం చూసి "పోనీ మీరు ఏమీ అనుకోనంటే ఓ మాట చెబుతాను."

"ఫరవాలేదు. చెప్పండి" కానీ అప్పటికే నా గొంతు పొడారిపోయింది.

ఏం చెబుతారో....?

"అందం, అణకువ, సహృదయత వున్న మీతో స్నేహం అపురూపమైన వరంగా భావిస్తున్నాను. మీతో స్నేహం పెంచుకోవాలనుకుంటున్నాను. మీకు అభ్యంతరం లేదుగా?"

మామూలుగా ఒకప్పుడైతే ఆ ప్రశంసా వాక్యాలకు పొంగిపోయి ఉండేదాన్ని. కానీ ఇప్పుడు పరిస్థితి వేరు.

అసలే వణికిభస్తుంటే ఇక స్నేహం ఎక్కడి స్నేహం.

ఖర్మకాకపోతే ఈయన ఇంకా రాలేదేమిటి?

మౌళికి ఏం జవాబు చెప్పాలి...?

అమ్మయ్య... ఆయన వచ్చేస్తున్నారు. ఒక్కసారిగా గుండెల నిండుగా గాలి పీల్చుకున్నాను.

సినిమా పూర్తయింది.

డాక్టరుగారు మౌళిని అతని రూమ్ వద్ద డ్రాప్ చేశారు.

"సౌమ్యా! ఇలా ముందు సీట్లోకి వచ్చి కూర్చో"

మౌనంగా వచ్చి ముందు సీట్లో కూర్చున్నాను.

డాక్టరుగారు కారు నెమ్మదిగా నడుపుతున్నారు. ఆయన ఏదో దీర్ఘాలోచనలో వున్నట్లు కనిపించారు.

క్షణాలు నిశ్శబ్దంగా దొర్లిపోతున్నాయి.

"సౌమ్యా! నేనోమాట చెబుతాను. నన్ను అర్థం చేసుకోడానికి ప్రయత్నించు"

గంభీరంగా వుంది ఆయన స్వరం.

"సౌమ్యా! మౌళితో నువ్వెందుకు స్నేహం పెంచుకోకూడదూ...?"

నాకు అయోమయంగా వుంది.

"అంటే...?" అర్థంకాక తెల్లబోతూ అడిగాను.

"అంటే...భర్తగా నేనివ్వలేనిది మౌళి దగ్గరి నుండి నువ్వెందుకు పొందకూడదూ?"

నా తల మీద పిడుగు పడినట్లయింది.

నేనేం వింటున్నానో నాకు అర్థం కావడం లేదు.

ఆయనేం అన్నారూ... ? నేనేం విన్నానూ...?

అసలు...అసలు...ఆయన అనేదేమిటి?

"మీరు... మీరు... ఏమిటి అంటు





న్నారూ ?" హీన స్వరంతో అడిగాను.

ఆయన చెప్పిందేమిటో నాకు అర్థం కాకుండా వుంది.

"సౌమ్యా ! బాగా ఆలోచించు. ఇందులో తప్పేమీలేదు. ప్రతి మనిషికీ ఆహారమూ, నిద్రా ఎలా అత్యవసరమైన విషయాలో 'సెక్స్' కూడా అంతే! నేను అన్నీ అనుభవించి రాలిపోయేందుకు సిద్ధంగా వున్న పండుటాకును. నువ్వా.... ఇంకా విచ్చీవిచ్చని మొగ్గవు. తాళికట్టించుకున్న నేరానికిగాను ఏ అనుభవమూ లేకుండా నిన్ను మోడుచేయడం అన్యాయమే అవుతుంది. మౌళి సహృదయుడు. నిన్ను ప్రేమించగలడు. మౌళికి నేను అన్ని విషయాలూ చెప్పాను. అతను నిన్ను వివాహం చేసుకునేందుకు ఒప్పుకున్నాడు. ఇందులో ఎవరూ ఎవరినీ మోసం చెయ్యటంలేదని గుర్తుంచుకో...." ఆయన ఇంకా ఇంకా ఏదో చెబుతూనే ఉన్నారు. నేను వింటున్నాను. వింటున్నాను కానీ వింటున్నదేమిటో అర్థం కావడంలేదు. ప్రతిమలా గుడ్లప్పగించి చూస్తూ కూర్చున్నాను. ఆయన ఇంకా ఏదో చెబుతూండగానే ఇల్లు వచ్చేసింది.

"సౌమ్యా..బాగా ఆలోచించుకో..." అన్న ఆఖరి మాటలతో ఇంటి ముందు కారు ఆపారు.

పిల్లలందరూ భోజనాలు చేసి ఎక్కడి వాళ్ళక్కడ నిద్రకు ఒరిగారు. ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది.

ఇంట్లోకి తెచ్చిన పాకెట్స్ డ్రాయరు మీదికి విసిరి గదిలోకి వెళ్ళి గడియవేసుకుని మంచం మీద వాలిపోయాను.

నా మెదడు నెమ్మది నెమ్మదిగా పని చేయడం ప్రారంభించింది.

ఏమిటి... నేను విన్నది నిజమేనా? ఈ దేశంలో ఒక భర్త తన భార్యకు తనివ్వలేని సుఖాన్ని మరొకరి ద్వారా పొందమని చెబుతాడా? ఇది సంభవమేనా?

మనస్సున్న మనిషిగా ఆయనలా చెప్పినా, ఆయన చేత అలా చెప్పించుకోడం తనకెంత అవమానం...?

బతుకంతా ఇలాంటి అవమానాలు భరిస్తూ బతకమని నన్నిలా ఒంటరిగా వదిలి వెళ్ళిన అమ్మా-నాన్నా జ్ఞాపకం వచ్చారు.

ఆలోచించుకుంటున్న కొద్దీ దుఃఖం పొంగివస్తోంది.

మౌళితో కూడా చెప్పారట. ఏమని చెప్పారు...?

సౌమ్య కోరికలు తీరిక అల్లాడిపోతోందని చెప్పారా...? లేక గోడలు దూకుతోందని చెప్పారా...నన్ను ఇంతగా అవమానించే ధైర్యం ఈయనకెక్కడిది? అందుకేనా ఆ పెద్దమనిషి నాతో స్నేహం పెంచుకోవాలని ఉందని చెప్పాడు...?

స్నేహం అంటే ఇదేనా...?

ఆలోచిస్తున్నకొద్దీ నా మీద నాకే జాలి వేసింది. ఆపుకుందామనుకున్నా ఆగకుండా దుఃఖం వస్తోంది.

దిండులో తల దూర్చి వెక్కి వెక్కి ఏడ్చాను.

శారీరక సంబంధం లేకుండా భార్యాభర్తలు స్నేహంగా మసలుకునే అవకాశం లేనేలేదా...?

సంపర్కం లేకపోతే భార్యాభర్తల అనుబంధం విచ్ఛిన్నం కావలసిందేనా..? అయినా డాక్టరుగారు నన్ను గురించి ఇంత తక్కువగా ఎలా ఆలోచిస్తున్నారు ?

నా ప్రవర్తనలో లోపం ఏమైనా ఉందా....?

అన్నీ ప్రశ్నలే....జవాబు దొరకని ప్రశ్నలు.

సమాజంలో డాక్టరుగారి భార్యగా బతుకుతూ పరాక వ్యక్తితో శారీరక సంపర్కం కలిగిఉండేంత నీచమైన విషయానికి నేనెలా అంగీకరిస్తానను కున్నారు?

మళ్ళీ పెళ్ళట ... ఛీ...ఛీ...! తన మనస్సెంత చంచలమైనదా? తాను అన్నీ ఆలోచించుకునే ఈ నిర్ణయం తీసుకుంది. తిరిగి ఆలోచించే అవసరమే లేదే!

దొరికిన ఈ ఆలంబనతో జీవితం గౌరవప్రదంగా గడిపివేయాలనుకుంటే అడుగడుక్కి ఈ అవమానాలేమిటి?

నా ఆలోచనలన్నీ కన్నీళ్ళలో కరిగి పోతున్నాయి.

"సౌమ్యా ...సౌమ్యా..."డాక్టరుగారు బయటి నుండి తలుపు కొడుతూ పిలుస్తునారు.

నాకు లేచి తలుపు తీయాలనిపించలేదు. నన్నింతగా అవమానించిన ఆయన ముఖం లా చూడను...?

"సౌమ్యా.... ప్లీజ్ తలుపు తియ్యి"

"ఊహు ... తియ్యను" లోపలి నుండి వెక్కుతూనే మొండిగా సమాధానం చెప్పాను.

డాక్టరుగారు చిన్నగా నవ్విన శబ్దం వినిపించింది.

"సౌమ్యా!నాకు భోజనం పెట్టకుండానే వెళ్ళి పడుకున్నావు. నాకు ఆకలి వేస్తోంది. ప్లీజ్...అన్నం పెట్టవూ"

ఆయనలా చిన్నపిల్లవాడిలా 'ఆకలి వేస్తోంది' అని అడుగుతుంటే, చిన్ని 'అమ్మా...ఆకలేత్తుంది' అన్నట్లుగానే వినిపించింది.

నాలో మొండితనం మాయమై జాలి వేసింది.

అంతకుముందు పెంచుకున్న కోప మంతా పటాపంచలై దానిస్థానంలో అలక మాత్రం మిగిలింది.

కళ్ళు తుడుచుకుని లేచి వెళ్ళి తలుపు తెరిచాను.

పాలగ్లాసు చేత్తో పట్టుకుని డాక్టరుగారు గుమ్మం బయట నుంచున్నారు.

ఆయన ముఖం వంక చూడలేక తల వంచుకుని వెళ్ళి మళ్ళీ మంచం మీద పడుకున్నాను.

ఆయన తలుపు గడియ వేసి వచ్చి నా పక్కనే మంచం మీద కూర్చుంటూ "బాగాకోపం వచ్చిందా...?" అన్నాడు.

ఈ మాటతో నాలో మరో దుఃఖపు అల ఉవ్వెత్తున లేచింది. కళ్ళలో నీళ్ళు సుళ్ళు తిరుగుతుంటే ముఖం పక్కకు తిప్పుకున్నాను.

ఆయన నా తల మీద చెయ్యివేసి, నన్ను తనవైపు తిప్పుకోడానికి ప్రయత్నిస్తూ – "చూడు సౌమ్యా! నా మాట విను. ఏడవకు. నిన్ను అవమానించా లని కాదు...నిన్ను అవమానిస్తే నన్ను నేను అవమానించుకున్నట్లుకదూ"

ఆయన ఓదార్పుతో నాలోని దుఃఖం అధికమైందే కానీ తగ్గలేదు.

"సౌమ్యా! ఇలా నా వంక చూసి చెప్పు. నేను నిన్ను అవమానించగలనా? కాకపోతే నా తాపత్రయమంతా లోకంలో అందరూ సామాన్యంగా పొందే సుఖాలకు నువ్వు మాత్రం ఎందుకు దూరం కావాలనే. ఇందులో..."

"ఇక నాకు మీరేమీ చెప్పొద్దు" వెక్కుతూనే అన్నాను.

'చూడండీ! సౌమ్య కోరికలతో కాలి పోవడం లేదు. శారీరక సుఖాల కొరకు




అడ్డుదారులు తొక్కే అగత్యం సౌమ్యకు లేదు. మీ నుండి పొందగలిగే ఈ ఆత్మీయతే నాకు చాలు. మీతో పంచుకోలేనివి స్వర్గ సుఖాలైనా నాకు అక్కర్లేదు. ఇంకెప్పుడూ ఇలాంటి మాటలు చెప్పి నన్నవమానించకండి' అనాలనుకున్నాను. కాని నేను నోరువిప్పి ఒక్కమాటా చెప్పలేదు. అయినా నా కన్నీటి భాషను ఆయన అర్థం చేసుకున్నారు.

'నిన్ను నేను అర్థం చేసుకున్నాను సౌమ్యా...' అన్నట్లుగా ఉంది ఆయన స్పర్శ. ఆయన ఒడిలో ఉంది నా తల. ఆయన నా జుట్టు నిమురుతూ ఎంతోసేపు మౌనంగా ఉన్నారు.

"పోనీలే... ఇంక నేనేమీ చెప్పను. కానీ లేచి ఈ పాలు తాగు" ఆయన పసిపిల్లలా నన్ను పొదవిపట్టి నా నోటికి పాల గ్లాసు అందించారు.

మరి కాసేపటికే అలాగే ఆయన ఒడిలోనే కళ్ళు మూసుకుని నిద్రకు పడ్డాను. ఆయన ఎప్పుడు నన్ను పక్క మీదకు చేర్చి దుప్పటి కప్పి వెళ్ళిపోయారో జ్ఞాపకం లేదు.



4

పిల్లలు వాళ్ళకు తెచ్చిన బట్టలు చూసుకుంటున్నారు.

చిన్ని తనకు తెచ్చిన రెడీమేడ్ ఫ్రాకులూ, బొమ్మలూ అక్కలకు చూపించి మురిసిపోతుంటే డాక్టరుగారు నవ్వుకుంటున్నారు, కళ్ళజోడులోనుండి ఆయన కళ్ళు ఆనందంతో మెరుస్తున్నాయి.

నేను చీరల పాకెట్ విప్పి రమణిముందు ఉంచుతూ, "రమణీ! ఇందులోనీకునచ్చినవి ఉంచుకో. మిగిలినవి నేను తీసుకుంటాను" అన్నాను.

రమణి చీరలను నిర్లక్ష్యంగా అటూ ఇటూ తిప్పుతూ "వెళ్ళి తెచ్చుకున్నావుగా నువ్వే ఉంచుకో" అంది విసురుగా.

నేనేమయినా మాట్లాడితే మరీ రెచ్చిపోతుందని మౌనంగా ఉండిపోయాను.

డాక్టరుగారు కలుగజేసుకుంటూ, "ఎవరు తెస్తే ఏమ్మా ? నీకు నచ్చినవి తీసుకోకూడదూ" అన్నారు.

"నాకిందులో ఒక్కటి కూడా నచ్చలేదు డాడీ" అంది ముఖం గంటుపెట్టుకుంటూ.

"ఏం... అవి బాగున్నాయి కదూ? పోనీ అందులో ఒకటి తీసుకో. నువ్వు షాపుకు వెళ్ళి నీకు నచ్చింది మరొకటి తెచ్చుకుందువుగాని" డాక్టరుగారు నచ్చజెబుతున్నట్లుగా అన్నారు.

"ఆవిడగారు తెస్తే తీసుకోవాల్సిన ఖర్మ నాకు పట్టలేదు డాడీ"

చీరల పాకెట్ విసిరేస్తూ విసురుగా లేచివెళ్ళిపోయింది రమణి.

డాక్టరుగారి ముఖంలో కత్తివాటుకు నెత్తురుచుక్క లేకుండాపోయింది.

అంతకుముందు ఆయన కళ్లల్లో కనిపించిన మెరుపులస్థానే విషాదం ఆవరించింది.

ఆ పరిస్థితిలో ఆయన్ను చూసిన నాకు జాలివేసింది.

రమణి నా మీద ద్వేషం పెంచుకున్నా

ఎప్పుడూ ఇలా తండ్రిముందు బయట పడలేదు.

ఆయనకు ఇంటివిషయాలేవీ బొత్తిగా తెలీవు.

పిల్లలందరూ నన్ను ప్రేమిస్తున్నా రనే అనుకుంటున్నారాయన.

రమణి పండుగరోజు భోజనం చెయ్య లేదు. కొత్త చీర కట్టలేదు. నా ముఖం చూస్తూనే చిటపటలాడుతూండటంతో నేనేమీ చెప్పలేకపోయాను.

వాళ్ళ నాన్నగారు నచ్చజెప్పి లాభం లేకపోవడంతో మౌనంగా గదిలోకి వెళ్ళి తలుపు వేసుకున్నారు.

తెచ్చిన టపాకాయలు చిన్నపిల్లలతో కాల్పుస్తూ నేను ఉండిపోయాను.

* * *

చిన్నిని స్కూల్లో చేర్చే రోజు.

చిన్నిని కొత్త ఫ్రాక్‌తో ముస్తాబుచేసి ఆయన కొరకు ఎదురుచూస్తూ కూర్చు న్నాను. ఇప్పుడే వస్తానని చెప్పి వెళ్ళిన మనిషి స్కూల్ టైం అయిపోయినా ఇంత వరకూ అంతులేరు.

వంటగదిలో పని మిగిలి వుంటే చూస్తున్నాను – ఆయన కోసం ఎదురు చూస్తూనే.

"ఆంటీ... మౌళి అంకుల్ వచ్చారు" చిట్టి పరుగెత్తుకుంటూ వచ్చిచెప్పింది. ఆ పేరు వింటూనే ఒక్కసారిగా నా ముఖం కందగడ్డలా బిగుసుకుపోయింది.

ఏ ముఖం పెట్టుకుని వచ్చాడు? అతనితో స్నేహం చేసేందుకు ఎగిరి గంతువేస్తాననుకుని ఉంటాడు.

ఎంత నీచమైన ఆలోచన. స్నేహం అట స్నేహం... నా మనస్సు కోపంతో మరిగిపోయింది.

"చిట్టీ! నాన్నగారు లేరని చెప్పిరా" కోపంగా చెప్పిపంపించాను చిట్టిని. తిరుగు టాబులా వెంటనే వచ్చేసింది చిట్టి.

"ఆంటీ... మౌళి అంకుల్ నీతో మాట్లాడాలట. ఒక్కసారి బయటకు రమ్మంటున్నారు"

నాలో కోపం ఒక్కసారిగా బుస్సు మంది. కనీససంస్కారం కూడా మరిచి పోయి, "వెళ్ళు చిట్టీ... వెళ్ళి నాకు పని ఉందనీ, ఇప్పుడు బయటికి రాననీ చెప్పు" కోపంగా అరిచి చెప్పాను.

చిట్టి బయటికి వెళ్ళిపోయింది.

'అమ్మయ్య... వెళ్ళిపోయి ఉంటాడు' అనుకుని తేలికగా నిట్టూర్చాను. వెనక అడుగులచప్పుడు వినిపించింది.

"చిట్టీ... ఆయన వెళ్ళిపోయారా?" అన్నాను వెనక్కు తిరిగి చూడకుండా.

చిట్టినుండి సమాధానం రాకపోవడంతో వెనక్కు తిరిగి చూశాను.

వంటగది గుమ్మం ముందు మౌళి రెండుచేతులూ గుమ్మానికి ఆనించి నించు న్నాడు గుమ్మం పొడవునా.

ఒక్కసారిగా దిమ్మరపోయాను.

ఏమిటితని ఉద్దేశం...? లోపలికి కూడా వచ్చేస్తున్నాడే...?

నన్ను బ్లాక్‌మెయిల్ చెయ్యాలను కుంటున్నాడా...?

అరక్షణంలోనే అరలక్ష ఆలోచనలతో వేగిపొయ్యాను.

"ప్లీజ్. సౌమ్యా .... ఒక్కసారి నా మాట వినండి..."

రమణి, మణి, చిట్టి, చిన్ని మౌళి వంకా, నావంకా మార్చిమార్చి చూస్తున్నారు.

"మౌళిగారూ! మీరు చెప్పేందుకూ, నేను వినేందుకూ ఏమీలేదు మనమధ్య. మీరు కేవలం మావారి స్నేహితులు.





ఆయన లేనప్పుడిలా రావడం మర్యాద కాదు. పిల్లలముందు న్యూసెన్సు చేయకుండా దయచేసి వెళ్ళిపొండి. నేను మీతో స్నేహం చేసేందుకు సిద్ధంగా లేను" 'స్నేహం' అన్నపదం వత్తి పలుకుతూ అన్నాను.

మౌళి ఒక్కక్షణం నా వంక పరిశీలనగా చూసి గిరుక్కున వెనక్కు తిరిగి చకచకా అడుగులు వేస్తూ వెళ్లిపోయాడు.

రమణి ఏదో అర్థం అయినట్లు తల పంకిస్తూ గదిలోకి వెళ్ళిపోయింది.

చిన్నిని స్కూల్లో చేరుస్తున్నందుకు అప్పటి వరకూ సంతోషంగా ఉన్న నా మూడ్ అంతా పాడయిపోయింది.

జరిగిన సంఘటన మరచిపోయేందుకు ఏదో పుస్తకం తీసి చదువుతూ కూర్చున్నాను.

"సౌమ్యా! చిన్నిని రెడీ చేశావా...?" అంటూ డాక్టరుగారు వచ్చారు.

"ఇప్పటికి రెండు గంటలనుండీ ఎదురు చూస్తున్నాం"

"అరే. నువ్వేమిటి అలా ఉన్నావ్?"

"డాడీ....మరేమో మౌళి అంకుల్ వచ్చారు. ఆంటీ ఏమో అంకుల్‌తో పోట్లాడింది" గబగబా తండ్రికి చెప్పేసి ఊపిరి తీసుకుంది చిట్టి.

డాక్టరుగారి మది ఆ విషయం తర్కించకుండా చిన్నిని చేతుల్లోకి తీసుకుంటూ, "చిన్నీ...వెళదామా?" అన్నారు.

"అమ్మా! నువ్వూ రావూ?" అంది చిన్ని నా చెంగు లాగుతూ.

"పోనీ,సౌమ్యా..నువ్వూ రాకూడదూ?"

కిందటి అనుభవంతో ఆయనతో కలిసి బయటికి వెళ్ళేందుకు నాకు కొంచెం పిరికిగా అనిపించింది.

తగుదునమ్మా అంటూ ఆయనతో బయలుదేరి, ఆయన్ను బాధపెట్టి నేను బాధ పడాలి. ఎందుకొచ్చిన బాధ....?

కానీ చిన్ని, "అమ్మా...రావూ?" అంటూ మారాం మొదలు పెట్టింది. చిన్ని మొదటిసారిగా బడికి వెడుతోంది.

ఆ చిన్నారి మనస్సు కష్టపెట్టడం ఇష్టంలేక రెండు నిముషాల్లో తయారయి కారెక్కి కూర్చున్నాను చిన్నితో సహా.

రమణి కారు దగ్గరకు వస్తూ, "డాడీ! చిన్నికి ఏం పేరు పెడతారు?" అంది ఆసక్తిగా.

డాక్టరుగారు నవ్వుతూ, "మళ్ళీ వచ్చిన తరువాత చిన్నిని అడుగు" అన్నారు. కానీ, నాకూ ఆసక్తిగానే ఉంది - చిన్నికి ఏం పేరు పెడతారో తెలుకోవాలని.

డాక్టరుగారు అప్లికేషన్ ఫాం పూర్తి చేసేప్పుడు ఏం రాస్తారో అని ఆసక్తిగా తొంగిచూశాను.

"రమ్య" అని రాశారాయన.

"రమ్య .... రమ్య" అంటూ నాలుగైదుసార్లు మనస్సులోనే మననం చేసుకున్నాను.

"పేరు చాలా కొత్తగా ఉంది. ఇదేం పేరూ?" అన్నాను తిరిగి వస్తూ కార్లో.

''సౌమ్య మాత్రం కొత్తగా లేదూ? అలాగే సౌమ్య కూతురు రమ్య" అన్నారు నవ్వుతూ.

ఈ పేరు వింటూ రమణి మండి పడుతుంది అనుకున్నాను మనస్సులోనే.

కారు మౌళి ఇంటిముందు ఆగడంతో ఒక్కసారిగా ఉలిక్కిపడ్డాను.

"ఇక్కడి కెందుకూ..?" నా గొంతు నాకే కర్కశంగా వినిపించింది.

డాక్టరుగారు నవ్వారు.

"సౌమ్యా... ఇంతకు పూర్వం మీరు

ఒకరికొకరు తెలియకపోయినా అతనంటే నీకు మంచి అభిప్రాయం ఉండేది. నా వల్లే నీకు అతనిమీద దురభిప్రాయం ఏర్పడింది. ఒక మంచి మనిషిని అలా దుర్మార్గుడిగా చిత్రించి చూస్తూ ఊరుకోడం ఏం న్యాయం. మళ్ళీ మీ ఇద్దరికీ స్నేహం కలిపే పూచీ నాదే. ఔనా...?"

స్నేహం అన్నమాట వింటేనే నాకు కారం రాచుకున్నట్లుగా ఉంది.

వీళ్ళ దృష్టిలో స్నేహం అంటే అంత విలువ లేనిది...?

"స్నేహమూ వద్దు, చట్టు బండలూ వద్దు, ఇంటికెళదాం పదండి"

'అబ్బబ్బ...ఈ ఆడవాళ్లతో ఏదొచ్చినా కష్టమే" అన్నారు హాస్యంగా.

డాక్టరుగారు కారు దిగి మౌళి ఇంటి వైపు వెళ్ళి వెంటనే తిరిగి వచ్చేశారు.

ఏమయింది అని నేను అడగలేదు. నాకేమీ పట్టనట్లు ఎటో చూస్తూ కూర్చున్నాను. మనస్సులో చాలా కోపంగా ఉంది. కానీ ఏం చెయ్యను...?

"మౌళి లేడు. ఆఫీసుకు వెళ్ళాడు" అన్నారు కారు స్టార్ట్ చేస్తూ.

'మంచి పని అయ్యింది' అనుకున్నాను కసిగా.

* * *

సౌమ్యా... నీకు ఉత్తరం"

నాకు ఉత్తరమా....? ఆశ్చర్యమే. ఉత్తరం రాసేందుకు నా వాళ్ళంటూ ఎవరూ లేకపోయినా కనీసం నా క్షేమ సమాచారాలు తెలుసుకోగోరే పరిచయస్తులైనా ఎవరూ లేకపోవడం నా దురదృష్టం.

డాక్టరుగారు ఇచ్చిన కవరు అందుకుని అడ్రసు చూశాను.

'మిసెస్ సౌమ్యా కృష్ణమోహన్' అని రాసి వుంది.

కనీసం ఆ రాత కూడా పరిచయమైన రాతలా కనిపించకపోవడంతో ఆలోచిస్తూ కవరు చించాను.

"సౌమ్యగారికి... నమస్తే"

ఎవరబ్బా అనుకుంటూ కింద సంతకం చూశాను.

"మీ స్నేహం వాంఛించే మౌళి"

నా నొసలు ముడివడింది. కోపంతో పళ్ళు కొరుక్కున్నాను.

ఈ మనిషి నా వెంట ఇలా పడ్డాడేం? ఇక ప్రేమలేఖలు మొదలు పెట్టాడుగావున్ను. ఛీ...ఛీ...ఇలాంటి వ్యక్తి వ్యక్తిత్వాన్ని తానెంత గొప్పగా ఊహించుకుంది....?

అయినా పరిచయం లేకుండా ఒక మనిషిని గురించి గొప్పగా ఊహించుకో గూడదని తెలిసి వచ్చింది.

కోపంతో ఉత్తరం చించివేయబోయి మళ్ళీ ఆగాను. ఉత్తరం డాక్టరుగారికి చూపిస్తే సరి.

ఆయనకూ తెలిసి వస్తుంది. సహృదయుడూ, మంచి మనిషీ అంటూ గొప్పగా చెబుతారుగా?

ఈ ఆలోచన రావడంతోనే డాక్టరు గారి గదిలోకి వెళ్ళాను.

"మీ సహృదయుడు 'ప్రేమలేఖ' రాశాడు చదువుకోండి" అంటూ ఉత్తరం డాక్టరుగారి టేబిల్ మీద పెట్టి అక్కడే ఏదో సర్దుతూ ఉత్తరం చదువుతున్న డాక్టరుగారిని ఓరగా గమనించాను.

డాక్టరుగారు సీరియస్‌గా ఉత్తరం చదువుతున్నారు.

నాకు చాలా సంతోషం వేసింది. అయ్యగారికి ఇప్పటికి తెలిసింది. ఆయన గారెంతటి సహృదయులో?

రచయిత కదా...ఉత్తరంనిండా ఏం




పైత్యం నింపాడో ఏమిటో? డాక్టరుగారు కనుబొమ్మలు ముడివేసి మరీ చదువుతున్నారు.

ఉత్తరం పూర్తిచేసిన డాక్టరుగారి పెదవులు చిరునవ్వుతో విచ్చుకున్నాయి.

"ఉత్తరం చదివావా?"

లేదన్నట్లుగా తల అడ్డంగా తిప్పాను.

"ఇదిగో...చదువు"

మౌనంగా ఉత్తరం అందుకున్నాను.

"సౌమ్యా ... నా దృష్టిలో నీతి నియమాలకు నిర్వచనం వేరు. నీతికీ, అవినీతికీ మధ్య ఓ రేఖామాత్ర వ్యత్యాసం ఉంటుంది. ఆ రేఖ కూడా అతి సున్నితమైనది. సౌమ్యా...మిమ్మల్ని చూసిన మొదటి క్షణానే ఇలాంటి భార్య ఉన్న పురుషుడు నిజంగా అదృష్టవంతుడు అనుకున్నాను. ఒక్క క్షణం డాక్టరుగారి ఎద జలసీలాంటి భావం కూడా కలిగింది.

ఆ తరువాత మీతో పరిచయాన్నీ, స్నేహాన్నీ పెంచుకోవాలనుకున్నాను. కే 'స్నేహం' అన్నానని కోపం తెచ్చుకోకండి. నేను నిజంగా కోరుకుంది కేవలం స్నేహం మాత్రమే.

ఆకర్షణీయమైన రూపం ఎందరికో ఉంటుంది. అయితే అలా అని అందరితోనూ పరిచయం పెంచుకోవాలనీ, స్నేహం చెయ్యాలనీ అనిపించదు.

కొందరి అందం అగ్నిశిఖలా జ్వలిస్తే మరికొందరి అందం వసంతంలోని సమీరంలా, వెన్నెలలా సేదతీరుస్తుంది. ఆదిగో....మీ అందం ఆ కోవకు చెందుతుంది.

కేవలం మీ అందాన్ని చూసే నేను మీ స్నేహం కోరలేదు. అందానికి మించిన మంచితనమో లేక మరేదో ఆకర్షణో నన్ను మీకు దగ్గరవమంది.

సౌమ్యా...నాకు ముప్ఫై అయిదు ఏళ్ళు పైబడుతున్నాయి. కొన్ని కుటుంబ పరిస్థితుల కారణంగా ఇంతవరకూ పెళ్ళి చేసుకోలేదు. ఇప్పుడా బాధ్యతలన్నీ తీరిపోయాయి. నాకూ అందరిలా పెళ్ళి చేసుకోవాలనీ, భార్యతో సుఖపడాలనీ ఉంది. నాకింకా పెళ్ళికాలేదు. కనుక నా దగ్గరకు వెళ్ళకూడదు సుమా అనుకుంటాయా కోరికలు?

పెళ్ళి కానంతమాత్రాన వయసుకు వుండాల్సిన కోరికలు లేకుండా ఎలా పోతాయి?

అలాగే మీరూ. మెడలో తాళి వేలాడుతున్నంత మాత్రాన కోరికలు వాటంతటగా అవి తీరిపోవుగా?

కోరిక పాపంకాదు. నమ్మించి ద్రోహం చెయ్యడం, మోసంచెయ్యడం మాత్రమే నా దృష్టిలో పాపం.

మోసంలేని చోట పాపంలేదు. ఇదే నా నీతి.

ఇది కేవలం నా అభిప్రాయం మాత్రమే. మీ ఇష్టంలేకుండా ఏమీ జరగదు. మిమ్మల్ని వంచించాలనీ, మభ్య పెట్టాలనీ లేక అవమానించాలనీ నా అభిప్రాయం కాదు.

మీతో కోరికలు పంచుకోడంకన్నా నాకు మీ స్నేహమే అమూల్యమైనది. గౌరవం వున్నచోటే స్నేహం వుంటుంది. దురదృష్టవశాత్తూ ఆ గౌరవాన్నే పోగొట్టుకున్నాను.

ఒకవిధంగా మీ స్నేహ మాధుర్యాన్ని పొందే అర్హతను పోగొట్టుకున్నాను. మీరు నా స్నేహాన్ని మన్నించినా, లేకపోయినా మీరు మాత్రం ఎప్పటికీ నాకు కావలసినవారే. అలా నేను డాక్టరుగారికి మాట ఇచ్చాను. సౌమ్యా... మీరు సుఖంగా, శాంతిగా, తృప్తిగా బతకాలని స్నేహితుడుగా మనసారా కోరుకుంటున్నాను"

ఉత్తరం చదువుతూ సిగ్గుతో చితికిపోయాను.

తన మనసు సూటిగా, నిర్భయంగా బయటపెట్టగలిగిన నిష్కల్మష హృదయుణ్ని అకారణంగా అవమానించినందుకు చింతించాను.

నా నీడనే చూసుకుని ఉలిక్కిపడే నా అల్పత్వానికి సిగ్గుపడ్డాను.

"సాయంత్రం మౌళి దగ్గరకు వెడదామా?"

డాక్టరుగారి ప్రశ్నకు మౌనంగానే నా అంగీకారాన్ని తెలియజేశాను.

* * *

క్రమేపీ మౌళి మా కుటుంబంలో ఒకరుగా కలిసిపోయారు. పండుగవంటి ప్రత్యేక దినాల్లో మాతో కలిసి భోంచేసేందుకు మౌళికి ఆహ్వానం అందేది ఆయన నుండి.

డాక్టరుగారు వున్నా లేకున్నా మౌళి రాక చాలా మామూలయింది. చిన్నికూడా మౌళికి బాగా చేరువయ్యింది. అతనున్నా సేపూ అతన్ని వదలకుండా అంటిపెట్టుకునే వుంటుంది.

డాక్టరుగారు కూడా వుంటే ఆ సమావేశం అత్యంత ఆహ్లాదకరంగా ఉండేది. డాక్టరుగారూ, మౌళీ ఒక పక్షమై నన్ను ఆటలు పట్టిస్తూండటం సాధారణమైపోయింది.

మౌళి రాక మాకు మంచి కాలక్షేపం. అతను ఒక్కరోజు రాకపోయినా ఏదో వెలితి ఫీలయ్యేవాళ్లం ఎవరికి వాళ్ళమే.

రమణి మౌళితో స్నేహం పెంచుకునేందుకు ప్రయత్నించి విరమించుకుంది.




మౌళి నాపట్ల ఆసక్తి కనబరచడం ఆ పిల్లకు కంటగింపుగా ఉండేది.

రమణి పుణ్యమా అంటూ ఆ వీధి వీధంతటికీ నా పేరు కాలక్షేపంగా దొరి కింది. తల్లిలేని పిల్లలుగా వీధిలోని అమ్మ లక్కలంతా పిల్లలను పలకరించి క్షేమ సమాచారాలు కనుక్కునేవారు.

"మీ పిన్ని బాగా చూస్తుందా...?" అని ఒకరడిగితే, "మీ నాన్న, మీ పిన్ని బాగుంటారా...?" అని మరొకరు, "మీ ఇంట్లో పెత్తనమంతా మీ పిన్నిదే నటగా...?" అని ఒకరంటే, "మీ ఇంటికి రోజూ వస్తాడే ఆ బక్కపలచటి ఎర్ర టాయన ఎవరూ...?" అని మరొకరి సందేహం.

రమణి, మణి ఈ ప్రశ్నలన్నింటికీ వాళ్ళకు నచ్చేవిధంగా సమాధానాలు చెబుతూ, వాళ్ళ ఆసక్తిని తృప్తిపరుస్తూ వాళ్ళ సానుభూతిని సంపాదించేవారు.

సహజంగా మన సమాజంలో సవతి తల్లికీ-పిల్లలకూ మధ్య సంబంధాలు సజావుగా లేకపోవడానికి కారణం ఇరుగమ్మా-పొరుగమ్మలే.

ఎవరెన్ని విధాలుగా చెప్పుకున్నా మౌళి వారికి, నాకూ, చిన్నికి ఆప్తుడే అయ్యాడు.

అప్పటికి మూడు రోజులుగా మౌళి రాలేదు.

డాక్టరుగారూ, నేనూ మౌళికోసం ఎదురు చూశాం. కారణం తెలీక ఆతృత చెందాం.

మూడోరోజుకు మా ఆతృత ఎక్కువయింది.

"సౌమ్యా... మౌళి రాలేదేం?" అన్నారు నూటపదహారోసారి.

డాక్టరుగారి అనుమానం నాకు తెలుసు.

"ఏమో... నాకేం తెలుసూ...?" అన్నాను.

"నువ్వేమయినా అన్నావా...?"

"నేనంత గయ్యాళినా?"

"ఛ...ఛ...నీ అంత మంచి అమ్మాయి భూతద్దం వేసి వెదికినా దొరకదు. కాక పోతే కాస్త ముక్కు మీద కోపం..అంతే" అన్నారు నవ్వుతూ.

"ఒంట్లో బావుండక రాలేదేమో..."

డాక్టరుగారు మరి ఆగలేకపోయారు.

"నిజమే సుమా! నాకు తోచనేలేదు" అంటూ అప్పటికప్పుడే మౌళి కోసం వెళ్ళారు.

ఇద్దరి కొరకు ఎదురు చూస్తూ కూర్చు న్నాను.

మరి కాసేపటికే మౌళితోసహా కారు దిగారు డాక్టరుగారు.

నా ఊహ కరెక్టే...

మౌళి 'సిక్'గా కనిపిస్తున్నాడు. జ్వరపడి లేచినట్లుగా నీరసంగా, వడలి పోయినట్లుగా వున్నారు.

అలసటగా సోఫాకు చేరగిలబడ్డాడు కళ్ళు మూసుకుని.

"నువ్వు చెప్పిందే కరెక్ట్ సౌమ్యా. మీ రచయితగారు నేను వెళ్ళేప్పటికి మంచం నేస్తున్నారు. రాలేనంటూ గొడవ పెడు తుంటే బలవంతంగా లాక్కువచ్చాను. జ్వరం తగ్గేవరకూ ఇక్కడే వుంటారు..."

నాలోని నర్సు అతని జబ్బు గుర్తిం చింది.

అతని కళ్ళల్లో కనీ కనిపించని పసుపురంగు తెల్లని కనుగుడ్డుతో ఐక్యం చెందింది.

మౌళి జాండీస్‌తో బాధ పడుతున్నారు.

"చెప్పవయ్యా రైటరూ...డాక్టర్ల దగ్గర దాచకూడదు"

డాక్టరుగారి మాట విని మౌళి ఇబ్బందిగా నవ్వుతూ "అబ్బే ... కొంచెంగా జ్వరం....అంతే..." అన్నాడు.

డాక్టరుగారు మౌళిని పరీక్షచేసి ఓ గ్లూకోజ్ ఇంజక్షన్ చేశారు. కొద్దిగా టెంపరేచర్ కూడా వుంది.

"ట్రీట్ మెంట్ తీసుకున్నారా?" అడిగాను.

మౌళి నవ్వుతూ, "నాకు డాక్టర్లంటే గొప్ప గౌరవం. అందుకే వాళ్ళను సాధ్యమైనంత దూరంలో వుంచుతాను" అన్నాడు.

అందులోని శ్లేషను అర్థం చేసుకున్న మేము నవ్వేశాము.

"ఇంజక్షన్ అంటే అంత భయం పనికిరాదయ్యా రైటరూ..."

"అబ్బే... ఇంజక్షన్ అంటే భయపడేంత అర్భకుణ్ని కాదండీ"

"ఏమిటి...మేమంటేనా భయం?"

"అక్షరాలా మీరంటేనేనండీ"

డాక్టరుగారు నవ్వారు.

"రెండు రోజులు ఓపిక పట్టావంటే నిన్ను క్షేమంగా మీ ఆఫీసులో వదిలేస్తాను"

"రెండు రోజులకు సరిపోను గోళ్ళు కూడా లేవే?"

"సౌమ్యా...నువ్వూ హాయిగా ఏ క్యారమ్సో, కార్డ్సో ఆడుకోండి..."

"అయితే నాకీ చెరసాల తప్పదన్నమాట..." మౌళి నిట్టూర్చాడు.

అతని ముఖం చూస్తే జాలేసింది.

* * *

ఉదయం వంటగదిలో చాలా హడావిడిలో ఉన్నాను. గాస్ స్టౌ మీద కుక్కర్‌లో ఆఖరి ఇడ్లీ వాయవేసి కాఫీ డికాక్షన్ తీస్తున్నాను.

పిల్లలంతా శ్రద్ధగా పుస్తకాల ముందు కూర్చున్నారు.

చిన్ని "ఎ ఫర్ యాపిల్, బి ఫర్ బెల్... సి ఫర్ క్యాట్" అంటూ గట్టిగా చదువుతోంది బొమ్మల పుస్తకం చూస్తూ. డాక్టర్‌గారు హాస్పిటల్‌కు వెళ్ళేందుకు తయారవుతూ షేవ్ చేసుకుంటున్నారు గదిలో కూర్చుని.

మౌళి స్నానం ముగించి కూడా బద్ధకంగా బెడ్ మీదే పొర్లుతున్నాడు. ఎవరో తలుపులు దబదబ బాదడంతో విసుక్కుంటూ చేతిలో పని వదిలి వెళ్ళి తలుపు తీశాను.

ఎదురుగా ఒక నడివయస్సు స్త్రీ... చుట్టూ సంచీ, పెట్టీ,బుట్టా సరంజామాతో.

ఆమె అప్పుడే రిక్షా దిగినట్లుంది.

రమణి, మణి, చిట్టి ముగ్గురూ గదిలో నుండి బయటికి వచ్చారు. ఆమెను చూసిన వాళ్ళ ముఖాల్లో సంభ్రమం.

"పెద్దమ్మా.." అంటూ ముగ్గురూ ఆమె చేతుల్లోకి వెళ్ళిపోయారు. నాకు అర్థం అయ్యింది.

ఆమె విశాల అక్క 'జానకమ్మ'.

జానకమ్మ చేతులు బారజాపి పిల్లలు ముగ్గుర్నీ దగ్గరకు తీసుకుని చనిపోయిన చెల్లెల్ని తలుచుకుని పెద్దగా శోకాలు పెడుతోంది.

పిల్లలు దిక్కుమొహాలు వేసుకుని చూస్తున్నారు. ఈ హడావిడికి డాక్టరుగారు బయటికి వచ్చి చూశారు.

వదినగార్ని చూస్తూనే ఆయన మొహం కఠినంగా మారింది.

"వాకిట్లో ఏమిటి? లోపలికి రండి" అన్నారు.

జానకమ్మ పిల్లల్ని తీసుకొని వంటగదిలోకి వెళ్ళింది.




"అమ్మా, మీకెంత కష్టమొచ్చిందేతల్లీ! దేవుడు మిమ్మల్ని తల్లిలేని పిల్లల్ని చేశాడుగదే తల్లీ!" అంటూ ముక్కు చీదేస్తూ శోకాలు పెట్టింది మరోసారి.

విశాల చనిపోయిన తర్వాత ఇంత వరకూ ఒక్కసారి కూడా అంతులేని ఈ మనిషి హఠాత్తుగా ఇలా ఊడిపడటమూ, పిల్లలమీద ఇంత ఆపేక్ష కురిపించడమూ నాకు చాలా వింతగా అనిపించింది.

నెమ్మదిగా వంటగదిలోకి వెళ్ళాను.

కానీ అప్పటికే జానకమ్మ టిఫిన్ ప్లేట్లలోకి తోడి పిల్లల ముందుపెట్టి కొసరి కొసరి తినిపిస్తోంది.

ప్రయాణం చేసివచ్చిన మనిషి స్నానం కాదుగదా కనీసం కాళ్ళూ, చేతులూఅయినా కడుక్కోకుండా, బట్టలు మార్చుకోకుండా అలా వంటింటికి ఎగబడ్డం నాకు చాలా చిరాకు వేసింది.

"మీరు స్నానం చేసిరండి. నేను వడ్డిస్తాను" అన్నాను.

జానకమ్మ ముటముటలాడుతూ చూసింది.

అదే చూపు—

'ఈ ఇంట్లో నువ్వెవ్వరు?' అనేదే ఆ చూపుకు అర్థం.

"రమణీ! మీ నాన్న వుంచుకున్నాదన్నది ఈ మహాతల్లినేనా?" అంది నా ఎదుటే.

రమణి అవునన్నట్లు తల వూపింది.

ఇద్దర్నీ కలిపి నిలువునా ఉరి తీయాలన్నంత కోపం వచ్చింది. కోపంతో కళ్ళలో నీళ్లు తిరిగాయి.

నేను ఉంచుకున్నదానిని కాదు; సలక్షణంగా పెళ్ళి చేసుకున్నదాన్నని ఎలా చెప్పాలో అర్థం కాలేదు.

సున్నితమైన విషయాన్ని మోటుగా, అసహ్యంగా ఎలా మాట్లాడగలరో...

"నా తల్లే... ఎంత చిక్కిపోయారే... ఎంతయినా పరాయిపెట్టు తల్లిపెట్టు అవుతుందా? కడుపునిండా తినండమ్మా" అంది—ఆనాడే వాళ్లు మొదటిసారిగా టిఫిన్ తింటున్నట్లు!

ఏమిటీ విషం... ఇంతకాలం లేనిది ఈ ఒక్కరోజే ప్రేమంతా ఒలకపోస్తుంటే కనీసం ఈ పిల్లలకయినా బుద్ధిలేదేం?

జానకమ్మ తానుకూడా మరో ప్లేట్లో టిఫిన్ వడ్డించుకుని, ఆవురావురంటూ తింటోంది ఏదో సణుగుతూనే...

ఆ తిండిచూస్తుంటే నాకు కంపరం వేసింది. ఎంతోకాలంగా తిండిముఖం చూడనట్లు ఆబగా తింటోంది.

డాక్టరుగార్కి ఆలస్యం అయిపోతోంది. ఈ మహాతల్లి గిన్నెలముందు నుండి కదలడంలేదు.

"మీరు కొంచెం పక్కకు తప్పుకుంటారా? ఆయనకు టిఫిన్ పెట్టాలి". అన్నాను.

జానకమ్మ నావేపు చురుక్కునచూస్తూ పక్కకు తప్పుకుంది. మౌళికి టిఫిన్ పెట్టి ఆయనకొరకు టిఫిన్, హార్లిక్స్ తీసుకుని గదిలోకి వెళ్ళాను.

డాక్టరుగారు టిఫిన్ తీసుకుంటుండగా అడిగాను కోపంగా "ఇంతకాలం ఏమైపోయిందీ ఈమె?"

ఆయన చెప్పింది విన్న నా గుండెల్లో రాయి పడింది.

ఈ జానకమ్మ తల్లి ఎప్పటికీ ఇక్కడే తిష్టవేస్తుందా ఖర్మ...నడివయస్సు దాటుతున్నా జానకమ్మకు పిల్లలు కలగకపోవడంతో ఈమధ్యే ఆమె భర్త ఏదో కొంత పొలం ఈమెపేర రాసి ఈమెను వదిలించుకుని వేరే పెళ్ళిచేసుకున్నాడు.

అందుకే ఇప్పటికి జానకమ్మకు చెల్లీ, ఆమె పిల్లలూ గుర్తుకువచ్చారు. స్వతహాగా జానకమ్మకు పిల్లలూ, వాళ్ళ పెంపకమూ అంటే గొప్ప అయిష్టం. విశాల చని పోయినప్పుడు వస్తే పిల్లల పెంపకం తన కెక్కడ చుట్టుకుంటుందో అనే భయంతో రాలేదు. కానీ, ఇప్పుడు ఆ భయంలేదు. పిల్లలు పెద్దవాళ్ళయ్యారు. అంతేకాదు, మరిది బాగా సంపాదిస్తున్నాడు. ఆ సంపా దనంతా 'అదెవతో' అనుభవిస్తూండటం ఆమెకు సుతరామూ గిట్టలేదు. అందుకే పెట్టే, బేడా వేసుకుని జానకమ్మ అక స్మాత్తుగా ఊడిపడింది.

డాక్టరుగారు హాస్పిటల్‌కు వెళ్ళి పోయారు.

జానకమ్మ పిల్లల్ని ముగ్గుర్నీ దగ్గర కూర్చోబెట్టుకుని ఇంటి విషయాలన్నీ వివరంగా అడిగి తెలుసుకొంటోంది.

జానకమ్మ గద్ద కళ్ళతో ఇంటినీ, ఇంట్లోని ఖరీదయిన వస్తువుల్నీ పరిశీ లిస్తోంది.

"దేనికైనా పెట్టిపుట్టాలి అంటారు అందుకే" అంది నిట్టూరుస్తూ. తన ఆస్తంతా ఎవరో దోచుకుపోయినంత కసి ఆ మాటల్లో. జానకమ్మ ఇల్లంతా కలయ దిరుగుతూ గెస్టురూంలో వున్న మౌళిని చూస్తూ "రమణీ....ఆ గదిలో వున్న ఆయనెవరే?" అంది అదోరకమైన కుతూహలం వ్యక్తపరుస్తూ లోగొంతుతో.

రమణి గొణుగుతున్నట్లుగా ఏదో చెప్పింది.

అంతే జానకమ్మ స్వరం తారస్థాయి నందుకుంది. ప్రపంచంలో ఎక్కడా జరగని అనాచారమేదో తన చెల్లెలి ఇంటనే జరిగిపోతున్నట్లుగా లబలబలాడి పోయింది.

"హవ్వ...హవ్వ. ఇంత ఘోర కలి ఎక్కడయినా వుందా? భోగం కొంప కంటే కనాకష్టం అయిపోయింది. మొగుణ్ని చేతగానివాణ్ని చేసి రం... మొగుణ్ని తెచ్చి ఇంట్లోనే పెట్టుకుంటుందా? మీ నాన్న కెట్టా బుద్ధిలేకపోయిందే రమణీ...ఇద్దర్నీ కలిపి బయటికి గెంటకా"

నోరు పెంచుకుని అరుస్తున్న జానకమ్మ వాగ్ధాటిని ఎలా ఆపాలో తెలీడం లేదు.

ఈ మాటలన్నీ మౌళికి కూడా విని పిస్తున్నాయనే స్పృహతో సిగ్గుతో చితికి పోతున్నాను.

అతనికి వినిపించకూడదని కోరు కున్నాను. కానీ వినిపించకుండా ఎలా వుంటుంది-వినాలనేదే జానకమ్మ ధ్యేయ మైనప్పుడు.

"మీరేం మాట్లాడుతున్నారో మీకు తెలుస్తోందా?" అన్నాను కోపంగా జానకమ్మతో.

జానకమ్మ చేతులూ, మొహమూ అష్టవంకర్లు తిప్పుతూ "హాసి జాణగదే... డబ్బుకోసం ఆ పిచ్చిమారాజును కట్టుకుని పబ్లిగ్గా వీడితో కులుకుతున్నావన్న మాట. వయసొచ్చిన ఆడపిల్లలుగల ఇల్లని ఇంగితమైనా లేదేమే నీకు" జానకమ్మ పెట్రేగిపోతోంది.

"బుద్ధిలేకుండా మాట్లాడకు. ఆయన డాక్టరుగారి స్నేహితుడు"

నాలో కోపమూ, ఉక్రోషమూ కలిసి కన్నీళ్ళుగా బయటికి దూకుతున్నాయి.

పిల్లలంతా చుట్టూచేరి తమాషా చూస్తు న్నారు.

ఒకరిద్దరు పొరుగువాళ్ళు కూడా చేరారు.

దొంగను రెడ్‌హాండెడ్‌గా పట్టు




కున్నప్పటి పోలీస్ ఆఫీసర్ ముఖంలా జానకమ్మ ముఖం విజయగర్వంతో వెలిగి పోతోంది – ఇంత గొప్ప తప్పు చేస్తున్న నన్ను పట్టుకున్న ఘనతతో.

"అవునే...అవునుమరీ. రం..నేర్చిన ఆడది బొంకు నేర్వక కొంకినక్కల పాలయిందనీ...ఆయన స్నేహితుడనిగాక నీ స్నేహితుడని చెబుతావా? ఇరుగూ పొరుగూ నోట్లో గడ్డి పెడతారనయినా లేదేమే."

అలాంటి మనిషిని ఎలా ఎదుర్కో-వాలో నాకు తెలీదు.

అంతకంతకూ పెంచుకుంటూపోతున్న ఆ గొంతూ, ఆ ధోరణీ ఓహ్..ఆడవాళ్లకు ఇంత నోరుంటుందనీ, ఆ నోటికి ఇంత పదునుంటుందనే విషయం నాకు అంతకు పూర్వం అనుభవంలోకి రాలేదు.

ఆ నోటి తాకిడికి తట్టుకోలేక ఏడుస్తూ వెళ్లి మంచంమీద వాలిపోయాను.

అరచీ, అరచీ అలసిపోయి ఊరుకుంది జానకమ్మ అప్పటికి.

మౌళి ఏమనుకుని ఉంటాడు....?

ఇక అతనికి ముఖం ఎలా చూపించను? నా కళ్ళల్లో వుబికిన కన్నీటి వెల్లువకు ప్రయత్నించీ అడ్డుకట్ట వేయలేక పోయాను.

మధ్యాహ్నం చిన్ని స్కూలునుండి వచ్చి "అమ్మా... అన్నం..."అనేవరకూ అలాగే పడుకుని ఏడుస్తూండిపోయాను.

అప్పుడు గుర్తుకు వచ్చింది–

అప్పటివరకూ అతిథియైన మౌళికి కూడా భోజనం పెట్టలేదని.

అతని ఎదుట పడాలంటే ప్రాణం చచ్చిపోయినట్లుగా వుంది.

అతని ముఖం చూడటం ఎలా...?

తప్పదు. అవమానాలను భరిస్తూ బతకడానికే నేను పుట్టినప్పుడు మొహం తప్పించుకు తిరగడంలో అర్థం లేదు.

చిన్నికి అన్నం పెట్టాను.

ప్లేట్లో భోజనం సర్దుతుండగా నా కళ్ళు భయంగా జానకమ్మ ఉనికిని వెదుకు తున్నాయి.

జానకమ్మ లేదు. పొరుగింటికి పేత్త నానికి వెళ్ళింది.

గబగబా మౌళి గదికి వెళ్ళాను. గది తలుపులు దగ్గరగా వేసి వున్నాయి. తలుపులు నెట్టుకుని లోపలికి అడుగు పెట్టాను.

గది ఖాళీగా వుంది. మౌళి గదిలో లేదు.

మౌళికి సంబంధించిన ఏ చిన్న వస్తువూ అందులో లేదు.

నేను మ్రాన్పడినట్టయ్యాను. టేబిల్ మీద బరువు పెట్టిన వుత్తరం నా దృష్టి లోకి వచ్చింది.

ఉత్తరం చేతుల్లోకి తీసుకున్నాను ఆత్రుతగా.

"సౌమ్యా!

మీకు చెప్పే వెళదాం అనుకున్నాను. కానీ ఆ సమయంలో నా ఉనికి మీకు అభ్యంతరంగా, అభిమానంగా వుంటుందని ఆ ప్రయత్నాన్ని విరమించుకున్నాను. దేవ పారిజాతం భయంకర అగ్ని కీలల మధ్య చిక్కుకుపోయింది. చెయ్యి అందించి చేయవ కాలేని అశక్తతతో

మౌళి"

నా గుండెలు చీల్చుకుని ఓ నిట్టూర్పు వెలువడింది.

ఆ ఉత్తరం చిన్న చిన్న ముక్కలుగా చింపి బయటికి విసిరేశాను.

నిన్నటికీ, ఇవ్వాళటికీ ఎంత తేడా నిన్న ఈ ఇంటికి యజమానురాలిని

కానీ ఈరోజు అతిథికి పిడికెడు మెతుకులు పెట్టి ఆదరించే స్వేచ్ఛలేని అభాగ్యను.

ఆ సాయంత్రం డాక్టరుగారు వస్తూనే అడిగారు 'మౌళి ఏడంటూ?' జరిగింది చెప్పేందుకు మనస్కరించలేదు.

"వెళ్ళిపోయారు" అన్నాను క్లుప్తంగా

డాక్టరుగారి కనుబొమ్మలుఆశ్చర్యంగా ముడివడ్డాయి.

"అదేమిటి... వెళ్ళిపోతున్నట్లుగా మాటమాత్రంగా కూడా అనలేదే?"

"అర్జంటుగా పని తగిలిందట. మిమ్మల్ని తరువాత కలుసుకుని చెప్తానన్నారు..."

డాక్టరుగారు మరి ఆ విషయం తర్కించలేదు.

* * *

రోజులు గడుస్తున్నాయి...

క్రమంగా ఇంటి వ్యవహారాలన్నీ జానకమ్మ చేతుల్లోకి వెళ్ళిపోయాయి.

ఆమె దుబారా ఖర్చును చూస్తూ భరించలేను....భరించక చేయగలిగింది లేదని తెలుసుకుని చూడటమే మానుకున్నాను.

ఆమెకు అన్ని అవలక్షణాలతో పాటుగా 'చేతివాటం' కూడా వుందని క్రమంగా అర్థంఅయ్యింది.

వంటా వార్పూ జానకమ్మే చూస్తోంది.

ఇంట్లో అందరూ తిని కూర్చునేవాళ్ళే నంటూ పిల్లిమీదా, ఎలుకమీదా పెట్టి నన్ను సాధించడం ఆమెకో కార్యక్రమంగా తయారయ్యింది.

నా ఇంట్లోనే నేను పరాయిదాన్ని... తేరగా తినేదాన్ని. పిల్లలంతా ప్రతి దానికీ 'పెద్దమ్మా... పెద్దమ్మా' అంటూ ఆమె చుట్టూ చేరతారు...అయిన దానికీ, కానిదానికీ. ఆవిడ బోలెడు ప్రేమ వలక బోస్తుంది.

సవతి తల్లి స్వంత తల్లి ఎందుకు కాలేదో ఇప్పుడు నాకు అర్థం అయ్యింది.

ఇంత బాధలోకూడా నాకో తృప్తి - స్కూలుకు వెళ్ళిన సమయంలో తప్ప ఇంట్లో ఉన్నప్పుడంతా చిన్ని తల్లి "అమ్మా...అమ్మా..." అంటూ నన్ను వదలదు.

జానకమ్మ ప్రయత్నించీ చిన్నిని నా నుండి దూరం చేయలేకపోయింది.

డాక్టరుగారికీ, చిన్నికీ మాత్రం భోజనం నేనే పెట్టాలి. డాక్టరుగారు భోజనం చేస్తూ కూరలన్నీ దూరంగానెట్టి వట్టి పెరుగుతో మాత్రం తిని లేస్తున్నారు చాన్నాళ్ళుగా.

అసలే ఆయన భోజనం అంతంత మాత్రం....వేళకు తిండి ధ్యాస ఉండదు. తిన్నా పిడికెడు మెతుకులు...జానకమ్మ పుణ్యమా అంటూ కూరలు సహించక అదీ తినడంలేదు.

కనీసం "కూర ఇలా తగలడ్డదేం..." అని విసుక్కునే అలవాటు కూడా లేదాయనకు అందరి మగాళ్ళలా. ఇష్టమైతే తినడం, లేకపోతే దూరంగా పెట్టడం.... అంతే!

కానీ, జానకమ్మ వంటింటి పెత్తనం వదులుకునేందుకు సిద్ధంగా లేక నన్ను ఆ ఛాయలకు కూడా రానివ్వని విధంగా మాటలతో తరిమికొడుతోంది.

పిల్లలు ఇంట్లో వున్న సమయంలో క్షణం కూడా ఏమరకుండా పిల్లల్ని ముగ్గుర్నీ దగ్గర కూర్చోబెట్టుకుని నా మీద నూరిపోసే జానకమ్మను నేనేం చెయ్యగలను?

పిల్లల్ని వెంటపెట్టుకు పోయి పొరుగిళ్ళల్లో గంటలు గంటలు గడిపివచ్చే

 

జానకమ్మను నేనెలా ఆపగలను?

ఆమె ఈర్ష్యకూ, అసూయకూ కేంద్ర బిందువు నేనే...

"సౌమ్యా..."

డాక్టరుగారు గదిలో నుండి కేక వేశారు.

ఆయన ఎప్పుడోగానీ అంతగట్టిగా పిలవరు.

హడావిడిగా లోపలికి వెళ్ళాను. ఆయన డ్రాయరూ, పర్సులూ, జేబులూ కంగారుగా వెదుక్కుంటున్నారు.

"సౌమ్యా! జేబులో డబ్బు తీశావా?"

"నేనా...లేదండీ"

"అరే...డబ్బు ఏమైంది?"

ఆయన వెదికిన చోట్లే మళ్ళీ మళ్ళీ వెదుకుతున్నారు.

నేనూ వెదకడంలో ఆయనకు సహాయంచేస్తూ,

"ఎంతండీ?" అన్నాను.

"ఐదు వందలు. గుర్తుతెచ్చుకో. నువ్వేమయినా తీసి మర్చిపోయావేమో"

"అబ్బే...లేదండీ! అంత డబ్బు అవసరానికి తీస్తే గుర్తులేకుండా ఎలా ఉంటుంది?"

పిల్లల్ని 'మీ నాన్నగారి జేబులోనుండి డబ్బు తీశారా?' అని అడిగేందుకు భయం వేసింది.

డాక్టరుగారే పిల్లల్ని కేకేసి డబ్బు గురించి అడిగారు.

రమణితో సహా అందరూ మాకు తెలిదన్నారు. రమణి నావంక అనుమానంగా



ఓ చూపు విసిరింది.

ఇంక జానకమ్మను అడిగే ధైర్యం నాకు ముందే లేకపోయింది. ఆయనా అడగలేదు...

అంతే...ఆ డబ్బు గురించి అజా మరి తేలలేదు...

నాకు చాలా ఆశ్చర్యంగా ఉంది.

ఇంతవరకూ ఇలా డబ్బు పోయిన సంఘటన ఏదీ ఇంట్లో జరగలేదు.

మరి ఈ డబ్బు ఎవరు తీసినట్లు?

రమణి నావంక చూసిన చూపునకు అర్థం ఏమిటి...?

ఆ సంఘటన ఇంకా పూర్తిగా మరిచి పోకముందే మరొకటి...

చెవిపోగులు తీసి టేబిల్ మీద ఉంచి తలంటుకునేందుకు బాత్‌రూంలోకి వెళ్లాను.

బాత్‌రూంలోనుండి వచ్చిన వెంటనే పోగులు చూసుకోడం మరిచిపోయాను. సాయంత్రం చూసుకునేప్పటికి పోగులు లేవు.

వెదికి వెదికీ ఎవ్వరినీ అడిగేందుకు ధైర్యం చాలక మౌనంగా ఉండిపోయాను.

ఇలాంటివే చిన్న చిన్న దొంగతనాలు సర్వసామాన్యమైపోయాయి ఇంట్లో. దొంగతనం జరిగిన ప్రతిసారీ జానకమ్మ డాక్టరుగారు ఇంట్లో లేకుండా చూసి పిల్లినీ, ఎలుకనూ తిడుతూనే ఉంటుంది.

ఈ పిల్లల్ని చూస్తుంటే నాకు చాలా విచిత్రంగా వుంటుంది.

రమణి ప్రవర్తన...ఆ పిల్ల నాపట్ల ప్రదర్శించే అకారణ ద్వేషం, వైరం, రోజురోజుకూ భరించరానిదవుతూంది.

రమణిని చూస్తుంటే నాకు ఇప్పుడు ఆశ్చర్యంతో పాటు భయం కూడా పట్టు కుంది.





తన కాలేజీ పాఠాలతన్నా నన్నూ, నా ప్రతి కదలికనూ భూతద్దాల నుండి పరిశీ లించి ద్వేషించడమే తన ముఖ్యమైన పనిగా పెట్టుకుంది. తన తండ్రిని వల్లో వేసుకుని తన తల్లి స్థానంలో సుఖపడి పోతున్నానని ఆ పిల్లకు నన్ను చూస్తే ద్వేషం...అసూయ.

ఈ కారణంగా ఎప్పుడూ చిరచిర లాడుతూ ఆడపిల్లకు స్వభావసిద్ధంగా ఉండాల్సిన మార్దవాన్నే కోల్పోతోంది..

రమణికి ఈ విషయం ఎలా తెలియ పరచడం...?

అక్కను అనుసరిస్తున్నారు మిగిలిన ఇద్దరు పెద్ద పిల్లలు.

పదిహేనేళ్ళ మణి ప్రపంచంలోని మొండితనాసికంతా వారసురాలుగా తయా రవుతోంది.

నేను తన సవతి తల్లిని కాబట్టి ఏదో విధంగా నన్ను బాధపెట్టడమే తన ధ్యేయంగా పెట్టుకుందా పిల్ల.

తానేం చెప్పినా అందరూ నమ్ముతారు; సానుభూతి కురిపిస్తారు. ఆ విషయం మణికి బాగా తెలుసు.

చిట్టి అమాయకురాలు...ఎవరేం చెబితే అదే నమ్మే చిన్నపిల్ల. అందరూ నన్ను గురించి చెడుగా చెప్పడం చేతా, 'సవతి తల్లి' బూచిని చూపి భయపెట్టడం చేతా తన పెద్ద పెద్ద కళ్ళతో అమాయకంగా నన్ను పరిశీలిస్తుంటుంది.

ఇప్పుడు అక్కలాగే పిల్లలిద్దరూ నన్ను "ఆంటీ" అని పిలవకుండా ఎంతో అవసరం అయితే "ఇదిగో", "నువ్వు" అంటున్నారు. కారణం ఏమైనా కావచ్చు. ఈ పిల్లలు నా ప్రాణం...

వీళ్ళు ఉజ్జ్వలమైన భవిష్యత్ పొందా లని కోరుకునేవాళ్లల్లో నేను ప్రథము రాల్ని.

కానీ... దురదృష్టవశాత్తూ వీళ్లకు నేనేమీ కాను.

ఇంట్లో పనేమీ లేదు. ఒకటే ఆలోచనలు.

అంతా కలిసి నన్ను వెలివేసినట్లుగా ఏ పనిలోనూ చెయ్యి పెట్టనివ్వరు.

డాక్టరుగారు ఇంట్లో ఉన్నంతసేపే నేనా ఇంటి మనిషిని. ఆయన బయటికి అడుగు పెడితే నేనా ఇంటికి ఏమీ కాని అనామకురాల్ని; ఏదో తెలిసినదాన్ని.

ఇదీ...నా పరిస్థితి.

చిన్ని ఫ్రాక్ మీద ఎంబ్రాయిడరీచేస్తూ కూర్చున్నాను.

డాక్టరుగారు గదిలో ఏదో చదువుకుంటున్నారు.

రమణి గదిలో అవీ, ఇవీ గిరాటు కొడుతూ హడావిడి పడుతోంది. జానకమ్మ కూడా రమణితో ఏదో గుసగుసగా మాట్లాడుతూ అక్కడే తచ్చాడుతోంది.

అదేమిటో అర్థం కాలేదు.

"ఫీజు కడదామని పొద్దుట ఇక్కడ పైన వందరూపాయలూ ఏమయ్యాయి?" డ్రెస్సరు మీద పెట్టిన వస్తువులన్నీ చిందరవందరంగా విసిరికొడుతూ రంకెలు వేసింది రమణి.

'రమణి తల్లీ! ఇంట్లో పెట్టిన డబ్బు ఎక్కడికి పోతుందే అమ్మా! నా పెట్టి చూసుకోవే అమ్మా ... ఇంటిదొంగను ఈశ్వరుడైనా పట్టలేడని ఊరికే అనలేదు మరి.' సన్నాయి నొక్కులు నొక్కుతూ అంది జానకమ్మ అదీ ఇదీ వెతుకుతూ.

"....ఛ...నువ్వూరుకో పెద్దమ్మా! నిన్నేమనుకుంటానూ...?"

"మ్మా య్...డబ్బు పాపిష్టిదే తల్లీ! ఇక డబ్బుకోసం నానా గడ్డీ కరిచేవాళ్ళ సంగతి వేరుగా చెప్పాలా....? ఎవరి జాగ్రత్తల్లో వాళ్లుండటం మంచిదే తల్లీ... ఇవ్వాళ వందైంది రేపు వెయ్యి అవుతుంది. ఎవరు చెప్పగలరు?"

జానకమ్మ పరోక్షంగా ఎవరిని సాధిస్తోందో అర్థం అయ్యింది.

రమణి రుసరుసలాడుతూ వస్తువులన్నీ విసిరికొడుతూ వెదుకుతోంది.

"ఛ....ఛ... మనిషన్నాక నీతీ, నిజాయితీ ఉండాలి. అడ్డమైన గడ్డీ కరిచి సంపాదించిన డబ్బు ఎంత కాలం ఉంటుంది...? వందరూపాయల కోసం ఇన్ని అనిపించుకునేందుకు మానాభిమానాలుండాలి..."

"ఆంటీ... ఆంటీ...." అంటూ నా చుట్టూ చుట్టూ తిరిగిన పిల్లేనా ఈపిల్ల.... "ఆంటీ నాకు భయం వేస్తోంది" అంటూ దోసిట్లో ముఖందాచుకుని ఏడ్చిన రమణేనా ఈ రమణి...

"అయినా అడ్డమైన వాళ్ళనూ ఇంట్లో చేరిస్తే ఇల్లు ఇంతకంటే బాగా ఎలా ఉంటుంది....."

"రమణీ! ఎందుకమ్మా అలా నోరు పారేసుకుంటావు...? ఈ ఇంట్లో బయట వాళ్ళెవరున్నారు? డబ్బు ఎక్కడ పెట్టావో జాగ్రత్తగా వెదుకు.." రమణి వాచాలత్వం అప్పటికి ఎంత సేపటిగానో వింటూ భరిస్తూ వచ్చిన డాక్టరుగారు కోపం దిగమింగుతూ శాంతంగా అన్నారు గది బయటికి వచ్చి.

"ఎక్కడ వెదకను డాడీ..,.? అది చేరవలసిన చోటికే చేరినప్పుడు వెదికితే మాత్రం దొరుకుతుందా మన పిచ్చిగానీ"

"రమణీ...మనస్సులో ఏదో పెట్టుకుని అందరి మనస్సూ బాధ పెట్టడం మంచిది కాదు. ఆంటీ మనకోసం ఎంత చేసిందో

నీకూ తెలుసు..."

"మీరు ఉండండి డాడీ .... ఆవిడ మీకేదో మందుపెట్టి ఉంటుంది. కుక్కను సింహాసనం ఎక్కించినట్లు మీరు ఆవిడకు ఇల్లంతా అప్పగించితే, ఆవిడగారేమో ఇల్లంతా ఆయనగారికి దోచి పెడుతోంది. ఛీ...ఛీ...నీతీ జాతీ లేనిమనుషులు...."

ఒక్కసారిగా రమణి చెంప ఛెళ్లుమంది...

రమణి దిమ్మెరపోయింది దెబ్బతో... నక్షత్రాలు కనిపించి వుంటాయి.

డాక్టరుగారు మరో దెబ్బ వేసేందుకు చెయ్యెత్తారు-

నేను ఆలస్యం చెయ్యకుండా ఆయన చెయ్యి పట్టుకున్నాను గట్టిగా.

ఆయన ఒక్కసారి తెలివి తెచ్చుకున్నట్లుగా చెయ్యిదించి గబగబా గదిలోకి వెళ్లిపోయారు.

రమణి నా వంక నిరసనగా ఓ చిన్నచూపు విసిరి విసవిసా నడిచి మరో గదిలోకివెళ్లి తలుపులు వేసుకుంది.

ఆవేళంతా అటు తండ్రిగానీ, ఇటు కూతురుగానీ గది తలుపులు తియ్యనేలేదు.

జానకమ్మ, మణి పుణ్యమా అంటూ ఆ సాయంత్రానికల్లా వీధి వీధంతా మారుమోగింది-

"డాక్టరుగారు ముద్దుల పెళ్ళాం మాటలువిని పిల్లల్ని చావబాదుతున్నారట'' అని.

* * *

మరుసటిరోజు సాయంత్రం ఆయన రిజర్వేషన్ టికెట్ ఒకటి జానకమ్మ చేతికి యిస్తూ, ''రేపు పదిగంటలబండికి మీకు టికెట్ రిజర్వేషన్ చేయించాను. ప్రయాణం కండి'' అనిచెప్పి గదిలోకి వెళ్ళిపోయారు.

ఆయనచర్య నాకు ఆశ్చర్యాన్నీ,అంతకంటే ఎక్కువ ఆమోదాన్నీ కలుగచేసింది.

జానకమ్మ మొదట తెల్లబోయింది.

ఆ తరువాత అవమానంతో, కోపంతో ఆమె ముఖం ఎర్రబడింది.

నిప్పులుకక్కే కళ్ళతో నావంకచూస్తూ మెటికలు విరిచింది. నాకు హాయిగా నవ్వాలనిపించింది.

జానకమ్మ చేతిలో టికెట్ ఉంచి గదిలోకి వెళ్ళి తలుపు వేసుకున్న డాక్టరుగారు ఆ రాత్రికిక తలుపు తియ్యనేలేదు.

ఉదయంలేస్తూనే టిఫిన్ అయినా చెయ్యకుండా హాస్పిటల్‌కు వెళ్ళిపోయారు

రమణి చెల్లెళ్ళిద్దర్నీ హడావిడిచే స్నానంచేయించి, తలదువ్వి జడం వేసింది.

హడావిడిగా భోజనాలు కానిచ్చారు.

ఈ హడావిడి అంతా దేనికో నాకు అర్థంకాలేదు.

తొమ్మిదిన్నర అయ్యేప్పటికల్లా జానకమ్మతోపాటుగా పిల్లలు ముగ్గురూ బ్యాగ్స్‌తోసహా ప్రయాణానికి సిద్ధపడ్డారు.

"చిన్నీ... మేం ఊరెడుతున్నాం. నువ్వూ వస్తావా?" అంది మణి.

"అమ్మా, నేనూ వస్తాం" అంది చిన్ని.

చూస్తున్న నేను ప్రమాన్పడిపోయాను.

"చిట్టీ... ఎక్కడికి ప్రయాణం? ఆతృతగా అడిగాను.

"మా పెద్దమ్మతో వెళ్ళిపోతున్నాం"

"రమణీ! నాన్నగారికి చెప్పకుండా వెళితే బాధపడతారు" అన్నాను గొంతు పెగుల్చుకుని.

"బాధ ఎందుకూ? మేం లేకపోతే

మీకింకా సంతోషమేగా. మేం మీకు అడ్డమైపోయాం"

"ఏం మాటలు రమణీ..మీరు వెళితే నాన్నగారు ఎంత బాధపడతారో నీకు తెలీదూ?"

"ఇప్పుడు నాన్నగారికి కావల్సింది మేం కాదు....నువ్వు. నువ్వుంటే చాలు- మేం లేకపోయినా బాధపడరు"

"రమణీ..."

"అవును. మా నాన్నగార్ని వల్లో వేసుకున్నావు. ఆయనకు నీ మాటే వేదం. ఇవ్వాళ మా కోసం మమ్మల్ని చూడ్డానికి వచ్చిన మా పెద్దమ్మను వెళ్లగొట్టిస్తున్నావు. రేపు మమ్మల్ని వెళ్ళగొట్టిస్తావు. పెత్తనం అంతా నీదేగా"

"మీ పెద్దమ్మగారికి టికెట్ తెచ్చినట్లు నాకు తెలీదు రమణీ...డాక్టరుగారు నాకు చెప్పలేదు"

"నీకేమీ తెలీదు. నంగనాచివి పాపం"

రమణి మాటల్లో తన అక్కసునంతా కక్కుతోంది. ఇక ఏం చెప్పి, ఎంత బతిమాలీ ఆ పిల్లల్ని ఆపలేనని తెలుసుకుని మౌనంగా ఉండిపోయాను.

రైళ్లో కూర్చునే వరకూ జానకమ్మ నన్ను తిడుతూనే ఉంది. వీళ్ళకు నేను చేసిన అన్యాయం ఏమిటి?

* * *

వైవాళ్లు చెప్పే ఖర్మ సిద్ధాంతలో నిజానిజాలను సిద్ధాంతీకరించే ఆలోచన నాకు లేకపోయినా నా ఈ దుస్థితికి కారణంగా ఖర్మే అని ఇప్పుడు పూర్తిగా నమ్ముతున్నాను.

అదృష్టం.. దురదృష్టం.. ఖర్మ ... ఇవన్నీ ఒకప్పుడు నాకు అర్థం లేని మాటలుగా వినిపించేవి.

'ఖర్మ' 'అదృష్టం', 'దురదృష్టం' అంటారు ఆస్తికులు. 'పరిస్థితులు' అంటారు నాస్తికులు.

ఎవరు ఏదన్నా భవిష్యత్తు మనకు అందకపోవటమనేదే నిజం.

పగలూ,రాత్రీ మత్తు...మత్తు...మత్తు. మత్తులో మునిగిపోతున్న డాక్టరుగార్ని చూస్తుంటే నాకు భయం, బాధ, జాలి, వేదన...

"సౌమ్యా...సౌమ్యా...సౌమ్యా"

నా మెదడులో ఏదో కదలిక.

నా మనస్సు తన చుట్టూ వున్న ఆలోచనా క్షేత్రాన్ని ఛేదించుకునేందుకు ఇష్టపడనట్లు స్తబ్ధంగా ఉండిపోయింది.

"సౌమ్యా...సౌమ్యా" తిరిగి ఏదో పిలుపు.

తలఎత్తి నిశ్శబ్దంగా, నిరాసక్తంగా చూశాను.

ఎదురుగా మౌళి.

అయోమయంగా, నిద్రావస్థలోలా అతన్ని చూస్తూ అలాగే కూర్చుండిపోయాను. అతన్ని ఆహ్వానించాలనే విషయం గాని, కూర్చోమనాలనే జ్ఞానం గాని నాలో లేదు.

మౌళి ఒక కుర్చీ దగ్గరగా జరుపుకుని కూర్చున్నాడు.

"సౌమ్యా. "

"ఊఁ..."

"ఏం జరిగింది?"

"ఆఁ...."

"సౌమ్యా....ప్లీజ్! ఏం జరిగింది? ఏమిటి అలా ఉన్నారు?"

అతని ఆత్మీయమైన పరామర్శ నా గుండెను తాకింది.

స్పృహ తెలిసింది.

"బాగానే ఉన్నానుగా.?'' అంటూ నవ్వాను.

కానీ నా కళ్ళల్లో చివ్వున నీళ్ళు చిమ్మాయి.

అతని ముందు ఏడవడం ఇష్టంలేదు. కానీ కన్నీళ్ళు ఆగడంలేదు.

ముఖం తిప్పుకుని అలా చాలా సేపు ఏడుస్తూండిపోయాను.

నన్నెలా ఓదార్చాలో తెలీనట్లూ, మాటలే కరువైనట్లూ మౌళి మౌనంగా దిగులుగా నావంక చూస్తూండిపోయాడు.

కొంత సేపటికి నన్ను నేను కంట్రోల్ చేసుకునేందుకు ప్రయత్నిస్తూ చెంగుతో ముక్కూ, మొహం గట్టిగా తుడుచుకుని కూర్చున్నాను.

"సౌమ్యా! డాక్టరుగారు ఉన్నారా?"

"ఉన్నారు... కానీ స్పృహలో లేరు"

ఇద్దరం ఆయన గది ముందుకెళ్ళాం. తలుపులు దగ్గరగా వేసి ఉన్నాయి.

తలుపులు నెమ్మదిగా నెట్టుకుని లోపలికి వెళ్ళాం.

ఎప్పటిలా డాక్టరుగారు మత్తులో అస్తవ్యస్తంగా మంచంమీద పడుకుని ఉన్నారు.

లోతుకు పోయిన బుగ్గలమీద పెరిగిన తెల్లటి గడ్డం మురికిగా వుంది. మనిషి దాదాపుగా శవంలా కనిపిస్తున్నారు చిక్కిపోయి.

మౌళి బరువుగా నిట్టూర్చాడు.

అతని ముఖం దిగులుతో, అశక్తతతో భారంగా వుంది. అప్పటి అతని ముఖం చూస్తున్న నాకు అనిపించింది-

నా కష్టాలూ, కన్నీళ్ళతో ఇతన్ని అనవసరంగా బాధ పెడుతున్నానేమో.

ఇద్దరం బయటికి వచ్చాం.

నేను గది తలుపులు దగ్గరగా వేశాను.

మౌళి చాలా సేపు మౌనంగా ఉండిపోయాడు.

"సౌమ్యా! నువ్వు మళ్ళా జాబ్‌లో చేరకూడదూ?" హఠాత్తుగా అన్నాడు మౌళి.

నేను తెల్లబోయాను.

నేను జాబ్ మానేసిన తరువాత ఇక దాన్ని గురించి ఒక్క క్షణం కూడా ఆలోచించలేదు.

"ఇప్పటి నా సమస్య జాబ్ గురించి కాదు..."

"మరోలా అనుకోకు... నీ కాళ్ళ మీద నువ్వు నిలబడగలిగే జాబ్ ఉండటం ఎప్పటికైనా నీకు మంచిది"

నాకు అర్థం కాలేదు...

పిల్లలు అలిగి వెళ్ళిపోడానికి, ఆయనలా పగలూ, రాత్రీ మత్తులో కూరుకుపోడానికీ, నా జాబ్‌కూ ఏమిటి సంబంధం.?

స్కూలు వదిలినట్లున్నారు...

చిన్ని పరుగెత్తుకుంటూ వచ్చి, "మమ్మీ" అంటూ నన్ను చుట్టివేస్తూ, "గుడీవినింగ్ అంకుల్..." అంటూ మౌళిని విష్ చేసింది.

కాఫీ తీసుకుని మౌళి వెళ్ళొస్తానని లేచాడు.

* * *

పిల్లలు వెళ్ళి మూడు నెలలపైన గడిచిపోయింది.

డాక్టరుగారు రాసిన ఉత్తరానికి కనీసం జవాబైనా రాకపోతే ఒకసారి వెళ్ళి ఒక్కరే తిరిగివచ్చారు.

పిల్లలు రావడానికి ఇష్టపడలేదట. డబ్బు ఇచ్చివచ్చారు.

అక్కడేం జరిగిందో ఆయన నాకు చెప్పలేదు. "పిల్లలు రావడానికి యిష్టపడలేదు సౌమ్యా" అని మాత్రం అన్నారు.

 

అక్కణ్నించి వచ్చిన తరువాత డాక్టరుగారు మానసికంగా మరింత కృంగిపోయారు.

ఆయనకు పిల్లలంటే ప్రాణం.

పగలూ, రాత్రీ మత్తులో మునిగి తన బాధను మరిచిపోయేందుకు ప్రయత్నిస్తున్నారు.

ఆసారి డాక్టరుగారు వరుసగా రెండు రోజులు మత్తులోనుండి తేరుకోలేదు.

అలా అంతక్రితం ఒకటి రెండుసార్లు జరిగినా ఈమధ్య మరీ నీరసించి పోవడంతో ఆయన పరిస్థితి ప్రమాదంగా కనిపిస్తోంది.

భయంతో నా కాళ్ళూ చేతులూ ఆడలేదు.

మౌళికి కబురు పెట్టాను. వచ్చాడు.

"మౌళీ! డాక్టరుగారు రెండురోజులుగా లేవడంలేదు" భయంగా చెప్పాను.

"ఏం జరిగింది?"

"ప్రత్యేకంగా ఏమీలేదు. రెండు రోజులుగా మత్తులోనుండి తెలివి రావడం లేదు"

మౌళి వెళ్లి పిలుచుకువచ్చిన డాక్టరు శర్మగారు పరీక్షచేసి ఇంజక్షన్ చేశారు.

నేను దిగులుగా చూస్తూ నిలబడ్డాను

"సౌమ్యా! డాక్టరుగారు మరీ నీరసించిపోయారు" అన్నారు డాక్టర్ శర్మగారు నిరాశను ధ్వనిస్తూ.

నేనేమీ సమాధానం చెప్పలేకపోయాను.

నా కళ్లల్లో నీళ్లు చిమ్మాయి.

డాక్టర్ శర్మగారికి మా కుటుంబ విషయాలన్నీ తెలుసు. పిల్లలు అలిగి జానకమ్మతో వెళ్ళిపోవడం కూడా ఆయనకు తెలుసు.

మౌళి, డాక్టర్ శర్మగారూ, నేనూ డాక్టరుగారి గదికి ముందు గదిలో కూర్చున్నాము.

ముగ్గురి ముఖాల్లోనూ చెప్పలేనిబాధ, నిస్సహాయత...

"మౌళీ! పిల్లలు రాందే డాక్టరు మళ్ళీ మామూలు మనిషికాడయ్యా"

"ఏం చేద్దామంటారు డాక్టర్?"

డాక్టరుగారు సాలోచనగా తల పంకిస్తూ మౌనంగా ఉండిపోయారు.

"డాక్టర్ ...'ఫాదర్ సీరియస్ స్టార్ట్ ఇమ్మీడియట్లీ' అని టెలిగ్రాం ఇస్తే" అన్నాను.

"అలాగే చెయ్యి సౌమ్యా" అన్నారు డాక్టరుగారు.

"టెలిగ్రాం నేను ఇస్తే వాళ్ళు రావాలనుకున్నా రాదు డాక్టర్" అన్నాను అభిమానంగా.

పిల్లలకు నేనంటే అయిష్టం, అసహ్యం, కక్ష అని నానోటిమీదుగా నేనే చెప్పాల్సి రావడం....ఓహ్...

ఏం చేద్దామన్నట్లుగా డాక్టర్‌శర్మగారు మౌళి వైపు చూశారు.

"సౌమ్యా ! ఎందుకిలా జరిగింది? పిల్లలు నువ్వంటే చాలా ప్రేమగా ఉండేవాళ్లుగా"

నా ముఖం మ్లానమైంది.

కారణం ఏమని చెప్పను? రమణి అసూయ అని చెప్పనా? జానకమ్మ ప్రోద్బలం అని చెప్పనా?

"ఇదంతా నా దురదృష్టం డాక్టర్" అన్నాను గొంతు పెగుల్చుకుని.

"మరిప్పుడు ఏం చెయ్యాలనుకుంటున్నారు?"

"పోనీ డాక్టరుగారూ... పిల్లలకు మీరు ఇచ్చినట్లుగా టెలిగ్రాం ఇవ్వండి.తండ్రికి బాగులేదని తెలిసి వస్తారు"

"అలాగే...అలాగేఇస్తాను టెలిగ్రాం"

"థాంక్యూ డాక్టర్" మౌళీ, నేను ఒకేసారి అన్నాము.

"థాంక్సెందుకయ్యా... పిల్లలు వచ్చి పరిస్థితి బాగుపడితే చాలు"

నిండు మనస్సుతో అన్నారు డాక్టర్ శర్మగారు.

"మౌళీ! ఇక నేను వెళ్ళొస్తాను అలా. పోస్టాఫీసుకు వెళ్ళి టెలిగ్రాం ఇస్తాను. అడ్రసు ఇవ్వండి" అన్నారు.

నేను పాత ఉత్తరాలూ అవీ ఇవీ వెదికి అడ్రసు తెచ్చి డాక్టరుగారికిచ్చాను.

డాక్టర్ శర్మగారు డాక్టరుగార్ని మరోసారి పరీక్ష చేసి మరో ఇంజక్షన్ చేశారు.

"సౌమ్యా! డాక్టరుకు స్పృహ వస్తూనే తేలికగా వుండే డైట్ ఇవ్వు"

"అలాగే డాక్టర్"

డాక్టర్ శర్మగారు అడ్రసు కాగితం జేబులో పెట్టుకుని వెళ్ళిపోయారు.

మౌళీ, నేనూ మిగిలిపోయాం.

గదిలో సమాధిస్థితిలోడాక్టరుగారూ...

మాటలురాని, మాట్లాడలేని మూగ వేదన...

మౌనాన్ని బేధించి అక్కడి వాతావరణంలో చైతన్యం సృష్టించగలిగే సమర్థత ఇద్దరిలో ఒక్కరికి కూడా లేదు.

కానీ మా అంతరంగాలు మాత్రం బాహ్య వాతావరణం అంత స్థిమితం గానూ, స్తబ్దంగానూ లేదు.

కల్లోల కడలిలా హృదయం ఘూర్ణిల్లు తోంది.

దుఃఖం, నిస్సహాయతా, ఆవేదనా అగ్నిపర్వతాల్లా గుండెను కుమిలిస్తు న్నాయి.

"సౌమ్యా! ధైర్యంగా ఉండు" అన్నాడు మౌళి చివరికి గొంతు పెగుల్చు కుని.

నేను నవ్వాను... కానీ నా కళ్ళల్లో కన్నీళ్ళు చిందాయి.

ఏం చూసుకుని ధైర్యంగా ఉండను? ఎవరి ఓదార్పుతో ధైర్యంగా ఉండను?

"అలాగే" అన్నాను కన్నీళ్ళు మింగుతూ.

మౌళి దిగులుగా చూశాడు నా వంక.

మరి కాసేపు కూర్చుని మౌళి, "మళ్ళీ ఉదయం వస్తాను సౌమ్యా" అంటూ వెళ్ళిపోయాడు.

* * *

ఉదయం మౌళి, డాక్టర్ శర్మగారు వచ్చారు.

వాళ్ళు వచ్చేప్పటికి డాక్టరుగారు స్పృహలోనే ఉన్నారు. పడుకునే కళ్ళు తెరుచుకుని చూస్తున్నారు.

"గుడ్‌మార్నింగ్ డాక్టర్... ఎలా ఉన్నారు.?"

డాక్టర్ శర్మగారు, మౌళి డాక్టరు గారి మంచం పక్కనే కుర్చీలలో కూర్చుంటూ అడిగారు.

డాక్టర్‌గారు 'గుడ్‌మార్నింగ్' అన్నట్లుగా నవ్వారు.

కానీ అది నవ్వులాలేదు. కొండగట్టిన దీపం వెలుగులా నిర్జీవంగా, కాంతిహీనంగా వుంది.

మితిమీరిన నీరసంతో ఆయన మాట్లాడలేకపోతున్నారు.

ఊరికే కళ్ళు తెరుచుకుని చూస్తు న్నారు... అంతే!

"డాక్టరుగారూ! మీరింత పిరికివారని అనుకోలేదు. సమస్య వచ్చినప్పుడు ధైర్యంగా నిలబడాలిగానీ, ఇలా మత్తులో మునిగి సమస్యను ఎంతకాలం మరచిపో తారు?" డాక్టర్ శర్మగారు మంద





లిస్తున్నట్టుగా అన్నారు.

ఆయన మౌనంగా వింటున్నారు.

ఆ కళ్ళు శూన్యంలోకి చూస్తున్నాయి. వాటిలో జీవంలేదు.

"మీరు మత్తులో మునిగి మీ బాధల్ని మరిచిపోవాలనుకుంటున్నారు. ఆమెకూడా మీలాగే ఏదో మత్తును ఆశ్రయించి తన దుఃఖాన్ని మరిచిపోతే ఈ ఇల్లూ, ఈ పిల్లలూ ఏమవుతారో ఆలోచించండి" మౌళి అన్నాడు.

డాక్టరుగారు తన బలహీనమైన చెయ్యి ఎత్తి మౌళి చెయ్యి పట్టుకున్నారు బలహీనంగా ... 'అలా అనవద్దు' అన్నట్టుగా.

"డాక్టరుగారూ ! మీరిలా అయితే సౌమ్యకు ధైర్యం చెప్పేవాళ్ళెవరున్నారు? ఎటూ ఏ అండాలేనిది. మిమ్మల్ని నమ్ము



కుంది. ఒక్కసారి ఆమె వైపు చూడండి. ఆమె చేసిన ఏ నేరానికిగాను ఆమెకీ శిక్ష?"

మౌళి గొంతు క్రమంగా విషాదం నింపుకుంది.

డాక్టరుగారి కళ్ళల్లో నీళ్ళూరాయి.

నాకూ దుఃఖం ఆగలేదు.

ఆయన నన్ను దగ్గరగా రమ్మన్నట్టు సౌంజ్ఞ చేశారు. చిన్నితో పాటుగా నేను ఆయన దగ్గరగా నడిచాను.

ఆయన నా చేతిని తనచేతిలోకి తీసుకుని మౌళి చేతిలో పెట్టేందుకు శ్రమ పడుతున్నారు.

"వద్దు...వద్దు. ఈ అప్పగింతలు కాదు నాకు కావల్సింది. మీరు ఆరోగ్యంగా ఉండటం నాకు కావాలి. ఇంక మీరెప్పుడూ ఈ మత్తు ఇంజక్షను తీసుకోనని నాకు ఒట్టు వేయండి"

ఆయన మీద పడి గట్టిగా ఏడ్చేశాను దుఃఖం ఆపుకోలేక. ఆయన నా తల

నిమురుతూ ఉండిపోయారు మౌనంగా.

"డాక్టరుగారూ! పిల్లలు చూస్తే చిన్నవాళ్లు. అందునా ఆడపిల్లలు. ఈ అయిదుగురు ఆడవాళ్ళకూ మీ అండ ఎంత అవసరమో మీకు తెలీడంలేదా? మీరిలా మంచంపడితే వాళ్ళ గతేంకాను?"

డాక్టర్ శర్మగారు ఆయన్ను పరీక్ష చేసి ఇంజక్షన్ ఇస్తూ అన్నారు.

నేను లోపలికి వెళ్లి డాక్టర్ శర్మ గారికీ, మౌళికీ కాఫీ...

డాక్టరుగారికి సగ్గు బియ్యం పాయసం తెచ్చాను.

ఆయన లిక్విడ్‌గా ఉన్న ఆహారం తప్ప మరొకటి తీసుకోలేకపోతున్నారు మితిమీరిన నీరసంవల్ల.

ప్రతి అరగంటకూ, గంటకూ గ్లూకోజ్‌తోపాటు తేలికగా జీర్ణమయ్యే లిక్విడ్ డైట్ ఇస్తున్నాను.

ఆయన్ను దిండుకు ఆన్చి కూర్చొబెట్టి ఒక్కొక్క స్పూనే పాయసం పట్టించాను.

ఆయన కొంచెం తెప్పరిల్లినట్లుగా కనిపించారు.

మళ్ళీ మరొకసారి మార్ఫియా ఇంజక్షన్ తీసుకోవద్దని హెచ్చరిస్తూ డాక్టర్ శర్మగారు వెళ్లిపోయారు.

మౌళి మరికాసేపు డాక్టరుగారితో గడిపి 'వెళ్లివస్తా'నంటూ చెప్పి వెళ్లిపోయాడు.

ఆ పగలంతా నేను డాక్టరుగారి మంచం పదలకుండా ఆయనను అంటిపెట్టుకునే కూర్చున్నాను - అవీ ఇవీ కబుర్లు చెబుతూ.

ఆయన మాత్రం మామూలుగా ఉన్నందుకు నాకెంతో సంతోషంగా



వుంది. ఆయనలా ఎప్పుడూ ఉంటే...

నేను చెప్పే కబుర్లు డాక్టరుగారు ఆసక్తిగా వింటున్నారు.

నా మాటల్లో ఎక్కువభాగం చిన్ని గురించే.

"సౌమ్యా! పిల్లలు ఇక రారుకదూ?" అన్నారు దిగులుగా.

"వస్తారు"

"నీకు తెలీదు సౌమ్యా! వాళ్లు రారు"

"అంత ఖచ్చితంగా ఎలా చెబుతున్నారు?"

డాక్టరుగారు కొన్ని క్షణాలు మౌనంగా వుండిపోయారు.

"నేను వెళ్లినప్పుడు రమణి ఖచ్చితంగా చెప్పేసింది-తాము రామని"

"ఎందుకట?"

డాక్టరుగారు మాట్లాడకుండా చూస్తూండిపోయారు నావంక.

"మీకో శుభవార్త చెప్పనా?" అన్నాను ఆయన్ను ఊరిస్తూ.

ఆయన నామీదనుండి చూపులు తిప్పకుండా 'ఏమిటి?' అన్నట్లుగా చూశారు.

"పిల్లలు వస్తున్నారు"

"నిజంగానా? ఎప్పుడు ... ఎప్పుడు సౌమ్యా?"

ఆయన గొంతులో ఆత్రుత... కళ్ళల్లో ఆశ.

"ఇప్పుడో ఇంకాసేపటికో రావచ్చు"

"నిజంగానా సౌమ్యా?"

"నిజంగా నిజం...సరేనా?"

"ఉత్తరం వచ్చిందా వస్తున్నట్లు?"

"లేదు. డాక్టర్ శర్మగారు నిన్న టెలిగ్రాం ఇచ్చారు"

ఆయన కళ్ళల్లో గొప్ప తృప్తి ... ముఖంలో రిలీఫ్.

పిల్లల్ని చూసుకుంటానుగదా అన్న సంతోషంతో పెదవులమీద ఉదయించిన

చిన్న చిరునవ్వు.

చాలు...ఆ నవ్వు చాలు నా గుండె నిండిపోయింది.

అనుకున్నట్లుగానే రమణి, మణి, చిట్టి ఆ మధ్యాహ్నం ట్రైనుకు వచ్చారు.

పిల్లలు ముగ్గురూ తండ్రి మంచం చుట్టూ కూర్చుని ఏడుస్తుంటే నాకూ కన్నీళ్ళు ఆగలేదు.

పిల్లల్ని దగ్గరకు తీసుకున్న డాక్టరు గారి ముఖంలో ఆనందం...

"పిచ్చితల్లులూ... ఇప్పుడేమయింది? ఎందుకేడుస్తున్నారు?" అన్నారు వాళ్ళ వంక ప్రేమగాచూస్తూ.

"డాడీ... మీరు ... మీరెలా అయి పోయారు" అంది రమణి కళ్ళు తుడుచు కుంటూ.

"మీరు వచ్చేశారుగా అమ్మా! ఇక నేను ఆరోగ్యంగా ఉంటాను. హాయిగా హాస్పిటల్‌కు వెడతాను ... క్లబ్బుకు వెడతాను..."

డాక్టరుగారు సంతోషంగా మాట్లాడు తున్నారు.

పిల్లలకు స్నానం, భోజనం ఏర్పాట్లు చూడ్డానికి నేను వంటగదిలోకి వచ్చాను.

వాళ్ళమాటలు వంటగదిలోకి స్పష్టంగా వినిపిస్తున్నాయి.

"డాక్టర్ శర్మగారు ఇచ్చిన టెలిగ్రాం చూసి భయంతో గజగజలాడిపోయాం డాడీ...చిట్టి అయితే ఒకటే ఏడుపు. దాన్ని ఊరుకోబెట్టలేకపోయాం..."

డాక్టర్‌గారు మౌనంగా వింటున్నారు. పిల్లలకు తన మీద ఉన్న ప్రేమకు ఆయన పితృ హృదయం ఆనంద పర వశం చెందుతున్నట్లుంది.

"చూశారా డాడీ... మీకిలా వుంటే కనీసం ఆవిడగారు టెలిగ్రాం అయినా ఇవ్వలేదు"

"రమణీ! ఆంటీ చెబితేనే శర్మగారు టెలిగ్రాం ఇచ్చారమ్మా"

"అసలు ఆవిడకు మేం రావడం ఇష్టం లేదు డాడీ"

"తప్పమ్మా! ఆంటీ మీ కోసం ఎంతో ఎదురుచూసింది"

"మీరెప్పుడూ ఆమెనే సమర్థిస్తారు"

"రమణీ! మీరందరూ ఉంటే నాకెంతో ఆనందంగా ఉందిరా. ఇప్పుడు ఇల్లు కళకళలాడుతోంది. నాకు వెయ్యి ఏనుగుల బలం వచ్చినట్లుందిరా. చిట్టీ... ఇలారా అమ్మా....నా దగ్గరగా కూర్చో"

"ఈ రాక్షసి లేకపోతే మనం హాయిగా ఉండవచ్చు డాడీ"

డాక్టరుగారు గాఢంగా నిట్టూర్చారు.

"రమణీ! ఆంటీ ఏం చేసిందనమ్మా మీకంత కోపం?"

"ఏమో డాడీ....ఆమె అంటే నాకు అసహ్యం"

"మీ అమ్మ చచ్చిపోయినప్పుడూ, చిన్నికి జబ్బు చేసినప్పుడూ మననెంతగా ఆదుకుంది? తను అన్ని సుఖాలూ ఒదులు కుంది మనకోసం కాదూ?"

"ఆవిడ మనకోసం ఏం చెయ్యలేదు డాడీ! అవన్నీ ... అన్నీ ఒక ప్లాన్ ప్రకారం చేసి ఈ ఇంట్లో స్థానం సంపా దించుకుంది. ఇంటికి యజమానురాలు అయ్యింది..."

"యజమానురాలు అయి తనేం బావు కుంది రమణీ ... పోనీ ... ఇకనుండి ఇంటిపెత్తనం నువ్వే తీసుకో..."

నీరసంగా, దీనంగా ఉంది డాక్టరుగారి గొంతు. ఇంతకుముందు పిల్లల్ని చూసి నప్పుడున్న ఉత్సాహం లేదాయనలో.

"డాడీ! ఆమెను ఎక్కడికయినా

పంపించివేయండి"

"రమణీ! పూల్గా మాట్లాడకు. మన కోసం ఉన్న ఉద్యోగం కూడా ఒదులు కుంది. ఇప్పుడు వెళ్ళిపొమ్మంటే ఎక్కడికి వెళ్లిపోతుంది?"

"ఏదో నెలకి ఇంతని పారెయ్యండి డాడీ"

"షటప్...ఆమె ముష్టిది కాదు నెల కింత భిక్షం వేయడానికి. ఆమె లీగల్‌గా నా భార్య. ఈ విషయం నీకు ఆ ఊళ్ళోనే చెప్పాను.... ఎవరికిష్టం ఉన్నా లేక పోయినా నా శరీరంలో ప్రాణంఉన్నంత వరకూ ఆమె ఇక్కడ ఉండక తప్పదని"

డాక్టరుగారి గొంతు నీరసంగానే అయినా కోపంగా పలికింది. రమణికి నేనీ ఇంట్లో ఉండటం ఇష్టం లేదన్నమాట. దానికిగాను తండ్రి మీద వత్తిడితెస్తోంది. అందుకే ఆయనా ఊరువెళ్ళి వచ్చినప్పటి నుండీ మరింతగా కృంగి కృశించిపోతున్నారు...

మౌళి ఉద్యోగంలో చేరమని ఎందుకన్నాడో ఆ క్షణంలో బోధపడింది. ఏది ఏమయినా అసలే అంతంతమాత్రంగా ఉన్న ఆయన ఆరోగ్యానికి ఆవేశం ఎంత మాత్రం పనికిరాదు...

ఈ సంఘటనతో ఆయనెంతగా వ్యధ చెందుతారో నాకు తెలుసు.

ఈ పిల్ల ఇలాగే...ఇలాగే మాట్లాడుతూ పోతే...

ఈ సంభాషణ ఆపాలి...

నేను చప్పున బయటికి వచ్చాను. ఏదో అనేందుకు నోరు తెరిచిన రమణి నన్ను చూసి మౌనంగా ఉండిపోయింది— కోపంగా పెదవులు కొరుక్కుంటూ.

"రమణీ, మణీ, చిట్టీ! స్నానం చెయ్యండమ్మా. భోజనం చేద్దురుగానీ" అన్నాను.

రమణి విసురుగా ముఖం తిప్పుకుని లేచి లోపలికి వెళ్ళింది.

మళ్ళీ ప్రారంభమైంది ప్రచ్ఛన్న యుద్ధం...

డాక్టరుగారి వంక చూశాను...

ఆయన కళ్ళుమూసుకుని అశాంతిగా, అసహనంగా పక్కమీద కదులుతున్నారు.

ఆ ముఖంలో ఇంతక్రితం కనిపించిన జీవకళ, ఉల్లాసం లేదు. గబగబా లోపలికి వెళ్ళి ఆయనకోసం చేసి ఉంచిన 'ఖీర్' ఒక గిన్నెలో పోసి తెచ్చాను.

"ఒద్దు సౌమ్యా! ఆకలిగా లేదు" అన్నారు అయిష్టంగా.

నేను బలవంతంగా స్పూన్‌తో నోటికి అందించాను.

అలా ఒక్కొక్క స్పూనే పడుతూ ఆయన తలపగ్గర కూర్చున్నాను.

ఆ సాయంత్రం మౌళి డాక్టరుగార్ని చూసేందుకు వచ్చాడు.

అప్పటికి ఆ గదిలోనే కూర్చున్న రమణి ముఖం చిట్లించుకుంటూ వరండాలోకి వెళ్ళిపోయింది.

పేలవంగా, నిర్జీవంగా ఉన్న డాక్టరుగారి ముఖంచూస్తూ, "ఇదేమిటి ఇలా ఉన్నారు? ఉదయం కంటే కూడా డల్‌గా ఉన్నారే?" అన్నాడు ఆశ్చర్యంగా.

నేనేమీ మాట్లాడలేదు.

డాక్టరుగారు కళ్ళు తెరుచుకుని మౌళి వేపే చూస్తున్నా మౌళితో ఏమీ మాట్లాడ లేదు.

గదిలో ముగ్గురమున్నా నిశ్శబ్దమే చోటుచేసుకుంది.

తుఫాను ముందుటి ప్రశాంతతలా దుర్భరంగా వుందా నిశ్శబ్దం...

తుఫానుఅనంతరం కలిగిన ఘోరాన్ని

నిశ్శబ్దంగా చూస్తున్న ప్రకృతిలా ఉందా నిశ్శబ్దం.

కరిగించిపోసిన ఉక్కుదిమ్మలా మా మధ్య ఘనీభవించిందా నిశ్శబ్దం...

మౌళి మరి కాసేపలా డాక్టరుగారి దగ్గర కూర్చుని వెళ్ళేందుకు బయటికి వచ్చాడు. నేనూ మౌళిని అనుసరించి బయటికి వచ్చాను. రమణి అక్కడే కూర్చుని పుస్తకం చదువుతోంది.

"మౌళీ! నాకేదయినా ఉద్యోగం చూసి పెట్టగలరా?"

మౌళి నావంక ఆశ్చర్యంగా చూశాడు.

"ఇంట్లో ఉంటే మరీ బోర్ కొడుతోంది" అన్నాను తల దించుకుని.

మౌళి చూపులు తిప్పుకున్నాడు.

అతని ముఖం చాలా ఉదాసీనంగా ఉంది.

"చెప్పండి. నాకేదయినా జాబ్ చూసి పెట్టగలరా?"

"ఇప్పటికిప్పుడు జాబ్ అంటే ఎలా దొరుకుతుంది? ప్రయత్నించాలి"

"దయచేసి ప్రయత్నించండి. ఇప్పటి నుండీ ప్రయత్నిస్తే కొన్ని నెలలకయినా దొరక్కపోతుందా? ఈలోపు డాక్టరు గారు కూడా రికవర్ అవుతారు"

"డాక్టరుగారికి చెప్పారా?''

"తర్వాత చెప్తాను. ఆయన కాదనరు''

"సరే...ప్రయత్నిద్దాం''

''ప్రయత్నిద్దాం అంటే కాదు. త్వరగా వచ్చేలా చూడండి.''

"అలాగే" మౌళి నావేపు చూస్తూ అన్నాడు.

అతని కళ్ళు ప్రశ్నించకుండానే ఎన్నో ప్రశ్నలు వేస్తున్నాయి. కొన్ని నిముషాలు ఇద్దరిమధ్యా మౌనంగా దొర్లిపోయాయి.

"సరే...నేను వెళ్ళొస్తాను?" అంటూ మౌళి వెళ్ళిపోయాడు. రమణివంక చూశాను. ఆ అమ్మాయి ముఖం కళకళలాడుతోంది.

నేను వెళ్ళిపోతాను అనే విషయం కలిగించిన ఆనందం అది.

మూగగా ఆక్రోశించింది నా హృదయం.

* * *

వేసవికాలపు సాయంత్రం...

పగలంతా నిప్పులు చెరిగిన సూర్యుడు సాయంత్రానికి తన ప్రతాపాన్ని తగ్గించుకుని కారుణ్యాన్ని ప్రదర్శించుకుంటున్నాడు.

సాయంత్రం పని పూర్తిచేసుకుని, చిన్నికి స్నానం చేయించి నేనూ స్నానం చేసి ఆయన కోసం ఎదురుచూస్తూ కూర్చున్నాను.

వారం తరువాత ఆయన ఈవేళే హాస్పిటల్‌కు వెళ్ళారు. అదీ సగం మత్తులోనే. ఇంట్లో జరుగుతున్న గొడవల మూలంగా ఎవరి మనస్సులూ శాంతిగా, స్థిమితంగా లేవు.

ఆనందం కరువైన మనస్సులతో ఎడమొహం పెడమొహంగా భారంగా గడుస్తున్నాయి రోజులు.

"చిన్నీ! చిట్టీ, నేనూ, మా ఫ్రెండూ సినిమాకు వెడుతున్నాం. నాన్న అడిగితే చెప్పు" అంటూ రమణి చిట్టిని తీసుకుని వెళ్ళిపోయింది.

"ఇదిగో, నేను మా ఫ్రెండింటికి వెళ్ళి చదువుకుంటాను. నాన్న అడిగితే చెప్పు" గోడకు చెప్పినట్లుగా చెప్పి వెళ్ళిపోయింది మణి.

పిల్లలు నన్ను "ఆంటీ" అని పిలవడం మానుకుని చాలాకాలమైంది.

ఇల్లు నిశ్శబ్దంగా వుంది.

చిన్నీ, నేనూ మిగిలాం...ఆయనకోసం ఎదురుచూస్తూ.

చిన్ని పెరిగి పెద్దదయి పెళ్ళి చేసుకుని అత్తవారింటికి వెళ్ళిపోతే...

నేను నవ్వుకున్నాను.

"అమ్మా! ఎందుకు నవ్వుతున్నావు?" ఒళ్ళో కూర్చుంటూ గడ్డం పట్టుకుని ఊపుతూ అడిగింది చిన్ని.

"ఏమీలేదు. వూరికే" చిన్నిని ఎత్తుకుని గాఢంగా ముద్దు పెట్టుకున్నాను. అదే నేను చిన్నిని చేసిన ఆఖరి గారం. అదే చివరి ముద్దు...

భవిష్యత్ ఏమాత్రం ముందుగా తెలిసివున్నా, ఆరోజే నా చిన్నితో సహా ఏ దూరతీరాలకో పారిపోయివుండేదాన్ని.

సంధ్య చీకట్లు ముసురుతుండగా వాకిట్లో రిక్షా చప్పుడయింది. నేను చిన్నిని ఎత్తుకుని వాకిట్లోకి వచ్చాను. పువ్వుల పొట్లంతో ఆయన లోపలికి వచ్చి, కుర్చీలో కూర్చుని బూట్లు విప్పుకుంటున్నారు.

వంచిన తలమీద నుండి రక్తం బొట్లు బొట్లుగా కారుతోంది.

"అరే... ఆ రక్తం ఏమిటీ...?" అన్నాను ఆశ్చర్యంగా.

"హాస్పిటల్‌లో ఐరన్ రాడ్ కొట్టుకుంది" అన్నారు కళ్ళు మూస్తూ తెరుస్తూ మత్తుగా.

నాకు అర్థం అయ్యింది –

ఈయన హాస్పిటల్‌లో కూడా మత్తునే ఆశ్రయించారు. ఆ మైకంలో తగిలిన గాయమే అది.

"అబ్బ ... ఎంత పెద్ద గాయం అయినా హాస్పిటల్‌లో తగిలిన గాయానికి డ్రస్ చేసుకోకుండా ఇంతదూరం రావడమేమిటి....?"





కాటన్, బాండేజ్ క్లాత్ తెచ్చి గాయానికి కట్టు కడుతూ అదే అడిగాను కోపంగా.

నా కోపం చూసి ఆయన చిన్నగా నవ్వారు.

అలా నవ్వుతూనే, "నీ చేతులతో కట్టు కట్టించుకుందామని" అన్నారు.

నాకు నవ్వు వచ్చింది.

ఆయనకు కాఫీ ఇచ్చి పక్కనే కుర్చీలో కూర్చున్నాను.

నిద్రకూ, జాగ్రదవస్థకూ మధ్య ఆయన అవస్థపడుతున్నారు.

"నాన్నా! నేనీ పువ్వులు పెట్టుకోనా?" చిన్ని పూల పొట్లం విప్పి తండ్రిని అడుగుతోంది.

ఆయన మంచంమీద అలసటగా కదిలారు. ఫాన్ ఆన్‌చేసి చిన్నిని ఒళ్ళో కూర్చోబెట్టుకుని పక్కనే కూర్చున్నాను.

ముడుతలు పడ్డ ఆయన మొహంలో అలసట స్పష్టంగా కనిపిస్తోంది.

గుంటలు పడిన చెంపలూ, తెల్లగా పీచులామారిన జుట్టూ, అతిగా మార్ఫియా వాడటంచేత రంగు మారి శిధిలమైపోయిన శరీరం...

ఆయన్ను ఆ అలవాటు నుండి తప్పించ గలిగే సమర్థత నాకు లేదు.

ఆయన అకాల వార్థక్యాన్ని కౌగలించు కుంటుంటే నిస్సహాయంగా చూస్తూండి పోతున్నాను.

"సౌమ్యా!"

ఉలిక్కిపడి ముఖాన పడిన జుట్టును వెనక్కు నెట్టుకుంటూ "ఆఁ..." అన్నాను.

"సౌమ్యా... ఆ సిరింజి ఇలా పట్రా" అన్నారు.

నా గుండెల్లో రాయి పడింది.

"మళ్ళీనా?" అన్నాను అధుర్దాగా.

"ఇలా పట్టా...." ఆయన బాధగా నుదురు రుద్దుకుంటూ నెమ్మదిగానే అయినా నిశ్చయంగా అన్నారు.

తప్పదు.

ఆ మత్తు కోసం ఆయన నరాలు పెట్టే బాధ నేను తెలుసుకోగలను. ఆయన పూర్తిగా మత్తులోకి జారిపోతారు. అది ఆయనకు ఆనందం.

కానీ, నాకు మాత్రం ప్రతిసారీ కొత్తగా, బాధగా, దిగులుగా, భయంగా అనిపిస్తుంటుంది.

ఆయనలా మత్తులో మునిగిపోవడం నాకు ఇష్టం లేని మాట నిజమే. కానీ ఆయన్ను వారించి ఆపగలిగే శక్తి నాకు లేదు.

లేచి వెళ్ళి అలమారులో ఉన్న ఇంజక్షన్ బాటిల్, సిరంజి తెచ్చి స్టూలు మీద పెట్టి చిన్నిని తీసుకుని వంటగది లోకి వెళ్ళిపోయాను. నాకు తెలుసు—ఇక ఆయన భోజనం చెయ్యరు. ఎప్పటికి లేస్తారు అనే విషయం చెప్పడం కూడా కష్టమే.

చిన్నికి అన్నం కలిపి పెట్టాను.

ఇక నేను ఎవ్వరికోసమూ ఎదురు చూడాల్సిన పనిలేదు. పిల్లలు నాతో కలిసి భోంచేయరు. ఎవరికి వారే! నేనూ భోంచేశాను. చిన్నిని నిద్రపుచ్చుతూ ఒక నవల తీసుకుకూర్చున్నాను.

ఆయన గదిలో లైటు వెలుగుతోంది. టైం పది గంటలు చూపిస్తోంది. లేచి వెళ్ళి ఆయన గదిలో లైటు తీసేద్దామను కున్నాను.

చిన్ని నా మెడ చుట్టూ పెనవేసిన చేతులు నెమ్మదిగా విడదీసుకుని ఆయన గదిలో అడుగుపెట్టాను.

మంచం వైపు చూస్తూనే కొయ్యబారి పోయాను.

ఆయన మత్తులో లేరు. నేనూహించిన విధంగా ఆయన మత్తుగా నిద్రపోవడం లేదు.

మంచం మీద అస్తవ్యస్తంగా పడి, కళ్లు తెరుచుకుని చూస్తున్నట్లుగా ఉన్నారు. నాకు ఏదో సందేహం కలిగి నిదానంగా దగ్గరకు వెళ్ళి ఆయన ఒంటి మీద చెయ్యివేసి చూశాను. అంతే! నా శరీరం బిగుసుకుపోయింది. నా కాళ్లు నేలకూ, కళ్లు ఆయన శరీరానికి అంటుకుపోయాయి.

ఆయన చనిపోయారు.

నా మెదడు ఆ విషయం స్పష్టంగా చెప్పినా, ఒప్పుకుందుకు హృదయం తిరుగుబాటుచేస్తోంది.

ఇలా...ఇలా ఎందుకు జరిగింది?

ఇప్పుడు నేనేం చేయాలి....?

ఆయన మృతదేహాన్ని చూడగానే నాకు కలుగవలసినంత దుఃఖం కలుగ లేదు. దాని స్థానే జవాబు దొరకని అనేకా నేక ప్రశ్నలు చుట్టుముట్టాయి. బహుశా ఈ పరిస్థితి నేను ఎప్పుడో ఒకప్పుడు ఎదుర్కోవలసి వుంటుందని నా మనస్సు ఊహించి వుంటుంది.

అంతరాంతరాలలోదాగివున్న విషయం ఎట్టఎదుటనే కన్పించేసరికి అంత తొందరగా ఆ విషయాన్ని ఎదుర్కో వలసిరావడంతో కలిగిన కంగారు, భయం తప్ప దుఃఖం కలుగలేదు.

'ఏం చెయ్యాలి?' అనే ప్రశ్నకు నా మెదడు ముందు చెయ్యవలసిన దానిని గురించి తీవ్రంగా ఆలోచిస్తోంది.

శవం వంక చూస్తోన్నకొద్దీ నాలో ఏదో అలజడి మొదలయ్యింది.

బహుశా అది ఒంటరితనం కలిగిం

విన భయం కావచ్చు.

వెంటనే చిన్నిని ఎత్తుకుని బయటకు వచ్చేశాను.

* * *

చిన్నిని ఎత్తుకుని బయటికి వచ్చిన నాకు ఏం చెయ్యడానికీ తోచలేదు. ఎవరితోనయినా చెప్పాలనే ఆలోచనా రాలేదు.

నాకు ఈ లోకంలో వున్న ఒకే ఒక ఆత్మీయుడు మౌళి. అంతే! దగ్గరలోవున్న రిక్షా పిలిచి మౌళి దగ్గరకు వెళ్లాను.

అంత రాత్రివేళ చిన్నితో సహా నన్ను చూసిన మౌళి ఆశ్చర్యపోయాడు.

మౌళిని చూస్తూనే అప్పటివరకూ దాక్కున్న దుఃఖం కట్టలు తెంచుకు వచ్చింది నన్ను ముంచి వేస్తున్నట్టుగా.

చిన్నిని ఒళ్ళో పడుకోబెట్టుకుని వెక్కి వెక్కి ఏడ్చాను.

నా దుఃఖానికి కారణం తెలియని మౌళి నిస్సహాయంగా నావంక చూస్తుండి పోయాడు.

నా భర్త నన్ను వదిలిపోయాడన్న దుఃఖమో లేక ఇంత కష్టాన్ని నేను వంటరిగా ఎలా ఎదుర్కోగలను అనే భయం, దిగులువల్ల కలిగిన దుఃఖమో కానీ ఆ దుఃఖపు వెల్లువ నన్ను ఊపేసింది.

అలసిపోయేవరకూ అలా ఏడుస్తూ వుండిపోయాను.

నా శోకతీవ్రత నెమ్మదించిన తరువాత మౌళి ప్రాధేయపడుతూ ప్రశ్నించాడు.

"సౌమ్యా...ఏం జరిగింది?"

నన్ను తన గుండెల్లో దాచుకుని ఓదార్చలేని నిస్సహాయత అతన్ని కుదిపివేస్తోందని అతని మొహమే చెబుతోంది.

"మౌళీ... ఆయన ... ఆయన పోయారు" వెక్కిళ్ళమధ్య చెప్పాను.

మౌళి ఉలిక్కిపడ్డట్టుగా నిటారుగా అయ్యాడు.

ఏడుస్తూనే జరిగిందంతా చెప్పేశాను. ఐదు నిముషాల వరకూ మౌళి ఏమీ మాట్లాడలేకపోయాడు.

"ఇరుగూ పొరుగూ ఎవ్వరికీ చెప్పకుండా ఇలా వచ్చేశావా...?"

"లేదు...నాకు తోచలేదు. భయం వేసింది"

"పద...పద. నేను డాక్టరును తీసుకొస్తాను. నువ్వింటికి వెళ్లు..."

మౌళి తొందరపెట్టాడు.

"మౌళీ...నేను ఒక్కదాన్నీ వెళ్ళలేను. భయంగా వుంది. నువ్వూరా" ప్రాధేయ పడుతూ అడిగాను కన్నీళ్ళ మధ్య.

ఒక్క క్షణం ఆలోచించిన మౌళి ఏమనుకున్నాడో, "సరే పద" అంటూ నాతో బయలుదేరాడు.

"సౌమ్యా... ధైర్యం తెచ్చుకో. నీ కష్టంలో ప్రతిక్షణం నీకు తోడుగా నేనుంటాననే విషయం మరిచిపోకు. ఎలాంటి పరిస్థితిలోనూ ధైర్యం పోగొట్టుకోకు... పద"

గదిలోనుండి బయటికి వచ్చేముందు మౌళి నాతో చెప్పిన మాటలివి. వస్తూ వస్తూనే దారిలో డాక్టర్ శర్మగారిని వెంట బెట్టుకుని తీసుకువచ్చాడు.

ఇల్లు దగ్గర పడుతుంటే నా కాళ్లు గజ గజలాడాయి.

శరీరం స్వాధీనం తప్పుతున్నట్లుగా అనిపించింది.

ఇంటిముందు జనం పోగయి ఉన్నారు.

అందర్నీ తప్పించుకుని లోపలికి వెళ్లాము.

ఇరుగూ పొరుగూ జనం అంతా శవం






చుట్టూ చేరి గుసగుసగా మాట్లాడుతున్నారు. రమణి, మిగతా పిల్లలూ తండ్రి శవంమీదపడి ఘొల్లుమంటూ ఏడుస్తున్నారు.

అందరూ మావంక అదోరకంగా చూసి ముఖాలు తిప్పుకున్నారు.

డాక్టరు శర్మగారు ఆయన్ని పరీక్షించి శవంమీద గుడ్డకప్పారు.

మౌళిని చూస్తూనే కదిలిన నా గుండె ఇంకా ఇంకా కరిగి కరిగి నీరవుతూనే వుంది.

ఆయన ముఖంమీద తెల్లనిగుడ్డ నా గుండెలను పిండింది.

ఏడుస్తూ శవం దగ్గరగా వెళ్ళాను.

"ఛీ...రాక్షసి. నువ్వు మా నాన్నను ముట్టుకోవద్దు" విదిలించి కొట్టింది రమణి.

తెల్లబోయాను.

అప్పటివరకూ గుసగుసగా సాగిన మాటలు వినికిడి శబ్దాన్ని సంతరించుకున్నాయి.

"ఆ ఏదో మందు ఇంజక్షన్ చేసిందట. అందుకే డాక్టరుగారు చచ్చిపోయారట"

"ఆయన చచ్చిపోగానే నగలన్నీ మూటకట్టుకు వెళ్ళి, వాడెవడో వున్నాడట కదా వాడికిచ్చి ఇప్పుడే వచ్చింది"

"చూడండి! మెళ్ళో నెక్లెసూ, చెవులకు జుంకాలూ, తలలో పూలతో పెళ్ళి కూతురిలా ఎలా ముస్తాబుఅయి వెళ్ళిందో! చూశారా?"

"దీనికి ప్రాణం ఎలా ఒప్పిందో! కట్టుకున్న మొగుడు ఇలా చావుబతుకుల్లో వుండే, సింగారించుకుని రం...మొగుడి దగ్గరికి వెళ్ళింది"

ఈ వివరాలన్నీ తమకు తెలుసు అనుకొన్నవాళ్ళు తెలియనివాళ్ళకు తెలియచెబుతున్నారు.

అందరి మాటలూ వినబడుతున్నాయి. మాటలు రాళ్ళలా తగులుతున్నాయి. అన్నీ తెలుస్తూనే వున్నాయి.

కానీ మెదడు పనిచేయడం మాని నట్లుగా స్థబ్ధంగా వుండిపోయింది. కళ్ళు ఎండిపోయాయి. గుండె మండిపోతోంది.

ఇల్లంతా జనంతో నిండిపోయింది. వీధి వీధంతా డాక్టర్ కృష్ణమోహన్ గార్ని చూసేందుకు కదలివచ్చింది.

"దీని కఠినం కాలిపోనూ... కంటివెంట ఒక్క చుక్క నీళ్ళుకూడా రావడంలేదు"

"గుంజండి...తన్నండి...లం..."

నోరుపట్టని బూతులు తిడుతూ లోపలికి నెట్టుకు వస్తున్నారు ఒక గుంపు.

అంతలో ఎవరో నన్ను చటుక్కున గదిలోకి గుంజి లోపల గడియవేశారు.

బయటినుండి తిట్లూ, శాపనార్థాలూ రాళ్ళలా దూసుకువస్తున్నాయి. మళ్ళీ వెల్లువలా ఒక దుఃఖ ప్రవాహం నన్ను ముంచివేసింది.

మోకాళ్ళమీద తలపెట్టుకుని వెక్కి వెక్కి ఏడ్చేశాను. నన్ను లోపలకు లాగిన ఆ చెయ్యి ఆదరంగా నా తల నిమిరింది. ఆ స్పర్శలోని స్వాంతనకూ, ఓదార్పునకూ నా గుండె చిల్లులు పడింది.

ఏడుస్తూనే తలఎత్తి చూశాను.

మా ఇంటికి నాలుగిళ్ళవతలి ఒక టీచరు భార్య ఆమె.

ఇంకా లోకంలో మంచితనం మిగిలి వుందా?

తెల్లవారింది. భయంకరమైన రాత్రి గడిచి వెలుగురేఖలు ప్రపంచమంతా నిండుకున్నాయి. కానీ, నా బతుకులోని చీకటిమాత్రం అలాగే నిలిచిపోయింది.

పొద్దు ఎక్కుతున్నకొద్దీ మా ఇల్లు తిరణాల అయ్యింది. నాకు శాపనార్థాలూ అధికమయ్యాయి.

పోలీసులు వచ్చి శవాన్ని పోస్ట్ మార్టంకు తీసుకెడుతూ నన్ను ప్రశ్నించేందుకు పిలిచేవరకూ ఆమె తలుపు తియ్యలేదు. తను బయటికి వెళ్ళలేదు.

శవం పోస్ట్‌మార్టంకు వెళ్ళడంతో జన సమూహం తగ్గుముఖం పట్టింది. కానీ, ఒక్కొక్కరుగా దిగిన బంధువులతో ఇల్లు నిండిపోయింది.

రిక్షా దిగుతూనే పిల్లల్ని కౌగలించుకుని భోరున ఏడ్చేసింది జానకమ్మ. ఏడుస్తూనే నన్ను తూర్పారపట్టింది.

బిక్కమొహంతో నాదగ్గర కూర్చున్న చిన్నిని చటుక్కున లాక్కుపోయింది.

నా గుండె పగిలింది.

నాకు ఇంత కష్టమూ ఒక ఎత్తు అయితే ఈ కష్టం ఒక్కటీ ఒక ఎత్తు. తన చిట్టి చేతులతో నా కన్నీళ్ళు తుడిచే నా చిన్ని నా దగ్గర లేకపోతే నేను బతకగలనా?

మళ్ళీ ఒక దుఃఖపుతెర నన్ను కప్పేసింది.

నా ప్రమేయంగానీ, నా వునికిగానీ పట్టించుకోకుండానే, నన్ను శవం దగ్గరకు రానివ్వకుండానే నా భర్త అంత్యక్రియలు పూర్తయ్యాయి.

ఎవరూ పట్టించుకొన్నట్లు లేకపోయినా నేను 'విధవ'నయ్యాను.

నన్ను గదిలో దాచినప్పుడే ఆ 'దయామయి' నా మెడలోని నల్లపూసల గొలుసూ, నెక్లెసూ, చేతులకు వున్న బంగారు గాజులూ, చెవులకున్న కొత్త రకం జుంకాలూ, వాచీ తీసి బీరువాలో పెట్టింది.

జడలోని పువ్వులు తీసి ముడివేసింది.

భర్త చనిపోయిన స్త్రీగా నాకు కొంత సానుభూతి సంపాదించిపెట్టాలని




తాపత్రయపడింది.

కానీ స్వతసిద్ధమైన నునుపైన చెక్కిళ్ళనూ, ఈ పెదాల ఎరుపునూ, ముడిలో ఇమడకుండా చెంపలను పరచుకునే ఈ నొక్కుల జుట్టునూ నేనేం చేయను?

వాటినీ విమర్శిస్తున్న ఈ డాక్టరుగారి సానుభూతిపరులకు నేనేం జవాబుచెప్పను?

తండ్రి చనిపోయిన మూడో రోజు రమణి నా గదిలోకి వచ్చి డ్రాయరులో వున్న నగలూ, ఇతర విలువైన వస్తువులూ తీసుకుని వెళ్లిపోయింది జానకమ్మ సలహా మేరకు.

నేను విరక్తిగా నవ్వుకున్నాను.

వాటిపైన నాకు ప్రత్యేకమైన ఆసక్తి ఏమీలేదు.

'ఈ ఇంట్లో నీకేమీ లేదుసుమా! ఇక నీ దారి నువ్వు చూసుకోవడం మంచిది' అన్నట్లుంది వాళ్ల ప్రవర్తన. ఇది నేను భరించగలను. కానీ చిన్నిని నా దగ్గరకు రానివ్వడంలేదు. ఈ విషయం నా గుండెను కోస్తోంది.




"మీ పేరు?"

నాకు నవ్వు వచ్చింది.

"చెప్పండి మేడం...మీ పేరు?" భాష మర్యాదగానే వుంది. కానీ ఆ కంఠస్వరంలోని కాఠిన్యం, వ్యంగ్యం నన్ను కాల్చేసేలా వుంది.

పేరు....నా పేరు చెప్పాలట! ఎంత హాస్యాస్పదమైన విషయం. గత వారం రోజులుగా ఊరూరా, వీధివీధినా, గడప గడపకూ, మనిషి మనిషి నోటిలోనూ విచిత్రంగా నా పేరేమోగుతోంటే ఈయనకు నా పేరేతెలీకుండాపోయిందా?

అలా అడగడం వాళ్ల వృత్తిలో ఒక భాగం.

"మీరిలా మౌనంగా వున్నంత మాత్రాన మిమ్మల్ని అమాయకులని ఎవరూ అనుకోరు. దయచేసి మీరు మా ప్రశ్నలకు సమాధానాలు చెప్పి మాతో సహకరించాలి"

ఇన్‌స్పెక్టర్ మాటలు ఛళ్లున తగిలి చివాలున తలఎత్తి చూశాను.

అవమానభారంతో నా ముఖం ఎర్రబారింది.

పేదవాడి కోపం పెదవికి చేటు.

"మీ పేరు?"

"సౌమ్య"

"వయసు?"

"ఇరవై ఏడు"

ఎత్తు అడుగుతాడేమో 'అయిదూ-నాలుగు' అని చెప్పేద్దామనుకున్నాను.

ఆయన అడగలేదు.

వివరాలు నోట్ చేసుకుంటున్న ఇన్‌స్పెక్టర్ తలఎత్తి చూశాడు. అతని కళ్ళల్లో కనిపించే ఆశ్చర్యాన్ని చదువుకున్నాను.

'ఈవిడకు పాతికేళ్ళుంటాయా?' అన్నది అతని ఆశ్చర్యంలోని భావం.

"డాక్టర్ కృష్ణమోహన్‌గారు మీకే మవుతారు?"

ఆయన ప్రశ్న అడగటంలో, చూపులో భావంలో అధికార దర్పం...

"ఆయన నా భర్త"

"ఆయన వయస్సులో మీకంటే చాలా పెద్దవారు....ఔనా?"

"ఔను"

"ఐ అయ్‌సీ... ప్రేమ వివాహమా?"

అతని స్వరంలో పలికిన వ్యంగ్యం నా గుండెను కోసింది.

మౌనంగా వుండిపోయాను.

"మీరు డాక్టర్ కృష్ణమోహన్‌గారి రెండవ భార్య అనుకుంటాను"

"అవును"

"ఈ వివాహానికి కారణం అతని ఆస్తి. ఏమంటారు?"

"అందరూ అలాగే అనుకుంటున్నారు"

"మీరేమంటారు?"

"డాక్టరుగారి భార్య చనిపోవడమూ నేను ఆడదాన్ని కావడమూ కారణం అనుకుంటాను"

"మీకు టి.డి. సంస్థలో పనిచేసే చంద్రమౌళిగారు తెలుసా?"

"తెలుసు"

"అయ్‌సీ. ఎంతకాలంగా తెలుసు?"

"సుమారు రెండేళ్ళుగా"

"ఎలా తెలుసు?"

"......"

"బంధువా...?"

"కాదు"

"స్నేహితుడా?"

ఒకసారి తల ఎత్తి ఇన్‌స్పెక్టరు వంక చూశాను.

ఆ ముఖంలో ఆ పెదవులపై సన్నని వ్యంగ్యంతో కూడిన చిరునవ్వు...

"అవును" అన్నాను స్థిరంగా.

"ఏరకమైన స్నేహితుడు?"

"ఇన్‌స్పెక్టర్ గారూ! స్నేహితుల్లో ఎన్నిరకాలు వుంటారో ముందు మీరు చెబితే, అతను ఏ రకమైన స్నేహితుడో తరువాత నేను చెప్తాను"

ఇన్‌స్పెక్టరుగారి కనుబొమ్మలు క్రోధంతో ముడివడ్డాయి.

"ఓకే ... ఇట్స్ ఆల్‌రైట్! మీరు మాకు ఇన్ఫర్‌మేషన్ ఇవ్వకుండా టౌన్ వదిలి వెళ్ళకూడదు. కోర్టునుండి మీకు సమన్లు వస్తాయి. మీరు కోర్టుకు హాజరు కావల్సి వుంటుంది"

ఇన్‌స్పెక్టర్ టేబిల్ మీద వుంచిన హేట్ తీసి పట్టుకుని బూట్సు చప్పుడు చేసుకుంటూ హుందాగా వెళ్ళిపోయారు.

గాఢంగా నిట్టూర్చాను. జీవితం ఎంత చిత్రమైంది? అప్పటివరకూ తలుపు చాటుగా వుండి తు.చ. తప్పకుండా అన్నీ విన్న జానకమ్మ ఇన్‌స్పెక్టర్ వెళ్ళిపోతూనే గది ముందు ఆడుకుంటున్న చిన్నిని లోపలికి లాగి ధడాలున తలుపు వేసుకుంది.

విసురుగా లోపలికి లాగి తలుపు వెయ్యడంతో చిన్ని ఏడుపులంకించుకుంది.

"అమ్మ...అమ్మంటూ తన చుట్టే తిరుగుతుంది పెద్దమ్మా. దీనికి ఏ ఇంజక్షనో ఇచ్చి చంపుతుంది. పెద్దమ్మా! చిన్నిని బయటికి పోనివ్వద్దు"

రమణి కర్కశమైన మాటలు నా గుండెల్ని చీల్చాయి.

నేను ఏడ్చానూ అంటే దానికి సవాలక్ష కారణాలు. కానీ, నేను నవ్వానూ అంటే దానికి కారణం నా చిన్నే.

ఈ ఇల్లు, ఈ ఆస్తి, ఈ పిల్లలూ, జానకమ్మా...వీళ్ళందరూ ఏమైపోయినా, కట్ట కట్టుకుని గంగలో దూకినా నాకేం సంబంధంలేదు.కానీ... కానీ...నా చిన్ని




నన్ను తల్లిని చేసిన బంగారు తల్లి నా 'చిన్ని' నాకు కావాలి...

* * *

ఆ రోజు జీవితంలో నేను మొదటి సారిగా బోను ఎక్కినరోజు. నన్ను చూడాలని వచ్చిన జనసందోహంతో కోర్టుహాలు నిండిపోయింది.

అందరి ముఖాలలోనూ నాపట్ల తీవ్రమైన అసహ్యం...కష...

తలపంచుకున్నాను.

వీళ్ళందరికీ నా పట్ల ఇంత ద్వేషం ఎందుకు...?

నేను చేసిన నేరం ఏమిటి...?

ఈ ప్రశ్నలకు వాళ్ళు ఇస్తున్న జవాబులు నాకు తెలుసు.

నేను డబ్బుకోసం ఒక ముసలివాడిని కట్టుకున్న ఆశాపాతకిని ... ముసలి మొగుడితో కోరికలు తీరక, మరొకరితో శారీరక సంబంధం పెట్టుకొన్న కులటను..

డబ్బుకోసం భర్తను చంపిన హంతకిని...

అందుకే ఈ జనం నన్ను, నా ప్రతి కదలికనూ వింతగా, విచిత్రంగా చూస్తున్నారు. చూస్తూ అసహ్యించుకుంటు న్నారు. అసహ్యించుకుంటూ చూస్తున్నారు. ఆపైన అసభ్యంగా తిడుతున్నారు....

"అరే..ఎంత షోగ్గా వుందో చూడ్రా."

"మొగుడు చచ్చినందుకు కొంచెం కూడా దిగులు లేదు"

"నీ మొహం. అది కావాలని చంపితే దానికి దిగులు ఎందుకుంటుందిరా?"

"దానికి ఇంకొకడు వున్నాడటగా. వీడు వుంటేనేం పోతేనేం?"

"అవునూ..ఎందుకిలా చేసిందంటా?"

"ఎందుకేమిటి ఆస్తికోసం. పిల్లలు చిన్నవాళ్ళేగా..."

కోర్టుహాల్లో జనంలో కలిగే అలజడి, వాళ్ళ మాటలూ నా చెవుల పడుతూనే వున్నాయి.

రాయిలా నిలబడ్డాను.

కొన్నాళ్ళుగా ప్రతివారినోటా ఇవే మాటలూ, ఇవే చూపులూ. క్రమంగా వాటికి అలవాటు పడిపోయాను.

ఇప్పుడు నాకవేవీ బాధకలిగించలేవు.

ఇప్పుడు నన్ను బాధించే సమస్యలల్లా రెండే రెండు.

ఈ కేసునుండి బయట పడటం ఎలా....?

నా చిన్నతల్లిని దక్కించుకోడం ఎలా...?

నా ముందున్న సమస్యలు ఆ రెండే. వాటికోసమే నేను తీవ్రంగా ఆలోచిస్తు న్నాను; బాధ పడుతున్నాను.

ఛీ...ఛీ... అనే ఈ జనంగానీ, చని పోయిన నా భర్తగానీ ఎవ్వరూ నా కంటి నుండి ఒక్కచుక్క కన్నీరు తెప్పించ లేరిక.

నా హృదయం పాషాణంగా మారి పోయింది.

నా చిన్నిని కరువుతీరా హృదయానికి హత్తుకున్నప్పుడే ఈ పాషాణం కరుగు తుంది తప్ప ఈ మాటల ఈటెలూ, ఈ చూపుల బాణాలూ, నన్నేమీ చెయ్యలేవు గాక చెయ్యలేవు.

కోర్టువారు నాచేత ప్రమాణం చేయిం చారు.

"భగవంతుని సాక్షిగా అబద్ధం చెప్పను. అంతా నిజమే చెబుతాను" అంటూ ప్రమాణం చేశాను.

నేను ప్రమాణం చేసిన విధంగా నిజమే చెప్పాను. కానీ, నేను చెప్పే నిజాన్ని వీళ్ళెవరూ నమ్మరుగా. అంతకాదికి

నేను నిజంచెప్పి ప్రయోజనం ఏమిటి...?

"మీ పేరు?" ఓ లాయరుగారు నీ సంగతంతా నాకు తెలుసులే అన్నట్లుగా అడిగాడు.

చెప్పాను.

అందరికీ కనిపిస్తున్నవే, తెలిసినవే మరికొన్ని వివరాలు అడిగాడు. అన్నీ చెప్పాను.

"మీరు సోమవారం రాత్రి పది గంటల ప్రాంతంలో మీ భర్త డాక్టర్ కృష్ణమోహన్‌గారిని హత్యచేశారు. దీనికి మీరు కోర్టువారికి చెప్పుకోవల్సింది ఏమైనా వుంటే చెప్పుకోవచ్చు...."

నాకు నవ్వు వచ్చింది.

ఈ లాయరు ఎవరోగాని చూసినట్లుగానే ఎంత బాగా చెబుతున్నాడు....

"మీరు ఏమీ మాట్లాడకపోతే నేరం మీరు ఒప్పుకుంటున్నట్లుగానే భావించబడుతుంది"

జడ్జిగారు హెచ్చరించడంతో నోరు విప్పాను.

• • •

"మీ పేరు?"

"రమణి"

"మీరేం చేస్తుంటారు?"

"చదువుకుంటున్నాను"

"సోమవారం మీరు చివరిసారిగా మీ నాన్నగారిని ఎప్పుడు చూశారు?"

"సోమవారం ఉదయం 10 గంటలకు నాన్నగారు హాస్పిటల్‌కు వెళ్ళేప్పుడు చూశాను"

"మళ్ళీ ఎప్పుడు చూశారు?"

"సోమవారం రాత్రి పదిగంటల ప్రాంతంలో నాన్నగారు చనిపోయి ఉండగా చూశాను"

"అప్పటివరకూ మీరు ఎక్కడ ఉన్నారు?"

"సోమవారం రాత్రి నా ఫ్రెండ్ పావనితో కలిసి పిక్చర్‌కు వెళ్ళాను"

"మీరు ఇంటికి తిరిగి వచ్చేప్పటికి ఇంట్లో ఎవరెవరున్నారు?"

"ఇంట్లో ఎవరూ లేరు. తలుపులు తీసే ఉన్నాయి. నాన్నగారు మాత్రం అస్తవ్యస్తంగా మంచం మీద పడి ఉన్నారు"

"మీ పిన్నిగారు ఎక్కడికెళ్ళారు?"

"నాకు తెలీదు"

"ఊహించగలరా?"

"ఆఁ..."

"చెప్పండి"

"ఆవిడ తన ఫ్రెండ్ ఇంటికి వెళ్ళి ఉంటుంది"

"ఫ్రెండ్ అంటే ఆడా, మగా....?"

"మగ"

"మీ పిన్నిగారికి బాయ్‌ఫ్రెండ్స్ ఉన్నారా?"

"నాకు తెలిసినంతవరకూ ఒకరు ఉన్నారు"

"మీ పిన్నిగారికీ, మీ నాన్నగారికీ మధ్య గొడవలు ఏమైనా కలుగుతుండేవా?"

"ఆఁ... ఎప్పుడూ నాన్నగారు, ఆమె అరుచుకుంటూ ఉండేవాళ్ళు"

నేను నోరు తెరుచుకుని సాక్ష్యం చెబుతున్న రమణి వైపు చూస్తూండిపోయాను. ఇంతింత చిన్నపిల్లలు ఇంతలేసి అబద్ధాలు ఎలా చెప్పగలరు?

పసిపిల్లలు అబద్ధాలు ఆడగలరనీ, దొంగతనం చేయగలరనీ నేను అంత తేలికగా అనుకోలేకపోయేదానిని.

రమణి ఎంత ఈజీగా అబద్ధాలు చెప్పేస్తోంది?

"మీ నాన్నగారూ, మీ పిన్నిగారూ ఎక్కువగా ఏ విషయాల గురించి గొడవ పడుతుండేవారు?"

"........."

"ఈ విషయం చెప్పేందుకు ఏమిటి మీ అభ్యంతరం?"

రమణి రెండుక్షణాలు మౌనంగా ఉండి ఆ తరువాత నెమ్మదిగా అంది—

"తరచూ మా ఇంటికి ఆవిడగారి కోసం ఆవిడ ఫ్రండ్ వస్తుండేవాడు. ఆ విషయంలో నాన్నగారు ఆవిడతో ఘర్షణ పడుతుండేవారు"

"అంటే, ఆ వ్యక్తి రావడం మీ నాన్నగారికి ఇష్టం లేదు... ఔనా?"

"అవును.... అంతే"

"అతని పేరు?"

"మౌళి"

"చివరిసారిగా మీ పిన్నిగారు, మీ నాన్నగారు ఎప్పుడు ఘర్షణపడ్డారు?"

"ఆదివారం రాత్రి"

"విషయం టూకీగా చెప్పగలరా?"

"మౌళి ఇంటికి రావడం తనకిష్టం లేదని నాన్నగారు కేకలువేశారు"

"అప్పుడు మీ పిన్నిగారేమన్నారు?"

"'అది నా ఇష్టం. మిమ్మల్ని చేసుకుని నేనేమీ సుఖపడిపోవడంలేదు' అంటూ ఆవిడ ఎదురుతిరిగింది. ఈ విషయం మీదే చాలాసేపు నాన్నగారికీ, ఆవిడకూ ఘర్షణ జరిగింది"

ప్రాసిక్యూషన్‌వారు రమణి సాక్ష్యాన్ని తీసుకున్నారు.

చివరిగా మౌళి నాతరపున నియమించిన లాయర్ గోపాలంగారు సాక్షిని ఒక్క ప్రశ్న వేసేందుకు కోర్టువారి అనుమతి కోరారు.

"మీ పేరు రమణి కదూ?"

"అవును"

"మీ వయస్సు"

"పద్దెనిమిది" చిరాగ్గా చెప్పింది రమణి—కేసుకూ, ఈ ప్రశ్నకూ సంబంధం ఏమిటన్నట్టుగా.

"అంటే మీరు మీ పిన్నిగారికంటే దాదాపు ఏడెనిమిదేళ్ళు చిన్నవారు... ఔనా?"

"అవును"

"రమణిగారూ! మీకూ, ముద్దాయికీ మధ్య గృహస్థ జీవితంలో మంచి సంబంధాలు ఉండేవా?"

రమణి జవాబు చెప్పేందుకు ఒక్కక్షణం తటపటాయించింది.

"ఆఁ...." అంది చివరికి క్లుప్తంగా.

"ముద్దాయి మీకంటే పెద్దవారు. మీకూ, ముద్దాయికీ మధ్య మంచి సంబంధాలే ఉంటే మీరు ఆవిడను 'అమ్మ' అనిగానీ, 'పిన్ని' అనిగానీ సంబోధించకుండా 'ఆవిడగారు', 'ఆమె' అంటున్నారు. దీనిని బట్టి మీకూ ఆమెకూ మధ్య అట్టే మంచి సంబంధాలులేవని తెలుస్తుంది. ఔనా...?"

ఒక్కక్షణం రమణి తెల్లబోయి సర్దుకుంది.

"ఔను ... నిజమే! ఆమె మామీద మా నాన్నగారికి లేనిపోనివన్నీ చెప్పి మమ్మల్ని తిట్టించేది. ఒక్కోసారి ఆమె మాటలు విని నాన్నగారు మమ్మల్ని కొట్టేవారు కూడా. అందుకే ఆమెకూ, మాకూ మధ్య మంచి సంబంధాలు లేవు"

"అంటే మీ పిన్నిగారు మీ నాన్నగారితో చెప్పి మిమ్మల్ని కొట్టించేవారు. అందుకే ఆమెకూ, మీకూ పడేదికాదన్న మాట?"

"అవును" అంది రమణి సంతోషంగా.

"మిలార్డ్....నోట్ దిస్ పాయింట్"

అన్నారు జడ్జివైపు తిరిగి.

"మిస్ రమణీ! మీ పిన్నిగారికీ, మీకూ పడదని మీరే ఒప్పుకుంటున్నారు. అందుకే మీరు ముద్దాయికి వ్యతిరేకంగా సాక్ష్యం చెబుతున్నారు. దీనికి మీరేమంటారు?"

రమణి జవాబు చెప్పేందుకు తబ్బిబ్బు పడింది.

ఆమె ముఖం కందిపోయి అరుణిమను పులుముకుంది. చెప్పడానికి ధైర్యంగా అబద్ధాలు చెప్పింది కానీ, లాయరుగారి తిక మక పెట్టే ప్రశ్నలతో ఆ అబద్ధాలను ఎలా కప్పిపుచ్చుకోవాలో తెలీని కంగారులో పడింది. లాయరుగారు తిరిగి హెచ్చరించడంతో "లేదు ... లేదు. నేను అబద్ధం చెప్పడంలేదు" అంది కంగారుగా.

సాక్షిని కంగారు పెట్టేస్తున్నారంటూ ప్రాసిక్యూషన్ లాయరుగారు అబ్జక్షన్ లేవదీశారుగానీ, జడ్జిగారు అనుమతించ డంతో గోపాలంగారు తమ ప్రశ్నలను కొనసాగించారు.

"మిస్ రమణీ! మీ నాన్నగారికి ఇంతకు ముందు మార్ఫియా ఇంజక్షన్స్ తీసుకునే అలవాటు వుందా?"

"లేదు"

"కొంచెం ఆలోచించి చెప్పండి. మీ నాన్నగారు రోజులో ఎక్కువ భాగం నిద్రపోతూనే గడిపేవారు ... కదూ?"

"ఏమో నాకు తెలీదు"

"అంటే ఇంట్లో వ్యక్తి ఎలావున్నారో కూడా మీకు తెలీదా?"

"ఐ అబ్జెక్ట్ దిస్ పాయింట్ మిలార్డ్" లాయరుగారు కంగారుగాలేచారు.

"అబ్జక్షన్ ఓవర్ రూల్డ్... ప్రొసీడ్"

జడ్జిగారి ఆదేశంతో గోపాలంగారు మరింత ఉత్సాహంగా రమణి మీద ప్రశ్నలు గుప్పించారు.

ఇక ఆ తర్వాత లాయరుగారు ఏ ప్రశ్న వేసినా రమణి జాగ్రత్తగా ఆలోచించి మరీ "ఏమో", "నాకు తెలీదు." అనడం ప్రారంభించింది.

* * *

"మీ పేరు?"

"చంద్రమౌళి"

"వృత్తి?"

చెప్పాడు మౌళి.

"మీకు ముద్దాయి తెలుసా ?" కోర్టు బోనులో ఉన్న నన్ను చూపిస్తూ అడిగారు మౌళిని.

మౌళి నా వంక చూడకుండానే "తెలుసు" అన్నాడు.

"ఎంత కాలం నుండి తెలుసు?"

"సుమారు మూడు సంవత్సరాలుగా"

"మీమధ్య ఉన్నది ఎలాంటి పరిచయం?"

"......"

"మీది చెప్పేందుకు అభ్యంతరకర మైన పరిచయమా?"

"కాదు. ఆమె నా స్నేహితుడి భార్య. నాకూ స్నేహితురాలు"

"మీకు పెళ్ళయిందా?"

"లేదు"

"ఇంత కాలం వరకూ..."

"కొన్ని కుటుంబపరమైన ఇబ్బందుల వల్ల చేసుకోలేదు. అయినా కేసుకూ, నా స్వవిషయానికీ సంబంధం లేదను కుంటాను"

"మీకూ, ముద్దాయికీ అక్రమ సంబంధం ఉందని తెలుస్తోంది. మీరే మంటారు?"

"సంబంధం ఉన్నమాట నిజమే కానీ అది అక్రమమైంది కాదు"

కుర్ర లాయరు తికమకపడ్డాడు.





"సోమవారం రాత్రి పది గంటల సమయంలో ముద్దాయి మీ ఇంటికి వచ్చిందా?"

"వచ్చింది"

"అలా రాత్రిళ్లు ఎప్పుడైనా వస్తుంటుందా?"

"లేదు"

"మరి ఆరాత్రి ఎందుకు వచ్చింది?"

"తన భర్త మరణం గురించి చెప్పేందుకు"

"ఇరుగూ పొరుగూకు చెప్పకుండా మీ దగ్గరికే రావడంలో ఉద్దేశం?"

"ఇరుగూ పొరుగూకంటే ఆమెకు నేను దగ్గరివాడను"



"సోమవారం రాత్రి ఆమె మీ ఇంటికి వంటరిగా వచ్చిందా?"

"కాదు. ఆమె తన చిన్న కూతుర్ని తీసుకుని వచ్చింది"

"నడచి వచ్చిందా?"

"లేదు. రిక్షాలో వచ్చింది"

"ఆమె ఒక నగలమూట మీకు ఇచ్చి దాచమని చెప్పింది. ఔనా?"

"లేదు. ఆమె నాకు అలాంటిదేమీ ఇవ్వలేదు. తన భర్త చనిపోయారనీ, ఒంటరిగా తనకు దిక్కుతోచడంలేదనీ, సహాయంగా తన యింటికి నన్ను రమ్మనీ కోరింది. అంతే"

"డాక్టరు కృష్ణమోహన్‌గారు ఇంతకు పూర్వం మీకు తెలుసా?"

"తెలుసు"

"ఎలా?"

"డాక్టర్ కృష్ణమోహన్ నాకు మంచి స్నేహితులు"

"మీరు ముద్దాయి యింటికి తరుచుగా వెడుతుండేవారా?"

"ఔను. డాక్టర్ కృష్ణ మోహన్

గారింటికి చాలా తరుచుగా వెడుతుండే వాణ్ని"

"ముద్దాయి మిమ్మల్ని తన యింటికి రమ్మని కోరిందన్నారుగా. మీరు వెళ్లారా?"

"వెళ్ళాను"

"అప్పటికి ఎంతై వుంటుందో చెప్పగలరా?"

"పదిన్నర – పదకొండు లోపుగా అయివుంటుంది"

లాయరు తన శక్తియుక్తులు వుపయోగించి మౌళిని కంగారు పెట్టేందుకు ప్రయత్నిస్తున్నాడు.

మౌళి మాత్రం ఏమాత్రం తబ్బిబ్బు లేకుండా నిబ్బరంగా సమాధానాలు చెబుతున్నాడు.

బహుశా నిజం చెప్పేటప్పుడు వుండే నిబ్బరం అది. కానీ అబద్ధం చెప్పాల్సి వచ్చినప్పుడు ఆ నిబ్బరం కొరవడి లాయర్ల ప్రశ్నల దాడికి తికమక పడిపోతుంటారు అబద్ధపు సాక్ష్యం చెప్పేవారు.

పాపిష్టిదాన్ని. నేను ముందూ వెనకా ఆలోచించకుండా అతని యింటికివెళ్లి అతన్ని 'రిస్క్'లో పెట్టాను. వెళ్ళకపోయినా బాగుండేది.

* * *

నా తరఫు న్యాయవాది ఆరోజు తన సాక్షిని కోర్టులో ప్రవేశపెట్టారు.

"మీ పేరు?"

"శర్మ"

"వృత్తి...?"

"డాక్టరు"

"హతుడు కృష్ణమోహన్ మీకు ఎంతకాలంగా తెలుసు?"

"సుమారు పది సంవత్సరాలనుండి"

"ఎలా...?"

"నేనూ, డాక్టరు కృష్ణమోహన్ ఒకే హాస్పిటల్‌లో డాక్టర్లుగా ఉండేవారం"

"డాక్టర్ కృష్ణమోహన్ ఎలాంటివారు?"

"చాలా మంచిమనిషి"

"అతనికి ఏమైనా అలవాట్లుండేవా?"

"ఔను. అతనికి కొంత కాలంగా మార్ఫియా తీసుకునే అలవాటు ఏర్పడింది"

"అతనికా అలవాటు ఎలా కలిగిందో మీకేమయినా తెలుసా?"

"తెలుసు. అతని మొదటి భార్య చనిపోయిన సందర్భంలో దుఃఖంతో వివశదవుతున్న డాక్టరుకు, డాక్టరుగా నేనా ఇంజక్షన్ ప్రిఫర్ చేశాను. కానీ, అతనా అలవాటుకు బానిస అవుతాడని నేను ఊహించలేకపోయానా రోజు"

"డాక్టరు చనిపోయిన విషయం ముందుగా మీకెలా తెలిసింది?"

"చంద్రమౌళిగారు చెబితే తెలిసింది"

"డాక్టరు ఎలా చనిపోయారని మీరు అభిప్రాయపడుతున్నారు?"

"మార్ఫియా డోస్ ఎక్కువ కావడం చేత అతను చనిపోయి వుంటాడనేది నా అభిప్రాయం"

"దట్స్ ఆల్‌రైట్...ముద్దాయి మీకు పరిచయమేనా?"

"ఆఁ..."

"ఆమె గురించి మీ అభిప్రాయం?"

"నాకు తెలిసినంతవరకూ - భర్తను చంపుకునే కాఠిన్యం ఆమెలోలేదు. చాలా మంచి మనిషి. వృత్తిరీత్యా ఒకప్పుడు నర్స్ కాబట్టి ప్రాణం పోయడానికి ప్రయత్నిస్తుందే తప్ప ప్రాణం తీయదు"

"ఆల్‌రైట్...మీరిక వెళ్ళవచ్చు"

* * *

డాక్టరుగారి ఆస్తి పంపకం విషయమై ఆరోజు మా ఇంటి ఆవరణలో చిన్నా, పెద్దా డాక్టరుగారి కుటుంబ శ్రేయోభిలాషులతో ఒక పంచాయితీ ఏర్పాటు చేయబడింది.

డాక్టర్ కృష్ణమోహన్‌గారి ఆస్తి పాస్తులు ఎలా పంపకం జరగాలి? పిల్లలను ఎవరి సంరక్షణలో వుంచాలి?— అనేది చర్చించడమే ఆ పంచాయితీ ఉద్దేశం.

నిజానికి అప్పటికప్పుడు ఆస్తిపాస్తులు పంపకం చేయాల్సిన అవసరం ఏమీలేదు.

డాక్టరుగారి కుటుంబ శ్రేయోభిలాషుల పంచాయితీ ఇది. వాళ్ళు నాపట్ల ప్రవర్తించే తీరూ, ప్రయోగించే బండ మాటలూ, నాకు చేసే అన్యాయం కళ్ళారా చూసి ఆనందపడేందుకుగాను, చెవులారా విని సంతోషపడేందుకుగాను నేను ఆ పంచాయితీలో తప్పనిసరిగా వుండాలన్నారు.

బండరాయిలా ఒక మూల కూర్చున్నాను.

కోర్టులో కేసు నడుస్తుండగా, నేను దోషినో, నిర్దోషినో రుజువుకాకముందే, ఈ పంచాయతీ పెట్టడంలో సబబు ఎంతవరకో ఒక్కరికీ ఆలోచనకు అందలేదా? లేక సబబు కాదని తెలిసీ ఫరవాలేదులే అనుకున్నారా?

ఈలోపుగా నేను చాటుగా మాటుగా రొఖ్ఖం, నగలూ ఇలాంటివి సర్దేసుకుంటానని జానకమ్మ భయం.

ఇప్పటికే ఒక నగలమూట దాచేశాన్న వార్త ఆవిణ్ని కలవరపెడుతోంది. పూచిక పుల్లయినా నాకు చెందకుండా చెయ్యాలనే తాపత్రయం ఆవిడ ప్రతి మాటలోనూ వినిపిస్తోంది.

ఆ పంచాయతీలో పంపకం విషయంలో వాదోపవాదాల ప్రసక్తేలేదు.

నా గురించి ఆలోచించేవారుగానీ, నా తరుపున మాట్లాడేవారు గానీ ఒక్కరూ లేకపోవడమే అందుకు కారణం.

ఎవరో ఏదో చెబుతున్నారు. ఎవరో "కాదు" అంటున్నారు. మరెవరో "అవును" అంటున్నారు.

ఇవేవీ నా మనస్సుకెక్కడం లేదు.

"ఈమధ్యనే దానిపేర పది ఎకరాల కొబ్బరితోట కొన్నాడు" అరచి చెప్పారు ఎవరో.

నిజమే...సంవత్సరం క్రితం డాక్టరుగారు నాపేర కొబ్బరితోట కొన్నారు.

"ఇంకేం..అన్నీ తన పేర కొనిపించుకుని మనిషిని అయిపు లేకుండా చేసిందన్న మాట. ఆడది ఎంతకయినా తగును" అంటున్నాడో భార్యా బాధితుడు.

వస్తూన్న నిట్టూర్పును బలవంతంగా ఆపుకున్నాను.

పరిస్థితులు కలిసిరాకపోతే తాడే పామై కరుస్తుందంటారు. అది నా విషయంలో నూటికి నూరుపాళ్ళూ నిజమై కూర్చుంది.

ఉన్నట్లుండి ఒకరోజు డాక్టరుగారు ఏవో కొన్ని దస్తావేజు కాగితాలు తెచ్చి నా చేతుల్లో పెట్టారు.

"ఏమిటి యివి...?" అటూ ఇటూ తిప్పుతూ అర్థంగాక అడిగాను.

"మొన్న బేరం చేసిన కొబ్బరితోట నీపేర రిజిస్ట్రేషన్ చేయించాను"

"నా పేరనా....? ఎందుకూ...?" ఆశ్చర్యంగా అడిగాను.

"సౌమ్య అనేపేరు అందంగా, ఆకర్షణీయంగా వుంది. అందులోనూ అది నాకు చాలా నచ్చిన పేరు. అందుకే అంద

మయిన కొబ్బరితోట ఆ పేరున వుండ టమే అందం"

"ఇది నాపేర వద్దు. వెంటనే మార్పిం చండి" హఠంచేశాను.

"కాదులే సౌమ్యా! రేపు ఎటుపోయి ఎటువచ్చినా ఇది నీకు ఆధారంగా వుంటుంది. నా మాట విను" నెమ్మదిగా నిశ్చయంగా చెప్పారు.

డాక్టరుగారు అలా మాట్లాడారూ అంటే ఇంక దానికి తిరుగుండదని అర్థం. నేనేమి చెప్పినా, ఏంచేసినా ఇక అది మారదు. ఇది నా స్వానుభవంతో గ్రహించిన విషయం.

అందుకే ఆ తరువాత నేనేమీ మాట్లాడ లేదు.

ఆ రకంగా పదిఎకరాల కొబ్బరితోటకు అధికారిణిని అయ్యాను.

ఎవరో, ఏవో కాగితాలుతెచ్చి వాటి మీద సంతకాలు చెయ్యమన్నారు.

కొబ్బరి తోటమీద నేను సర్వ హక్కులూ వదులుకుంటున్నట్లుగా, ఇది నా ఇష్టప్రకారం ఎవరి బలవంతమూ లేకుండా జరిగిన ఏర్పాటు అయినట్లుగా రాసివున్న కాగితాలూ అవి.

మౌనంగా సంతకాలు చేశాను.

'కాదు' అనే అవకాశంలేదు నాకు. చేయనని చెప్పే ధైర్యం లేదు. ఆకలి గొన్న పులుల్లా నావంక చూస్తూ, ఏమాత్రం అవకాశం దొరికినా నన్ను ఏదో రకంగా అవమానపరచేందుకు సిద్ధంగా వున్న జనాన్ని చూస్తూ మౌనంగా వుండి పోయాను. ఈ పరిస్థితి ఎవరికయినా కలిగితే ఏంచేస్తారో కానీ నేనుమాత్రం అదే చేశాను.

కానీ వీళ్ళెవ్వరికి తెలీని విషయం ఒకటుంది—

ఈ ఆస్థిపాస్థుల మీద నాకు వ్యామోహం లేదు. ప్రేమ పంచగలిగితే ఈ పిల్లలకొరకు బతుకంతా కరిగించుకోగల నని, నా సర్వస్వం వాళ్ళకొరకు త్యాగం చెయ్యగలనని.

బంగారం నలుగురి పిల్లలకూ సమా నంగా పంచేశారు పెద్దలు. అలాగే బ్యాంక్‌లో క్యాష్, కారూ, పొలమూ పంపకం చేశారు.

ఈ పంపకాలేవీ నా మనస్సుకు అంట లేదు.

ఇక మిగిలింది ఇల్లు—

ఇల్లు కూడా నాలుగు వాటాలుగా మారింది.

ఇప్పుడు మాత్రం నా గుండెల్లో దుఃఖం సుళ్ళు తిరిగింది.

ఇల్లు వదులుకోడానికి మానసికంగా నేను సిద్ధంగా లేను.

ఆ ఇంట్లో కనీసం ఒక్క భాగం కాక పోయినా ఒక్క గది అయినా నాకు చెందాలని నా కనీసపు కోరిక.

ఆ యిల్లు నాది అనే మమకారాన్ని ఒదులుకోలేని 'సెంటిమెంట్'.

డాక్టరుగారు మా పెళ్ళయిన తరువాతే ఆ యిల్లు కట్టించారు. నా అభిరుచులకు అనుగుణంగా, అందంగా దగ్గరవుండి కట్టించుకున్నా నా యిల్లు. ఆ యింటికి సంబంధించిన ప్రతి అంగుళంలోనూ నా కలలు గూడుకట్టుకున్నాయి.

మనిషిగా నేను కొన్ని అతి ముఖ్య మైన సుఖాలకూ, సంతోషాలకూ దూరం అయిన విషయం ఎంత మందికి తెలుసు. ప్రపంచంలో అందరికీ అన్ని సంతో షాలూ అందుబాటులో వుండవు. అలాగే నేనూ కొన్ని పోగొట్టుకున్నా సాంఘిక మైన రక్షణ, గుర్తింపు పొందగలిగాను.




ివి చాలు నాకు.

కానీ పోగొట్టుకున్న సుఖాలను తలుచుకుంటూ ప్రతి నిమిషం దైన్యంగా, దీనంగా గడపడం నాకు నచ్చని విషయం.

అందుకే కొత్తరకం చీరలూ, నగలతో 'డాక్టరుగారి భార్య'గా ఆడంబరంగానే కన్పించేదాన్ని.

నాది అనుకున్న ఈ యింటిని కూడా అలాగే తీర్చిదిద్దుకున్నాను.

ఒక్కటేమిటి ఆ ఆవరణ, అందులోని ప్రతి మొక్కా నాకు ప్రాణం. రకరకాల గులాబీ మొక్కలు సేకరించి, పెంచి, దోసెడు వెడల్పున రంగు రంగుల పూలు పూయించాను స్వయంగా తోట పనిచేస్తూ.

'అబ్బ ... డాక్టర్ కృష్ణమోహన్ గారింట్లో ఎన్నిరకాల అందమైన గులాబీలో' అనే ప్రశంస సంపాదించాను.

అలాంటి అపురూపమైన, అందమైన నా ఈ చిన్ని తోటనూ, ఈ యింటినీ మనస్ఫూర్తిగా త్యాగం చెయ్యలేకపోయాను.

కానీ పెదవి విప్పేందుకూ, పన్నెత్తి పలికేందుకూ నాకు రవ్వంత అవకాశం కూడా లేదు.

దుఃఖాన్ని దిగమింగుతూ, గుడ్లనీరు గుడ్ల కుక్కుకుంటూ కాగితాలమీద సంతకాలు చేశాను.

నీరజ ఓదార్పుగా నా చెయ్యి తన చేతిలోకి తీసుకుంది.

ఆస్థి పంపకం అలా జరిగిపోయింది.

పోతే పిల్లల సంరక్షణభారం ఎవరు వహించాలన్నది తరువాతి ప్రశ్న. ఈ నాలుగు రోజులుగా నలుగురూ చేరినప్పుడల్లా "ఎంత అన్యాయం జరిగిపోయిందే తల్లీ!" అంటూ ఘొల్లుమనే జానకమ్మ అందరి దృష్టిలోకి వచ్చింది.

పంచిన ఈ ఆస్థిపాస్థులతో పాటుగా, చిన్నితోసహా పిల్లలందరి సంరక్షణా జానకమ్మకు అప్పగించబడింది.

కళ్ళల్లో పొంగే సంతోషం కనిపించకుండా తలవంచుకుని చిన్నిని దగ్గరగా తీసుకుని కళ్ళు తుడుచుకొంది జానకమ్మ.

నా చిన్ని ... నా ... చిన్ని ... నా మనసు ఆక్రోశించింది.

అసహ్యంగా తల బాదుకుంటూ,ఒక్క మాటలో చెప్పాలంటే మోటుగా, అనాగరికంగా పిచ్చిదానిలా ఏడ్చేశాను.

నా దుఃఖాన్ని మరోరకంగా అర్థం చేసుకున్నారు పంచాయితీ పెద్దలు. నాకు చెందకుండా పోతున్న ఈ ఆస్థిపాస్థుల కోసం నా ఈ దుఃఖం అని అర్థం చేసుకున్నారు.

ఆస్థికోసం అమానుషంగా ప్రవర్తించిన నాలాంటి ఆడదానికి అది కావలసిన శిక్షే అని కసిగా పళ్లు నూరుకున్నారు జనం.

"డాక్టరుగారి భార్యగా ఆమె జీవికకూ ఏదో ఏర్పాటు చెయ్యండి..."

ఇంకా ఏమూలో మానవత్వం మిగిలివున్న ఓ ధర్మాత్ముడు పంచాయితీకి సూచించాడు. అతను...అతను... డాక్టరుగారి అన్నగారు.

మనిషి మనస్సు ఎంత విచిత్రంగా వుంటుంది. మనం ఏదో ఎంతో అర్థం చేసుకున్నాం అనుకుంటాంగానీ, ఏ మనిషి మనస్సునూ పూర్తిగా అర్థం చేసుకోలేం.

మనిషి ఏ పరిస్థితుల్లో ఎలా ప్రవర్తిస్తాడని సిద్ధాంతీకరించడం అసంభవం.

చివరికి డాక్టరుగారి వుద్యోగరీత్యా గవర్నమెంటుద్వారా వచ్చే కొంత డబ్బు నాకు చెందేటట్లు నిర్ణయించారు.

అందులో మొత్తం ఎందుకివ్వాలని కొందరంటే, ఆమాత్రమైనా ఇవ్వక పోతే న్యాయంగా వుండదని మరికొంద రన్నారు.

న్యాయం...ఎక్కడి న్యాయం? ఇంత మంది పెద్దల సమక్షంలో నాకు జరిగిన న్యాయం ఎంత...?

"ఆ డబ్బు కూడా నాకు వద్దు. ఏ కూలీ నాలీ అయినా చేసుకుని బతుకుతాను. కానీ నా చిన్నిని నాకివ్వ"మని ఏడుస్తూ అడిగాను.

అదే ఆ పంచాయితీలో నా మొదటి మాట.

అందరూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు ఆశ్చర్యంగా.

"ఏమిటీ... సవతి తల్లికి కూడా పిల్లలంటే ప్రేమ వుంటుందా...? అందులోనూ ఈమెకి..." ఇదీ ఆ ఆశ్చర్యానికి అర్థం.

అప్పటికి ఎంత సేపటినుండో నా దగ్గరకు రావడానికి గింజుకుంటున్న చిన్నిని గట్టిగా పట్టుకుని ఒళ్ళో కూర్చొ బెట్టుకున్న జానకమ్మ, "ఏంతల్లీ! దానికి ఏ మందో పెట్టి చంపించేయాలనుకుంటు న్నావా...?" అంది ఈసడింపుగా.

మనిషి అంత క్రూరమైన జంతువు మరొకటిలేదు.

* * *

"అక్కా....లే! ఇక వెడదాం పద"

నేను నీరజ వంక అయోమయంగా చూశాను.

ఇప్పుడేం జరిగింది...? ఏం జరుగు తోంది?

జరిగింది అర్థం కావడానికో క్షణ కాలం పట్టింది.

నా భవిష్యత్తును నిర్ణయించిన పెద్ద లంతా వెళ్ళిపోయారన్నమాట. ఇక ఆ ఆవరణలో నేనూ, నీరజా, మమ్మల్ని వింతగా చూస్తూ నిలబడ్డ మరికొంతమంది మాత్రం మిగిలాం.

"అక్కా! లే...నీ బట్టలూ, అవీ సర్దుకో....వెళ్ళిపోదాం"

నీరజ వెళ్ళిపోదాం అంటోంది.... ఎక్కడికి వెళ్ళిపోవడం....? నాకెవరు న్నారు...? ఎక్కడికి వెళ్ళడం...?

నాకు నీడనిచ్చే చోటు ఎక్కడుంది?

నీరజకు నా అనుమానం అర్థమైంది.

"మన ఇంటికి వెడదాం పదక్కా... ఆ తరువాత మౌళిని కలిసి ఏం చెయ్యాలో ఆలోచిద్దాం"

మనస్సున్నా, లేకపోయినా మనిషి బతికి ఉన్నంతవరకూ తిండీ, బట్టా తప్పనిసరి. నా బట్టలు తెచ్చుకునేందుకు ఇంట్లోకి వెళ్ళాను.

అందరూ ముఖాలు తిప్పుకున్నారు.

నా బట్టలబీరువా తెరిచాను. జానకమ్మ సలహాతో రమణి అప్పటికే ఖరీదయిన చీరలు తీసి జాగ్రత్త చేసింది.

ఇక మిగిలిన వాటిలో నాలుగు మామూలు చీరలు తీసి సంచిలో వేశాను. ఆ పక్కనే ఉన్న పుస్తకాల బీరువా తెరిచాను.

అవన్నీ సర్దినవి సర్దినట్లుగానే చెక్కు చెదరకుండా ఉన్నాయి.

అంటే, అవి నేను తీసుకుపోయినా వాళ్ళకు బాధలేదన్నమాట....

నాకు నవ్వు వచ్చింది.

ఆ చీరలకంటే కూడా నాకి పుస్తకాలే ప్రాణం అనే విషయం వాళ్ళకు అర్థం కాదు.

నాకు నచ్చిన పుస్తకాలు తీసి సంచిలో పెట్టుకున్నాను.




పుస్తకాలు సర్దుతుంటే డాక్టరుగారి డైరీ కనిపించింది. ఆ డైరీ చూస్తూనే నా కళ్ళల్లో నీళ్ళుచిమ్మాయి.

ఆయన అందించిన ఆత్మీయతా, ఆప్యాయతా నా హృదయంలో పుస్తకంలా తెరుచుకుంది.

ఎందుకిలా చేశారూ ? మీకు నేనేం అన్యాయం చేశానూ??

నా కళ్ళు నిండుకున్నాయి....

డాక్టరుగారి జ్ఞాపకార్థంగా ఆ డైరీ తీసి సంచిలో దాచాను. నా పని పూర్తయింది.

ఇక నాకా ఇంటితో రుణంతీరిపోయింది. ఇప్పుడు బయటపెడితే ఒకప్పుడు నాది అనుకున్న ఆ ఇంట్లోకి మళ్ళీ ఎప్పుడైనా అడుగు పెట్టగలనో లేదో...?

ఒక్కసారి ఇల్లంతా కలయజూశాను.

ఆ ఇంట్లో ప్రతి అణువుతోనూ నాకు అనుబంధం ఉంది.

ఏదని చూసుకోను... ఎంతని చూసుకోను...?

ఇంట్లోంచి అడుగు బయటపెడుతోండగా నా కళ్ళు 'చిన్ని'కోసం వెతికాయి.

ఆ ఇంట్లో నాకు చెందవలసింది మరొక్కటి ఉంది.

అదే....చిన్ని! ఆ ఇంటితో పాటుగానే చిన్నితోనూ నాకు రుణం తీరిపోయింది.

గుండె రాయి చేసుకుని నీరజతో పాటుగా గుమ్మం దాటాను.

ఎక్కడినుండి వచ్చిందో చిన్ని సుడిగాలిలా వచ్చి నన్ను వాటేసుకుంది.

"మమ్మీ...నేనూ నీతో వస్తాను" చిన్ని ఏడుస్తోంటే నా గుండె చెరువే అయ్యింది.

ఎలాగూ హంతకిగా పేరు పడ్డాను. నిజంగానే జానకమ్మను హత్యచేసి చిన్నిని తీసుకుని పారిపోనా!!

ఆవేశపడ్డ మనస్సును వివేకం హెచ్చరించింది.

హత్య చేసిన నువ్వు ఎక్కడుంటావ్? చిన్ని ఏమవుతుంది?

రాక్షసిలా వచ్చిన రమణి, నన్ను గట్టిగా వాటేసుకుని రానని గింజుకుంటున్న చిన్నిని బలవంతంగా గుంజుకుని బరబరా లాక్కుపోయింది.

"నీరజా... నా చిన్నిని నాకు ఇప్పించవూ?" నేనేం మాట్లాడుతున్నానో నాకు తెలీడం లేదు.

ఏడుస్తూ మాట్లాడుతున్నాను... మాట్లాడుతూ ఏడుస్తున్నాను. నా చిన్ని.. నా చిన్ని... దుఃఖంతో నా గుండెలు పగిలిపోతున్నాయి.

"అక్కా! పిచ్చిదానివికాకు... పద" నీరజ బలవంతంగా రిక్షా ఎక్కించింది.

నా కళ్ళు ధారాపాతంగా వర్షిస్తూనే ఉన్నాయి.

మేము ఇల్లు చేరేసరికి మౌళి దిగులుగా అక్కడే కూర్చుని ఉన్నాడు.

అతన్ని చూసిన తరువాత కూడా నాలోని దుఃఖం హెచ్చిందే కానీ తగ్గలేదు.

"పద సౌమ్యా... మన ఇంటికి వెళదాం"

మౌళి 'మన' ఇంటికి వెళదాం అంటున్నాడు. నీరజ 'మన' ఇంటికి వెళదాం అక్కా అంది. నిజానికి ఇందులో ఏదీ నా ఇల్లు కాదు.

నేను బలవంతంగా గెంటివేయబడిందే నిజానికి నా ఇల్లు.

తెగిన గాలిపటం ఎంతెంత దూరం

పాటుగా గుమ్మం దాటాను.

ఎక్కడినుండి వచ్చిందో చిన్ని సుడిగాలిలా వచ్చి నన్ను వాటేసుకుంది.

"మమ్మీ...నేనూ నీతో వస్తాను"

అంటున్నాడు. నీరజ 'మన' ఇంటికి వెళదాం అక్కా అంది. నిజానికి ఇందులో ఏదీ నా ఇల్లు కాదు.

నేను బలవంతంగా గెంటివేయబడిందే

ఎగిరి చివరికి ఎక్కడెలా పతనమవుతుందో ఎవరు చెప్పగలరు...?

రానని చెప్పడానికైనా, వస్తానని చెప్పడానికైనా పరిస్థితులు నా ఆధీనంలో లేవు.

ప్రవాహం ఎటు సాగితే అటు కొట్టుకుపోయే నావలా ఉంది నా బతుకు.

"నీరజా ! సౌమ్యను మా ఇంటికి తీసుకువెడతాను" మౌళి అన్నారు.

"మీరేమీ అనుకోకపోతే నేనో మాట చెబుతాను"

"చెప్పమ్మా! ఇంత ఆపదలో సౌమ్యను నాకంటే ఎక్కువగా ఆదుకున్నదానివి. నీకంటే సౌమ్య క్షేమం కోరేవాళ్ళెవరున్నారు?"

మౌళి గొంతులో వ్యధ...

"అక్క ఈ సమయంలో మీదగ్గర ఉండటం అంత మంచిదికాదు. అక్కను కొంతకాలం మా ఇంట్లోనే ఉండనీయండి. కొన్నాళ్ళు పోయింతరువాత ఏం చెయ్యాలో ఆలోచిద్దాము"

"నువ్వు చెప్పింది కూడా బాగానే ఉందమ్మా! కానీ..."

"ఇందులో మీరు అంతగా సంశయించడానికేముంది? అక్కకు ఏ లోటూ రాకుండా నేను చూసుకుంటాను. సరేనా...?"

"అదికాదు నీరజా నేను ఆలోచించే విషయం. ఏ విషయాన్నీ నిర్ణయించేందుకు నువ్వు స్వతంత్రురాలివి కాదు కదమ్మా! నీ భర్త కూడా అంగీకరించాలిగా..." మౌళి ఇంకా ఏదో చెప్పాల్సి ఉందీ చెప్పలేక పోతున్నట్లుగా రెండు క్షణాలు తటపటాయించి ఆ తరువాత నెమ్మదిగా అన్నారు, "సౌమ్య ఇక్కడ ఉంటే అడపాదడపా నేనూ వచ్చి చూసి పోతుంటాను. మావల్ల మీ భార్యాభర్తలమధ్య ఎలాంటి కలతలూ రాకూడదు..."

నీరజ చిన్నగా నవ్వింది.

"మీ భయం అర్థమైంది అన్నయ్యగారూ! కానీ, ఆయన అలాంటివారు కాదు. చాలా మంచివారు"

"సరే నీరజా! నీ ఇష్టం. నీకంత నమ్మకమున్నప్పుడు నేనెందుకు కాదనాలి. అయినా నా దగ్గరికంటే సౌమ్యకు నీ దగ్గరే చనువు ఎక్కువ"

నేను మాటా, పలుకూ లేకుండా కూర్చున్నాను.

ఇంతక్రితం పెద్దమనుషల సమక్షంలోనూ నా ప్రమేయం ఏమీ లేకుండానే నా భవిష్యత్ నిర్ణయించబడింది.

ఇప్పుడూ అంతే! నీరజా, మౌళీ కలసి నేనెక్కడ వుండాల్సింది నిర్ణయించారు.

నా ప్రమేయం లేకుండానే ఒకదాని వెంట ఒకటిగా సంఘటనలు జరిగిపోతున్నాయి. ఈ నిర్ణయాలని కాదని చెప్పడానికిగానీ, ఔనని చెప్పడానికిగానీ నాకు మరో అవకాశం ఎక్కడుంది?

మౌళి నన్ను ధైర్యంగా వుండమని మరీమరీ చెబుతూ వెళ్ళలేక వెళ్ళలేక వెళ్ళిపోయాడు.

నాకు మిగిలిన ఒకే ఒక్క కార్యక్రమం ఆలోచిస్తూ కూర్చోవడం. భవిష్యత్తును అందుకోలేని మెదడు అందిన భూతకాలం గురించీ, జరుగుతున్న వర్తమానం గురించీ మాత్రమే ఆలోచిస్తోంది.

నేను ప్రస్తుతం నీరజ ఇంట్లో ఉండాలని నిర్ణయించబడింది. ఎంత కాలం...? ఆ తరువాత...?




హంతకిగా ముద్రపడిన ఒక స్త్రీకి ఆశ్రయం ఇవ్వడానికి నీరజ భర్త ఇష్టపడతాడా....? నీరజ భర్త కాంపు నుండి వచ్చిన తరువాత అతను నా ఉనికిని ఇష్టపడకపోతే నేనెక్కడికి వెళ్ళగలను...?

మౌళి ఏమన్నాడూ....?

అన్నట్లు చిన్ని ఏం చేస్తోందో. ఈ పాటికి నిద్రపోయి వుంటుందా? లేకపోతే "అమ్మా" అంటూ నా కోసం ఏడుస్తోందో...

కన్నీళ్ళు కురిపించే ఆలోచనలు.

ఆఁ... అన్నట్లు మౌళి ఇందాక ఏమన్నాడూ...?

"పద సౌమ్యా! మన ఇంటికి వెడదాం" అన్నాడు కదూ?

మౌళి ఇల్లు నా ఇల్లు అవుతుందా...?

* * *

కలత నిద్ర...

నిద్రకూ, జాగ్రదావస్థకూ మధ్య వున్న పాయింట్..

భయంకరమైన కలలూ, అంతకంటే కూడా భయంకరమైన ఆలోచనలూ .... నిమితం లేని హృదయం....

డాక్టరుగారు పోయినప్పటి నుండీ భయాలతో, దిగులుతో, ఆలోచనలతో, ఆందోళనతో నిద్రపట్టని అవస...

పడితే భయంకరమైన కలలూ, కలవరింతలూ...ఆ వెంటనే మెలకువా...

నీరజ గదిలోనుండి ఏవో మాటలు వినిపిస్తున్నాయి. నీరజ స్వరంతో పాటు మరో పురుష స్వరం.

నీరజ భర్త క్యాంపు నుండి వచ్చి వుంటాడు. మళ్ళీ రేపటిని గురించిన ఆలోచనలు...బాధ ... భయం,...కలత నిద్రతో తెల్లవారింది.





"అక్కా! ఒక్కసారి బయటికి రావూ? ఆయన్ను నీకు పరిచయం చేస్తాను"

"ఏమండీ... అక్క వచ్చింది" నీరజ చెప్పింది.

టిఫిన్ తీసుకుంటున్న శ్యాంప్రసాద్ ఒక్కసారి తలెత్తి చూసి వెంటనే తల వంచుకుని, "కూర్చోండి" అన్నారు.

నేను మౌనంగా ఒకపక్క కుర్చీలో కూర్చున్నాను.

నీరజ నాకు టిఫిన్ వడ్డించి, "తినక్కా" అంది ఆప్యాయంగా.

వాళ్లెంత ఆదరంగా, ఆప్యాయంగా చూసినా నాతోనే నాలో పుట్టిన బిడియం, మొహమాటం మాత్రం పోవటం లేదు.

నేను వాళ్ళ బంధువును కాను. కేవలం అభ్యాగతిని మాత్రమే. నేనింకా అలాగే కూర్చోడం చూసి, "చూడండి సౌమ్య గారూ...నీరూ నాకంతా చెప్పింది. ఇది మీ స్వంత ఇల్లే అనుకుని మొహమాటం లేకుండా హాయిగా ఉండండి" అన్నారు శ్యాంప్రసాద్.

అందమూ, ఐశ్వర్యమూ, మంచి మనస్సూ ఉన్న భర్త దొరకడం స్త్రీ అదృష్టాల్లోకెల్లా అదృష్టం.

* * *

ఆ రాత్రి...

అర్ధరాత్రి గడిచిన గంటకు నీరజ గదిలో నుండి శ్యాంప్రసాద్ గొంతు కర్కశంగా, అసభ్యంగా మోటుగా విని పించి నవ్వుకున్నాను ఈ లోకంపోకడ చూసి.

శ్యాంప్రసాద్ : నీరజను నిద్రలేపి కూర్చోబెట్టి కేకలు వేస్తున్నాడన్న మాట.

"దాన్ని రేపు తెల్లారేపాటికి పంపిం చకపోతే మాత్రం నీ మర్యాద దక్కదు"

"దేన్ని?" నిద్ర కళ్ళతో మత్తుగా, అయోమయంగా ఉంది నీరజ గొంతు.

"అదే... తెలీనట్లు అడుగుతావేం? 'అక్కా....అక్కా' అంటూ ఇంట్లో తెచ్చిపెట్టావే...దాన్ని. ఏం? ఇప్పటి కయినా తెలిసిందా?" శ్యాం రంకెలు కర్కశంగా వినిపిస్తున్నాయి.

బహుశా నీరజ తెల్లబోయిఉంటుంది.

"అదేమిటి? పొద్దుట మీరేగా ఉండ మన్నారూ...?"

"ఏదో మొహమాటానికి అంటే మాత్రం అడ్డమైనవాళ్ళనూ ఇంట్లో ఉంచుకుంటామా ఏమిటి? అదసలే...పచ్చి లం...."

"ఛ...ఛ. అంతలేసి మాటలనకండీ. అక్క చాలా మంచిది."

అప్పటికే నీరజ వెక్కుతోంది.

'అయ్యో పిచ్చితల్లీ! ఈ దురదృష్ట వంతురాలికోసం నువ్వెందుకమ్మా అంత బాధపడతావు' బాధగా మూలిగింది నా హృదయం. ఆ తరువాత చాలా సేపటి వరకూ శ్యాం రంకెలూ, నీరజ వెక్కిళ్లూ వినిపిస్తూనే వున్నాయి.

అయిపోయింది. ఇక్కడినుండి కూడా నాకు ఋణం తీరిపోయింది.

పూర్తిగా తెల్లవారకుండానే సంచి చేతిలోనికి తీసుకున్నాను.

నీరజతో చెప్పకుండా వెళ్ళడం భావ్యంకాదు. కానీ ఈ సమయంలో నీరజకు చెప్పడం కంటే చెప్పకపోవడమే న్యాయం.

నీరజ దుఃఖం నేను భరించలేను.

నీరజ చూస్తూ చూస్తూ నన్ను వెళ్ళ నివ్వలేదు. వెళ్ళకుండా ఆపగలిగే శక్తి ఆ అమాయకురాలికి లేదు.

ఇప్పటికే నాగురించి ఎంతో శ్రమనూ,

మరెంతో దుఃఖాన్ని భరించింది. ఇంకా ఆమెను దుఃఖపెట్టడం న్యాయం కాదు.

మౌనంగా తలుపు తెరుచుకుని మెట్లు దిగాను.

నాకెవరున్నారు...? నేనెక్కడికెళ్లాలి?

ఈ ప్రపంచం అంతటిలోనూ నేనెరిగిన వ్యక్తి, నన్ను ప్రేమించే వ్యక్తి, నా కోసం ఓ కన్నీటిబొట్టు ఖర్చుచేయగల వ్యక్తి ఒక్కరే.

* * *

"సౌమ్యా...సౌమ్యా...లే....సౌమ్యా" నన్నెవరో కుదిపి కుదిపి లేపుతున్నారు.

కెవ్వుమంటూ అరుస్తూనే లేచి కూర్చున్నాను.

"సౌమ్యా...లే... కళ్ళు తెరువు" మౌళి నన్ను కుదుపుతూ లేపి కూర్చోబెట్టారు. కళ్ళు తెరిచి చుట్టూ చూశాను. అంతా అయోమయంగా వుంది· నా చేతులు మౌళి చేతుల్ని పెనవేసుకుని వున్నాయి.

"సౌమ్యా !లే.... మెలకువ తెచ్చుకో. ఇదిగో ఈ మంచినీళ్ళు తాగు" మౌళి అందించిన మంచినీళ్ళు గడగడా తాగేసి చెమటలుపట్టిన ముఖాన్ని చెంగుతో తుడుచుకుని కాస్త స్థిమితపడ్డాను.

అంతా అర్థం అవుతోంది· మౌళి నా పక్కనే కూర్చుని వున్నారు. అంటే.... నిద్రలో కలగన్నానన్న మాట. ఎంత భయంకరమైన కల... కల గుర్తుకు వచ్చేప్పటికి మళ్ళీ ఒక్కసారి ఒళ్ళు జలదరించింది భయంతో.

"సౌమ్యా! కల వచ్చిందా?"

"ఊఁ..."

"పిచ్చిదానిలా కలకే అంత భయపడిపోతారా?"

నేనుమౌనంగా అతనివంక చూస్తూండిపోయాను. ఎంత భయంకరమైన కలో అతనికేం తెలుసు?

"అబ్బబ్బ...నిద్రలో ఒకటేకేకలూ... ఏడుపూ.... నవ్వూ.... వెక్కిళ్ళూ. చూస్తున్న నాకే చెమటలు పోస్తే..." నవ్వుతూ అన్నాడు మౌళి.

"ఎంత భయంకరమైన కల వచ్చిందో కల అంతా కాకపోయినా జ్ఞాపకమున్నంత వరకూ చెప్పాను.

"ఆలోచనల బట్టే కలలు వస్తుంటాయి. భయం లేదులే... నిద్రపో" మౌళి లేచి వెళ్ళి లైట్ ఆఫ్‌చేశాడు.

కానీ, నాకు మాత్రం పడుకోవాలనిపించక మంచం మధ్యలో అలాగేకూర్చున్నాను–

నిద్రపోతే మళ్ళా కల వస్తుందేమోననే భయంతో.

కింద చాపమీద బెడ్డింగ్ పరుచుకుని పడుకున్న మౌళి పది నిముషాల తరువాత కళ్ళు తెరిచి, "ఇంకా పడుకోలా?" అన్నాడు.

"ఊహుఁ..." తల అడ్డంగాఊపాను.

"అదేం...?"

"నాకు...నాకు భయం వేస్తోంది"

ఒక్కక్షణం ఆలోచనగా మొహం పెట్టి, మౌళి లేచి వచ్చి నా మంచం దగ్గరగా కూర్చుంటూ, నా చేతిని తన చేతిలోకి తీసుకుని, "నేనిలా నీ దగ్గరగా కూర్చుంటే అప్పుడు భయం వుండదుగా" అన్నాడు.

"ఊహుఁ..."

"అలా అయితే నేనిలానే కూర్చుంటాను. కళ్ళుమూసుకో. నిద్ర పడుతుంది"

మౌళి చెప్పినట్లే అతని చేతిని గట్టిగా పట్టుకుని పక్కకు ఒత్తిగిల్లి కళ్లు గట్టిగా మూసుకున్నాను.

మౌళి నా తల నిమురుతూ వుండి

పోయాడు.

ఆ చేతుల్లోనుండి అంతర్గతంగా ఆప్యాయత, ధైర్యం, ఓదార్పు నాలోకి ప్రవహిస్తోంది.

'ఎన్ని కష్టాల్లోనూ ఈ చెయ్యి నిన్ను వదలదుసుమా!' అన్న అభయం ఇస్తోంది.

నీరజ ఇంటినుండి బయలుదేరిన నేను మౌళిని చేరుకున్న విధం మననం చేసుకుంటూ కళ్లు తెరిచి మౌళి వంక చూశాను.

అతను తదేకంగా నావంక చూస్తున్నాడు.

ఆ కళ్ళల్లో....

అంతులేని దయ

అవధులు లేని ప్రేమ

నిష్కల్మషమైన కామన

నేను అతనివంక అలాగే చూస్తూ పడుకున్నాను.

మౌళి మృదువుగా నా కనురెప్పలు చేత్తో మూశాడు.

మాది సాంఘికంగా చట్టబద్ధమైన అనుబంధం కాదు.

మౌళి చేతులు ఆప్యాయంగా నా వెన్ను నిమురుతున్నాయి.

"సౌమ్యా ... ఐ లవ్‌యూ ... ఐ లవ్‌యూ ... మై లవ్ ... ఐ లవ్‌యూ సౌమ్యా...సౌమ్యా...."

మౌళి అస్పష్టంగా గొణుగుతున్నాడు నన్ను గుండెలకు హత్తుకుని.

"సౌమ్యా!ఇక నిన్నెక్కడా వుంచను. అలా వుంచి ఇప్పటికే చాలా తప్పు చేశాను. కష్టాలైనా, అవమానాలైనా ఇద్దరం కలిసే అనుభవిద్దాం"

అంతే...అప్పటినుండీ నా నివాసం మౌళితోనే స్థిరపడిపోయింది.

* * *

మౌళితో కలిసి సినిమాలకూ - షికార్లకూ యథేచ్ఛగా తిరుగుతున్నాను. ఒకప్పుడు కాకతాళీయంగా సినిమాహాల్లో మౌళితో కలిసి కూర్చుని సినిమా చూసేందుకే వణికిపోయిన పిరికితనం ఈనాడు నాలోలేదు.

నన్ను ఇంట్లో వుంచుకున్నందుకు గాను మౌళి తల్లిదండ్రులూ, అక్కచెల్లెళ్లూ, బంధువులూ అతనిమీద ధ్వజమెత్తారు.

"ఇంతవరకూ మీకోసం బతికాను. ఇకనుండి నాకోసం నేను బతుకుతాను. ఇందులో మీకు అభ్యంతరం వుండాల్సిన అవసరం ఏమీలేదు."

మౌళి ఘాటుగా చెప్పిన సమాధానం విని మరి నోరెత్తకుండా వెళ్ళిపోయారు వాళ్లు.

కుటుంబ భారాన్ని మోస్తూ, అక్కచెల్లెళ్ళకు సంబంధాలుచూస్తూ, పెళ్లిళ్లు చేస్తూ, బాధ్యతలమధ్య నలిగిపోతూ మౌళి ఇంతవరకూ బ్రహ్మచారిగానే వుండి పోయారు.

నాకో విషయం అర్థమైంది.

ఈ లోకం పిరికివాళ్ళనూ, తనను చూసి భయపడేవాళ్ళనూ మరింత భయపెట్టి క్షణక్షణం వాళ్ళకు నరకం చూపిస్తుంది.

కానీ తనను లెక్కచేయకుండా "కేర్ నాట్" అనేవాళ్ళకు దాసోహం అంటుంది.

ఈ లోకంలో ఎందరో చరిత్రహీనులైన మనుషులున్నారు.

భర్తలను అడ్డుగాపెట్టుకుని వ్యభిచరించే స్త్రీలున్నారు...

పచ్చిగా, విశృంఖలంగా తిరిగే తిరుగుబోతులున్నారు...

కార్లలో తిరుగుతూ 'సొసైటీమూవ్'




పేరిట నాగరికతకు కొత్త అర్థాలు చెప్పే హై సొసైటీ లేడీస్ వున్నారు...

వీళ్ళందర్నీ ఈ లోకం ఏంచేస్తోంది?

కాకపోతే ఫలానా ఆవిడ ఇలా... ఫలానా అతను అలా....అని చాటుగా చెప్పుకుంటుంది.

దీనివల్ల వాళ్ళకు తరిగిపోయేదేముంది?

ఎవరి మనస్సాక్షికి వాళ్లు కట్టుబడి వుండాలనేదే నా నీతి.

నేను నీతిగా నిజాయితీగా బతుకుతున్నా ఈ లోకం నన్ను నా వంటరితనం కారణంగా వేలెత్తి చూపిస్తూనే వుంది...వెంటాడుతూనే వుంది. అలసటలో పరుగులు పెడుతుంటే చూసి నవ్వుకుంది. కానీ ఈరోజు....ఎదురు తిరిగిన నన్ను ఏమీ చెయ్యలేదీలోకం.

* * *

"భోజనానికి రండి"

"ఊఁ"

"వడ్డించాను"

"ఊఁ"

"చల్లారిపోతోంది''

''ఊఁ..."

ఇక ఈ 'ఊఁ'ల ప్రవాహం పెన్ మూసేవరకూ అలా సాగిపోతుంది ఊరుకుంటే.

"నేను చెప్పేదేమయినా వినిపిస్తోందా ?" గట్టిగా అంటూ కాగితాల మీద చెయ్యి అడ్డుపెట్టాను.

మౌళి రాస్తున్న కాగితాలమీదనుండి తలెత్తిచూస్తూ, "ఏమిటి సౌమ్యా?" అన్నాడు.

"అన్నం వడ్డించి అరగంటనుండీ పిలుస్తున్నాను...కాదు అరుస్తున్నాను"

"అఫ్‌కోర్స్...నువ్వు అరిచినా నాకు సంగీతంలానే వినిపిస్తుందనుకో" అంటూ నవ్వారు.

నాకూ నవ్వు వచ్చింది.

"అయిపోయిందా? నేను చదవనా?" అన్నాను కాగితాలవంక ఆసక్తిగాచూస్తూ.

"నువ్వు తప్పకుండా చదవాలి.. అయితే ఇప్పుడు కాదు. ముందు భోజనం. ఆకలి దంచేస్తోంది"

పాపం నేను పిలిచేవరకూ ఈ ఆకలి ఎక్కడికి పోయిందో...అప్పటికి మూడు రోజులుగా రాత్రీ-పగలూ అన్నట్లుగా శలవుపెట్టి కూర్చుని మరీ రాస్తున్నాడు మౌళి.

మౌళి భోజనానికి కూర్చుంటూ, "నువ్వూ వడ్డించుకో సౌమ్యా" అన్నాడు.

నేనూ వడ్డించుకున్నాను.

"ఎంతవరకూ వచ్చింది నవల?"

"అయిపోవచ్చింది."

"థీమ్ ఏమిటి?"

''చదువుతావుగా"

నవల గురించి కబుర్లు చెప్పుకుంటూ భోజనం చేస్తున్నాము. మౌళి ప్లేట్లో కూర మరికొంత వడ్డించబోయాను.

"ఊహుఁ చాలు... వద్దు" చెయ్యి అడ్డుపెట్టాడు మౌళి.

"ఏం బావుండలేదా?"

''చాలా బ్బావుంది సౌమ్యా! నీకు తెలుసా....ఈ మూడు నెలల్లోనూ నేను నాలుగు పౌన్లబరువు పెరిగాను. ఈ రేషియోలో పెరుగుతూ పోతూవుంటే మన పేరు గిన్నిస్ బుక్‌లోకి తప్పకుండా ఎక్కుతుంది. 'ప్రపంచంలోకెల్లా అతి పెద్ద స్థూలకాయుడు' అని"

"అందుకని డైటింగ్ చేస్తున్నారా?" నవ్వుతూ అడిగాను.

"ఊహుఁ...అదీ లాభంలేదు. ఇంత రుచిగా వంటకాలు ఎదురుగా వుంటే

డైటింగ్ చేయడం...ఇంపాజిబుల్... ఇప్పటికే ఒక డైటింగ్‌తో తలమునక లవుతున్నాను".

"ఇంకో డైటింగ్ ఏమిటి?"

"చెప్పను. నువ్వు కోప్పడతావు" అన్నాడు నవ్వేస్తూ.

నవ్వుతున్న మౌళి వంక నిదానంగా చూశాను. నిజమే ఇదివరకటికంటే మౌళి కొంచెం ఒళ్ళుచేసి పచ్చగా కనిపిస్తున్నాడు.

మౌళి భోజనం పూర్తిచేసి, "సౌమ్యా! త్వరగా రా. నవల చదువుదువుగాని" అన్నాడు.

వంటగది సర్ది వెళ్ళి టేబుల్‌దగ్గర కూర్చున్నాను.

అప్పటికే మౌళి సీరియస్‌గా రాసుకుంటున్నాడు. నేను వెళ్ళడం చూసి అంతకు ముందు రాసిన కాగితాలు తీసి నా ముందుంచి తను రాసుకోడం ప్రారంభించాడు.

నవల చదవడం ప్రారంభించాను.

కొన్ని పేజీలు చదివేప్పటికి నా ముఖం వెలవెలపోయింది.

నా చేతిలో కాగితాలు సన్నగా కంపిస్తున్నాయి. పాలిపోయిన ముఖంతో "ఇది.. ఇది..." అన్నాను హీనస్వరంతో.

మౌళి తలఎత్తి దీర్ఘంగా చూశాడు నా వంక.

"సౌమ్యా! నీకు ఇష్టం లేదా?"

"ఎందుకిలా చేస్తున్నారు మీరు?" అన్నాను కోపంగా.

"సౌమ్యా! అందరూ ఒకరకంగానే అనుకుంటున్నారు, ఆలోచిస్తున్నారు. నీ గురించిన నిజం కొంత ప్రపంచానికి తెలియాలి. కనీసం ఆలోచించగలవాళ్ళయినా నిజం తెలుసుకుంటారుగదా...అదే నా ఈ ప్రయత్నం"

"వద్దు...వద్దు. నా గురించిన నిజం ఏదీ ఈ ప్రపంచానికి తెలియక్కర్లేదు. తెలిసిందిచాలు... ప్లీజ్ వద్దు ... వద్దు" హిస్టీరిక్‌గా అరుస్తూ కుర్చీలోనుండి లేచాను.

మౌళి నావంక ఆశ్చర్యంగా చూశాడు.

"ఆవేశపడకు సౌమ్యా .... ఆవేశం లేకుండా ఆలోచించు. నీవు చేసిన తప్పేముంది? ఎందుకంతగా భయపడతావు?"

"వద్దు. నా గురించి మరోసారి పదిమందీ చర్చించుకోడం నేను సహించలేను. ఆ హింస నేను భరించలేను"

నా కళ్ళముందు డాక్టరుగారి మరణమూ, ఆయన ఇంటి ఆవరణలో జరిగిన పంచాయతీ, కోర్టుహాలూ-ఇలా అన్నీ చోటుచేసుకున్నాయి.

భయంతో జలదరించాను.

మౌళి లేచివచ్చి నా భుజాలు పట్టుకుని నన్ను కుర్చీలో కూర్చోబెట్టాడు.

"సౌమ్యా! నీ అభ్యంతరం ఏమిటో వివరంగా చెప్పు"

"ఈ రచన చదివి నా గురించి లోకమంతా మరోసారి అసహ్యంగా చర్చించుకోడం నేను భరించలేను"

"అలాంటివాళ్ళు కాసేపు చెప్పుకుని మానేస్తారు. కానీ సహృదయులైన కొంత మందయినా ఆలోచిస్తారుగా!"

నాకు కోపం వచ్చింది అతని వివరణ విని.

"అవును. ఆ అనుకునేది నిన్ను కాదుగా....అందుకే నీకేమీ బాధవుండదు. ఆ అవమానం భరించడం ఎంత దుర్భరమో ఆడదానివై వుంటే నీకు తెలిసేది....కాకపోయినా ఆ నింద నీ మీదకు వచ్చివుంటే నీకు తెలిసేది."

మౌళి ముఖం వెలవెలపోయింది.

అతని ముఖం చూసిన తరువాతగానీ నేనెంత కఠినంగా మాట్లాడానో నాకు అర్థంకాలేదు.

"ఆల్‌రైట్ సౌమ్యా..నీకిష్టం లేకుండా నేనేమీ చెయ్యను. ఇదిగో నీ కళ్ళముందే ఈ కాగితాల్ని చింపివేస్తున్నాను"

మౌళి బొత్తిగా పట్టుకున్న కాగితాలను అడ్డంగా చించి వేస్ట్ పేపర్ బాస్కెట్‌లో వేశాడు.

అలా జరుగుతుందని ఊహించని నేను నిర్విణ్ణురాలనై చూస్తూండిపోయాను.

"సౌమ్యా ... ఇక దీనిగురించి ఆలోచించకు. పద... చాలా రాత్రయింది. పడుకుందువుగాని"

మౌళి నన్ను రెక్క పట్టుకుని లేపి మంచం దగ్గరకు నడిపించుకువెళ్ళాడు.

"హాయిగా నిద్రపట్టేందుకు మందివ్వనా....?" అన్నాడు నవ్వుతూ.

నేను అయోమయంగా చూశాను అతనివంక.

ఇతనింత హాయిగా ఎలా నవ్వగలుగుతున్నాడు?

ఇతనికేమీ బాధగాలేదా?

ఇంతశ్రమా వృథా అయినందుకు కష్టంగా లేదా?

అయోమయంగా చూస్తున్న నా ముఖాన్ని రెండు చేతుల్లోకి తీసుకుని నుదుటిమీద మృదువుగా చుంబించి "ఇక నిద్రపో...హాయిగా నిద్రపడుతుంది" అన్నాడు.

నేను పక్కమీద వాలాను. కళ్ళు మూసుకుని పడుకున్నా కందిరీగల పుట్ట లాంటి ఆలోచనలు...

ఒక రచయిత తన స్వంత చేతుల్తో తన కథను చింపివేశాడూ అంటే, ఒక మాతృమూర్తి చేజేతులా తన కన్నబిడ్డను చంపుకోవల్సి వచ్చినప్పటి వేదన అన్నమాట.చేతులారా పెంచిన మొక్కను పీకవలసి వస్తేనే నేను ఎంతో బాధ పడతానే...

నా మాటలు అతన్ని ఎంతగా గాయపరచకపోతే అతనా పనిచేస్తాడు. ఎంతో కష్టపడి రాస్తున్నాడా నవల.

నా ఈ కథను చదివిన ప్రజలు ఏమనుకుంటారు?

సౌమ్యను ప్రజలు దాదాపుగా మరిచిపోతున్నారు. ఈ నవలవల్ల వాళ్ళ జ్ఞాపకాల్లో సౌమ్య మరోసారి కదులుతుంది.

కాసేపు అసహ్యంగా తిట్టుకుంటారు అంతేగా.

ప్రళయకాల ఝంఝూమారుతాన్నే తట్టుకుని నిలబడగలిగిన నేను ఈ మాత్రపు మామూలు సుడిగాలిని తట్టుకోలేనా?

ఒక నిర్ణయానికి వచ్చినట్లుగా మంచం మీద లేచి కూర్చున్నాను.

బెడ్‌లైట్ కాంతిలో మౌళివంక చూశాను.

కళ్ళు మూసుకుని పడుకున్న మౌళి ముఖం అమాయకంగా, నిర్మలంగా కనిపించింది.

లేచి టేబిల్ దగ్గరగా నడిచాను. నిశ్శబ్దంగా బాస్కెట్‌లోనుండి చినిగిపోయిన పేపర్సు తీసి సరిగ్గా సెట్ చేసి అంతక్రితం మౌళి కథలు కొన్ని ఫెయిర్ చేసి ఉన్న అనుభవంతో ఫెయిర్‌చేయడం ప్రారంభించాను...

కొంతసేపటికి రాతలో పూర్తిగా మునిగిపోయాను. నావెనక ఏదో చిన్న కదలిక...

ఉలిక్కిపడి భయంతో చప్పున వెనక్కి తిరిగి చూశాను.

నా వెనక 'మౌళి' నేను చేస్తున్న పనిని ఆశ్చర్యంతో చూస్తున్నాడు. క్రమంగా అతని ముఖంలో సంతోషం వెన్నెలజాడలా పరుచుకుంది.

పెదవులూ, కళ్ళూ, చిరునవ్వుతో మెరుస్తూండగా అన్నాడు "థాంక్యూ సౌమ్యా! థాంక్స్ ఎ లాట్..."

అతని ఆనందాన్ని చూస్తున్న నాకు చాలా తృప్తి కలిగింది.

"నవలకు ఏం పేరు పెడుతున్నారు?" అన్నాను చిరునవ్వుతో.

"నువ్వే చెప్పాలి అది..."

నేను మౌనంగా రాయడంలో మునిగి పోయాను.

మౌళి నాకు ఎదురుగా ఉన్న కుర్చీ దగ్గరగా జరుపుకుని కూర్చుంటూ "సౌమ్యా! నువ్వు నిజంగా మనస్ఫూర్తిగానే ఒప్పుకుంటున్నావా...? లేకపోతే నేను బాధ పడతానని నీ మనస్సును కష్ట పెట్టుకుంటున్నావా...?"

నేను తల ఎత్తి మౌళి వంక చూశాను.

అందమైన, నిర్మలమైన ముఖం. అందమైన మనిషికి అందమైన మనస్సు... కనీసం నా కళ్ళకు అలా కనిపిస్తున్నాయి.

"చెప్పు సౌమ్యా..."

నేను అల్లరిగా నాలుక బయటపెట్టి వెక్కిరించాను.

నా జవాబు మౌళికి తెలిసిపోయింది నేను చెప్పకుండానే.

అతని ముఖంలో దాచుకోలేని ఆనందం "అలా వెక్కిరిస్తే ఏం చేయాలని పిస్తుందో తెలుసా?"

"ఏం చేయాలనిపిస్తుంది?"

"ఆ తేనె పెదవులు రెండూ కొరికేయా లనిపిస్తుంది"

మౌళి ముఖంలో, ఆ కళ్ళల్లో కని పించిన కోరిక నన్ను హెచ్చరించింది – మగవాణ్ని ఏ కొంచెం కూడా రెచ్చకొట్ట కూడదు సుమా...అని.

"మీరు ఇంకా ముగింపు రాయలేదను కుంటాను"

మౌళికి నా భావం, నా భయం అర్థమై నట్లుగా నవ్వుకున్నాడు.

"ఊఁ...'క్షణక్షణముల్ జవరాండ్ర చిత్తముల్' 'అని ఊరికే అనలేదు ఆ మహానుభావుడెవరో" అన్నాడు తెచ్చి పెట్టుకున్న నిట్టూర్పుతో.

రాతలో మునిగిపోయినట్లుగా నేను తల వంచుకుని మౌనంగా వుండిపోయాను.

మౌళి నవల ముగింపు కొరకు తెల్ల కాగితాలు ముందు వేసుకున్నాడు.

* * *

ఆనందంతో ఉక్కిరిబిక్కిరి కావడం అంటే ఏమిటో నాకు ఈరోజే తెలిసింది.

భరించలేని ఆనందంతో కన్నీళ్ళు రావడం ఈనాడే జరిగింది. ఆనందంతో సతమతమైపోతూ ఏమీ చెయ్యలేకా, చెయ్యకుండా వుండలేకా 'గుండె గొంతులోన కొట్లాడటం' అంటే ఏమిటో ఈవేళే తెలిసింది.

నా ఎదుటవున్న మౌళిని ఆనందంతో చుట్టివేయాలనే కోరికనూ, చిన్నిపాపలా ఎగిరి గంతులు వేయాలనే పట్టరాని ఉత్సాహాన్నీ, యువతిగా ఆనందంతో గొంతెత్తి పాడాలనీ, ఆనందంతో నృత్యం చేయాలనే పొంగునూ బలవంతాన అణచు కున్నాను.

నా ఆనందాన్ని చిరునవ్వుతో మౌనంగా గమనిస్తున్నాడు మౌళి. కన్నార్పకుండా నావంక చూస్తున్న




మౌళిని చూసి సిగ్గుపడుతూ నవ్వాను.

జీవితంలో మొదటిసారిగా స్త్రీగా సిగ్గుపడ్డాను.

ఆనందంతో, సిగ్గుతో అధరాలు వణుకుతూండగా మృదువుగా నవ్వుతూ సంజాయిషీ ఇస్తున్నట్లుగా మౌళితో అన్నాను –

"నాకు చాలా సంతోషంగా వుంది"

"నిజంగానా...?" అల్లరిగా అన్నాడు మౌళి.

"ఊఁ... నిజంగానే... నిజంగా..." అంటూ అల్లరిగా నాలుక బయటపెట్టి వెక్కిరించాను.

"ఇదిగో అలా రెచ్చగొడితేనే ఆ తేనె పెదాలు రెండూ కొరికెయ్యాలనిపిస్తుంది"

నేను తప్పైపోయింది అన్నట్లుగా అరచేతులు చెంపలకు తగిలించుకున్నాను చెంపలు వేసుకుంటున్నట్లుగా.

మౌళి నవ్వాడు "అబ్బో... అల్లరి పెరిగిపోయిందే"

నేనూ నవ్వుతూ "నిజంగా నాకెంత సంతోషంగా వుందో" అన్నాను.

"ఎంత...?"

"ఊఁ...ఎంత....అంటే... అంటే కొండంత..."

"అలాగా"

ఆ క్షణాలలో ఆనందంతో పసిపాపలా మారిపోయాను. పరిపూర్ణ స్త్రీత్వం చోటు చేసుకుంది నాలో...

"మీకూ సంతోషంగా వుంది కదూ?" నవ్వుతూ అడిగాను.

మౌళి నా చేతులు రెండూ అందుకుని అరచేతుల్లో గాఢంగా చుంబించి తన కెంత ఆనందంగా వుందో తెలియ చెప్పాడు.

నిజానికి నాలోని ఉద్వేగమూ నా

ఆనందాన్ని అలాగే వ్యక్తపరచమని ఆరాటపెట్టినా బిడియంతో ఆగిపోయాను.

కోర్టువారు నన్ను నిర్దోషిగా గుర్తించి నాకు స్వేచ్ఛ ప్రసాదించిన రోజిది.

చెయ్యని నేరానికి ఎంతో క్షోభను అనుభవించాను మానసికంగా ఈ ఆర్నెల్లూ.

మౌళి అండలేకపోతే ఏ గాలికో, ధూళికో కొట్టుకు పోయివుండేదాన్నని ఆలోచిస్తేనే గుండెలు వణికిపోతాయి భయంతో.

రమణి సాక్ష్యం ఎంత వ్యతిరేకంగా వున్నప్పటికీ, డాక్టర్ శర్మగారి సాక్ష్యం, ఫింగర్ ప్రింట్స్, పోస్ట్‌మార్టం రిపోర్ట్, ఇలాంటివే మరికొన్ని అంశాల ఆధారంగా కోర్టువారు నన్ను నిర్దోషిగా గుర్తించారు.

నేను ఎంతో - ఎంతో అదృష్టవంతు రాలిని. నిర్దోషులందరూ నాలాగే నిర్దోషులుగా గుర్తించబడుతున్నారా....?

నేరంచెయ్యకపోయినా శిక్ష పడిన వాడిని దోషి అంటుంది లోకం.

అలా అన్యాయంగా అన్యాయానికి బలియైపోయినవారి మానసిక క్షోభను వర్ణించేందుకు మాటలు చాలవు.

వీలయితే గియితే ఈ ప్రపంచాన్నంతటినీ పెట్రోలు పోసి తగలబెట్టాలన్నంత ఆవేశం చోటుచేసుకుంటుంది వాళ్ళలో...

ఇంత క్రితం లేని నేర ప్రవృత్తి చోటు చేసుకుంటుంది వారిలో. ఏమీ చెయ్యలేని నిస్సహాయ కోపంతో కుమలిపోతుంటారు క్షణక్షణం. అంత దయనీయమైన దుస్థితి నాకు కలగకుండా అదృష్టం నన్ను రక్షించింది.

* * *

"సౌమ్యా ! కేసు అయిపోయిందిగా? ఇక ఏం చేస్తావూ...?"

తెల్లబోయి తలఎత్తి అయోమయంగా చూశాను.

అతని ప్రశ్న అర్థమైన వెంటనే దెబ్బతిన్నట్లుగా చివ్వున తల తిప్పుకున్నాను.

కత్తి వాటుకు నెత్తురు చుక్క లేకుండా నా ముఖం పాలిపోయింది.

బాణం దెబ్బతిన్న పక్షిలా గిలగిలలాడింది నా మనస్సు...

అవమానం....బాధ పోటీలు పడి నా హృదయాన్ని తూట్లు పొడిచాయి. నేను మౌళినుండి ఇలాంటి ప్రశ్న ఆశించలేదు.

కేసు ఏమవుతుందా అని భయంతో, భయపడుతూ గడిపానే తప్ప, 'కేసు తరువాత ఏం చెయ్యాలి...?' అనే ప్రశ్న నాకెప్పుడూ కలగలేదు. కేసు ముగిసింది అని తెలిసినక్షణం ఎంతగాఆనందించిందో నా మనస్సు ఇప్పుడీ ప్రశ్నతో అంతగా కృంగిపోయింది.

మౌళి మళ్ళీ అదే ప్రశ్న వేశాడు నా మౌనంతో...

తన ప్రశ్నకు జవాబు కావాలన్నట్లు సూటిగా నా వంకే చూస్తున్నాడు. తప్పదు...ఏదోచెప్పాలి.

"ఏదో ఒక ఉద్యోగం చేస్తాను"

"అప్పటివరకూ...?" అన్నాడు మౌళి తల దువ్వుకుంటూ.

మరో బాణం ... గురిచూసి వేసిన బాణం గురి తప్పకుండానే వచ్చి గుండెల్లో నాటుకుంది. గాయంతరువాత గాయం..

"అప్పటివరకూ అక్కర్లేదు. ఇక ఒక్కక్షణం కూడా ఇక్కడ ఉండను" నా స్వరంలో గాయపడినప్పటి ఆత్మాభిమానం పడగ విప్పింది.

"సరే. కానీ, నేను వచ్చేలోపు




మాత్రం పారిపోకు..." మౌళి మరో మాటకు అవకాశం ఇవ్వకుండా బయటికి వెళ్ళిపోయాడు.

చెప్పలేని బాధ. గుండెలను పిండివేసే బాధ...

'అప్పటివరకూ...?' అంటే.... ఉద్యోగం వచ్చేలోపునే నీ దారేదో నువ్వు చూసుకోవాలనేగా...?

అసలు తనకు 'హక్కు' లేదు అనుకున్నచోట మరోక్షణం మాత్రం తను ఉండగలుగుతుందా...? పైగా లేని పోని భ్రమలతో ఇక్కడ ఇంతకాలం గడిపినందుకు సిగ్గుతో తల వంగిపోతోంది కూడాను.

మనస్సును ఎంతమభ్యపెట్టుకుందామని ప్రయత్నించినా మౌళితో మానసికంగా నాకోవిధమైన సాన్నిహిత్యం ఏర్పడిన మాట అబద్ధం కాదు. అతని పట్ల నా గుండెలోతుల్లో నాకే తెలియకుండా దాగిన ఒక మధుర భావన, క్షణంక్రితం అతన్ని అల్లుకుపోవాలనుకున్న మధురభావనతో బహిర్గతమయ్యింది.

అయితే మౌళి ఇంతకాలంగా నాపట్ల చూపిస్తున్న సాన్నిహిత్యానికి అర్థం ఏమిటి...?

కేవలం ఆశ్రయమిచ్చిన ఔదార్యం మాత్రమేనా...? అదెలా సంభవం...? కానీ మౌళి చాలామంది మగవాళ్ళలాంటి వాడు కాదనేది నిస్సందేహమైన విషయం.

సంచి చేత పట్టుకుని బయలుదేరిన నేను ఎక్కడికని వెళ్ళను....?

మరో ఆధారం లేకుండా బయలు దేరిన నేను తోడేళ్ళూ, గుంటనక్కలూ నివసిస్తున్న ఈ జనారణ్యంలో ఎక్కడికి చేరుకుంటానో నాకు బాగా తెలుసు.

స్త్రీకి వున్న మరో అత్యంత నికృష్టమైన ఆశ్రయం 'బ్రోతల్ హౌస్'. ఈ తోడేళ్ళూ, ఈ గుంటనక్కలూ...ఇవి నన్నక్కడికే చేరుస్తాయి. గమ్యంలేకుండా ప్రయాణం పెట్టుకున్న స్త్రీకి చివరి గమ్యం అదేగా తటస్థపడుతుంది – ఎవరో అదృష్టవంతులకు తప్ప. ముందు ఏదైనా గది అద్దెకు తీసుకుని తర్వాత ఏదైనా చిన్నపాటి పనికోసం ప్రయత్నించాలి. ఏ ఉద్యోగం దొరక్కపోతే కనీసం పనిమనిషిగానైనా, వంట మనిషిగానైనా కుదిరేందుకు నాకేమీ అభ్యంతరం లేదు.

కానీ అదే... అదే సాధ్యంకాని విషయం.

కనీసం రెండు నెలల అడ్వాన్సు అయినా ఇవ్వకుండా కొంత మర్యాదగా బతకగలిగే లొకాలిటీలో నాకు గది ఎవరద్దెకిస్తారు?

నా దగ్గర నాదంటూ చిల్లిగవ్వకూడా లేదు. చేతులూ, మెడా బోసిగావున్నాయి. చెవులకు ఏవో బంగారువే వున్నాయి. చేతికి ఒక రింగ్ వుంది. కానీ ఇవి నావి కావు.

మౌళి ఇచ్చినవి.

నా మనస్తత్వం ఏమిటోగానీ నాకు ఎక్కువమంది పరిచయస్థులుండరు – ఒకరో ఇద్దరో దగ్గరితనం కలిగినవారు తప్ప.

ప్రస్తుతం ఎవరూ లేరు.

ఆలోచిస్తూ కూర్చున్నాను. గమ్యం తెలియనప్పటి నిస్సహాయతతో పదేపదే కళ్ళు నిండుకుంటున్నాయి.

ఛ....ఛ! ఈ కన్నీళ్ళకు బుద్ధిలేదు. వద్దనుకున్నా ఉటికిఉటికి వస్తుంటాయి.

ఈ కన్నీళ్ళు మౌళి కంటపడటం తటస్థిస్తే ఎంత అసహ్యంగా, ఎంత అవమానకరంగా వుంటుంది.

ఛీ...ఛీ... ఇక ఏమైనా సరే నేను ఏడవను. ఏమైతే అదే అవుతుంది. అంతగా మర్యాదగా, గౌరవంగా బతకలేనినాడు ఎందులోనైనా దూకి ఛస్తాను. నేను చస్తే లోకానికేమీ నష్టం లేదుగా? బతకాలని ఉన్నప్పుడే బాధలూ, భయాలూ... చావాలనుకున్నప్పుడు ఇక ఆలోచన ఎందుకూ...?

గబగబా లేచి సంచి సర్దుకున్నాను.

అప్పుడు నేను కట్టుకుని ఉన్నది మౌళి కొన్న చీర. ఆ చీర మార్చి నా చీర కట్టుకున్నాను. మౌళి నా కొరకు కొన్న బట్టలన్నీ జాగ్రత్తగా మడతలు పెట్టి హేంగర్‌లకు తగిలించాను.

చెవుల దిద్దులూ, వేలికున్న ముత్యపు వుంగరమూ తీసి టేబిల్ మీద ఉంచాను.

మరొకసారి ఇల్లంతా కలయదిరిగాను.

నా సంపదలన్నీ అక్కడ మరిచిపోతానేమో అని కాదు నా ఉద్దేశం.

నా జ్ఞాపకంగా ఆ ఇంట్లో నాదంటూ ఒక చిన్న వస్తువు కూడా ఉండకూడదు.

అలాగే మౌళికి సంబంధించిన వస్తువు లేవీ నాతో రాకూడదు.

సంచి సర్దడం పూర్తిచేసి మౌళికొరకు ఎదురుచూస్తూ కూర్చున్నాను.

మరొకసారి అతన్నిచూడ్డం ఇష్టం లేదు. కానీ అతను లేకుండా వెళ్ళిపోవడం కూడా నాకు ఇష్టంలేదు.

అతని వస్తువులన్నీ అతనికి అప్పగించి వెడితేనే బావుంటుంది.

అయిష్టంగానే అతనికొరకు ఎదురు చూస్తూ కూర్చున్నాను.

దాదాపు రెండు గంటల తరువాత అతను వచ్చాడు. చేతిలో ఏదో బాస్కెటూ, పాకెట్సూ వున్నాయి.

మౌళి అవన్నీ టేబిల్ మీద వుంచి కుర్చీలో కూర్చుంటూ అన్నాడు –

"ఊఁ....సరిగ్గా నేను ఊహించినట్లే



వున్నావు. పుణ్యక్రవతం చేసిన సత్య భామలా"

నాకు ఇంకా అక్కడ వుండాలనీ, అతని మాటలు వినాలనీ అనిపించలేదు. కనీసం అతనివంక చూడ్డానికికూడా నా మనస్సంగీకరించడంలేదు. నేను సంచి చేతిలోకి తీసుకుని ఎటోచూస్తూ "ఇంక నేను వెళతాను" అన్నాను.

"నేను రాకుండానే పారిపోతావను కున్నాను" అన్నాడు తాపీగా కుర్చీలో చేరగిలబడుతూ.

"నేనేమీ దొంగనుకాదు. మీ ఇంట్లో ఏమీ దొంగిలించలేదు చెప్పకుండా పారి పోయేందుకు" రోషంగా చెప్పాను.

అతను వచ్చేవరకూ ఆగడం ఎంత మంచిదయ్యింది.

"ఏమో...దొంగిలించినవారు నేను దొంగిలించాను అని చెప్తారా?"

"చూసుకోండి మీ వస్తువులన్నీ సరిగ్గా వున్నాయో లేదో"

"వస్తువులే దొంగిలించాలని ఎక్క డుంది?సరే సౌమ్యా!ఎక్కడికివెడతావు?" చాలా జాలీగా అతను అడుగుతున్న ఆ తీరు చూస్తుంటే నాకు కోపం, ఉక్రోషం అణచుకున్నా ఆగడంలేదు.

నేను ఎక్కడికి వెడితే ఇతనికెందుకూ? ఏ గంగలో కలిస్తే ఇతనికేం? ఈ వివాలన్నీ ఇతనికెందుకు?

"ప్రపంచం చాలా విశాలమైంది. అందులో సౌమ్యకింత చోటు ఉండక పోదు" అన్నాను కఠినంగా.

"ఆహా...అలాగా! సరే అయితే ఏం చేస్తావు?"

నాలో కోపం భగ్గుమంది.

"ఇవన్నీ మీకెందుకు? ఏదో ఒకటి చేస్తాను"

"ఇన్నాళ్ళ పరిచయంలో ఆమాత్రం తెలుసుకోకూడదా?"

బుస్సున పొంగిన పాలమీద నీళ్ళు చిలకరించినట్లు నా కోపం చప్పున చల్లా రింది.

ఔను. ఇతడు నాకు కొంతకాలం ఆశ్రయమిచ్చాడు...పోషించాడు. తప్ప కుండా ఇతడిపట్ల నేను కృతజ్ఞత కలిగి వుండాలి.

"ఉద్యోగం చేస్తాను" అన్నాను నెమ్మదిగా.

"ఎవరిస్తారు నీకు?"

అదిగో....మళ్ళీ వంకర ప్రశ్నలు.

నన్ను అవమానించడమే ఇతని ధ్యేయంగా మారిందా?

ఇంతకుపూర్వం ఇతను ఎప్పుడూ ఇలా ప్రవర్తించలేదే.

"పోనీ సౌమ్యా! నేనోమాట చెబు తాను వింటావా?"

'చెప్పండి' అన్నట్లుగా మౌనంగా ఉండిపోయాను.

"నా స్నేహితుడొకడు పెళ్ళి చేసు కుంటాడట. చేసు..."

"షటప్"

నా అరుపుతో ఆ గది గోడలు దద్ద రిల్లాయి.

నా అణువణువూ ఆవేశంతో దహించుకుపోతోంది. అవమానం నన్ను నిలువునా కాల్చేస్తోంది.

ఇతను నన్నుగురించి ఏమనుకుంటు న్నాడు? అసలు ఇతని ఉద్దేశం ఏమిటి??

నన్ను ఇంతగా అవమానించే హక్కు ఇతనికెవరిచ్చారు?

"ఔను...సౌమ్యా! నీకు ఉద్యోగం ఎవరిస్తారు?"

"ఏం...? ఎందుకివ్వరు? అంతగా

ఉద్యోగం దొరక్కపోతే...."
"ఊ .... దొరక్కపోతే?"
'ఆత్మహత్య చేసుకుంటాను' ఈ మాట నా మనసులో అనుకున్నానేతప్ప పైకి అనలేదు.
"ప్రయత్నిస్తే ఏ పనీ దొరక్కుండా పోదు బతకడానికి" అన్నాను.
"పోనీ నేనివ్వనా?"
ఇతడు నన్ను ఎగతాళి చేస్తున్నాడా? తల ఎత్తి అతని వంక సూటిగా చూశాను.
అతని కళ్లు, పెదవులు నవ్వుతున్నాయి.
అవును. ఇతను నన్ను ఎగతాళి చేస్తున్నాడు. నాలో రోషం, దుఃఖం పొంగి వచ్చింది.
మునిపంటితో పెదవి కొరుక్కుంటూ దుఃఖాన్ని ఆపుకునే ప్రయత్నం చేస్తున్నాను. అతని ముందు బేలగా బయట పడిపోవడం నాకు ఇష్టం లేదు.
"మాట్లాడవేం....ఉద్యోగం వద్దా?"
"ఏం ఉద్యోగం?"
"నా కథలను ఫెయిర్ చెయ్యాలి. అవసరం అయితే సలహాలు చెప్పాలి. అంతెందుకు నా పనులన్నింటిలోనూ చేదోడువాదోడుగా ఉండాలి. అన్నింటి కంటే ముఖ్యమైన విషయం – నాకు రాత్రిళ్ళు నిద్రపట్టని జబ్బు ఒకటి పట్టుకుంది ఈమధ్య... దానికి మందివ్వాలి"
"షటప్..." గట్టిగా అరిచి కోపంగా చెయ్యెత్తాను.
మౌళి చటుక్కున నా చెయ్యి అందుకుని గుండెలమీద పెట్టుకున్నాడు.
"వదలండి...నన్నవమానించకండి.... నా బతుకు నన్ను బతకనివ్వండి..."

వెర్రిగా అరుస్తూ బలంగా గింజుకున్నాను.
ఎంత నిగ్రహించుకున్నా కన్నీళ్ళు ఉబికి వస్తున్నాయి.
"అమ్మాయి గారికి అభిమానం కొండంత...మెదడుమాత్రం నలుసంత"
మౌళి రెండు చేతులమధ్యా నన్ను బిగించి తన వైపు తిప్పుకున్నాడు.
తప్పుకునేందుకు గింజుకున్నా అతని బలమైన చేతుల మధ్య నుండి తప్పుకోడం నాకు సాధ్యం కావడం లేదు. కన్నీళ్ళు మాత్రం అవిరళంగా స్రవిస్తూనే వున్నాయి.
"స్వీటీ ... ఇదేమిటి? నీ బతుకూ, నా బతుకూ ఒకటికాదూ?" నా చెంపకు చెంప ఆనించి చెవిదగ్గర గుసగుసగా చెప్పాడు.
ఒక్క క్షణం అయోమయం తరువాత మౌళి మాటలు నాకు అర్థమయ్యాయి. మౌళి నా ముఖాన్ని చేతుల్లోకి తీసుకుని నా కళ్ళల్లోకి చూశాడు.
"ప్లీజ్ సౌమ్యా....ఏడవకు. మల్లె పందిరిలా విరబూయాల్సిన నీ జీవితం ఇంత వరకూ కష్టాలూ, కన్నీళ్ళతోనే గడిచింది. ఇకముందు నువ్వు కన్నీళ్ళు పెట్టుకునే అవసరం రాగూడదు. సరేనా.."
మౌళి నా కళ్ళు తుడిచి తడిరెప్పల మీద సున్నితంగా చుంబించాడు. ఇవన్నీ హృదయాలు పంపుకున్న, పెదవులు పలుకని సంకేతాలు...మూగ గొంతులు చేసుకున్న బాసలు....భాషలేని బాసలు.
తల్లిపక్షి రక్షణ ఇస్తూ తన చిన్న పక్షిని రెక్కల్లో దాచుకున్నట్లుగా మౌళి నన్ను తన కౌగిలిలో ఇముడ్చుకున్నాడు.
కామన లేని కౌగిలి అది....
ఆత్మీయతను పంచే కౌగిలి అది...

మౌళి ఒక చేతో నన్ను పొదివి పట్టుకునే రెండవ చేత్తో జేబులో నుండి




చిన్నపొట్లం తీసి విప్పాడు.

నేను ఆసక్తిగా చూస్తున్నాను.

నా కళ్ళు మిలమిల మెరిశాయి...

మౌళి నా మెళ్ళో తాళి కడుతూ, "సౌమ్యా...నాకు కేవలం ఈ పసుపు తాడు మీద నమ్మకం లేదు. మనస్సే ప్రధానం...మనస్సే సాక్షి... అదే నా నీతి. ఇది కేవలం నీ తృప్తి కోసం కడుతున్నాను. ఇది తీసి నువ్వు చిలక్కొయ్యకు తగిలించినా నేను మాత్రం నీ మొగుణ్నే" మొగుణ్ని అన్న పదం ఒత్తిపలుకుతూ కొంటెగా అన్నాడు.

'ఈ తాళి లేకపోయినా నేను నీభార్యనే' అని అసలేకపోయాను.

నా కళ్ళముందు ఏవేవో దృశ్యాలు...

"మౌళీ! ఒక్కసారి వెళ్ళి చిన్నిని చూసి వద్దామా?"

మౌళి నా వంక జాలిగా చూశాడు.

"వద్దు సౌమ్యా! ఇక అలాంటి అనుబంధాలు పెంచుకోకు. ఈ కన్నీళ్ళు చాలు నీకు. మనకంటూ ఓ చిన్ని వచ్చేలా మాత్రమే ప్రయత్నం చేద్దాం...."

చివరి మాటలో శ్లేషను అర్థం చేసుకున్న నేను సిగ్గుతో ముడుచుకుపోయాను.

"పైకి నెమ్మదిగా కనిపిస్తారు కానీ మీరు చాలా అల్లరి వారు...."

"ఏమిటీ ... అప్పుడే నేను అల్లరివాడినయ్యానా? ఇన్నాళ్ళూ నేనెంత కష్టపడ్డానో నీకేం తెలుసు?" అన్నాడు బాస్కెట్‌లోనుండి పువ్వులూ, పళ్ళూ, స్వీట్సూ బయటపెడుతూ.

మరో పాకెట్ నుండి ఓ తెల్ల పట్టు చీర తొంగిచూస్తోంది...

"కష్టమా? ఎందుకూ?"

"ఎదురుగా ఇంత అందాలరాశిని, మనసైన చిన్నదాన్ని పెట్టుకుని అల్లరి చేయకుండా చేతులు కట్టుకు కూర్చోడానికి నేనెంత కష్టపడ్డానో ముద్దుమొహం నీకేం తెలుసు....? నేనేం ఋష్యశృంగుణ్ని అనుకున్నావా? లేకపోతే ప్రవరాఖ్యుణ్నా? నీకిచ్చిన మాట నిలుపుకునేందుకు నేను పడ్డ అవస్థ భగవంతుడికే తెలుసు. ఇవ్వాళిటితో నా కష్టాలు గట్టెక్కాయి"

ఆ అల్లరి మాటలు నా వళ్ళంతా గిలిగింతలు పెట్టాయి. అంతకు ముందెన్నడూ లేని పులకింత....

మౌళి కిటికీ కర్టెన్ దగ్గరగా లాగుతూ నావైపూ, మంచంవైపూ చూస్తూ కొంటెగా కన్నుగీటాడు.

ఆ మరుసటి సాయంత్రం మౌళి చిన్న పార్టీ అరేంజ్ చేసి తన ఫ్రండ్స్‌నూ, డాక్టర్ శర్మగారినీ, మా కేసు వాదించిన లాయరుగారినీ ఆహ్వానించాడు.

ఆహూతుల ముందు మేం దండలు మార్చుకున్నాం.

"నిజానికి మా పెళ్ళి నిన్ననే అయిపోయింది.ఇది కేవలం పబ్లిసిటీ మాత్రమే" మౌళి కొంటెగా నా వంక దొంగచూపులు విసురుతూ వాళ్ళతో నవ్వుతూ అన్నారు.

"అదృష్టవంతుడివి...ఆలస్యంగానైనా అనుకూలవతి అయిన భార్యను సంపాదించావ్" మౌళి ఫ్రండ్ ఒకరు నవ్వుతూ అన్నారు.

నవ్వులూ, హాస్యాలూ మధ్య పార్టీ ముగిసింది.

"హనీమూన్ ఎక్కడండీ మౌళిగారూ?"ఒకరు ప్రశ్నించారు.

"నా మూన్ ఇక్కడే హనీ ఇస్తుండగా ఇక వేరే హనీమూన్ ఎందుకూ?" మౌళి నా వంక చూస్తూ నవ్వుతూ అన్నారు.

నా కళ్ళు సిగ్గుతో వాలిపోయాయి.★




# నీటి జాడ

భీష్ముడు అంపశయ్యమీద వుండి 'దాహం' అని అడిగితే పురాణకాలం గనుక అర్జునుడు నీటి జల ఎక్కడుందో చూసుకోకుండా బాణం వేసినా రయ్యిన పరిగెత్తుకు వచ్చింది గంగ. ఈ ఆధునిక కాలంలో బావి తవ్వాలంటే నీటి జాడను ముందు కనిపెట్టక తప్పదు. ఇందుకు కొన్ని చిట్కా పద్ధతులున్నాయి.

పల్లెటూర్లలో అందరికీ ఇంజనీర్లు, ఆధునిక విధానాలు అందుబాటులో వుండవు గనుక ఇలాంటి చిట్కా విధానాలను అనుసరించి షుమారుగా ఏ ప్రాంతంలో నీరు పడుతుందో తెలుసుకొని బావి తవ్వుకుంటారు.

బావి తవ్వదలచిన చోట వరిగడ్డిని పరిచి రాత్రంతా ఉండనివ్వాలి. తెల్లవారగానే గడ్డి పరిచిన చోటుకి వెళ్ళి తెల్లచీమలు తిరుగుతున్నాయేమో గమనించాలి. తెల్లచీమలు వుంటే అక్కడి నేలలో నీరున్నదన్నమాట. మరో పద్ధతి ఏమిటంటే బావి తవ్వదల్చుకున్న చోట మల్లెపూలను గాని లేదా మరే విధమైన తెల్లపూలను గాని చల్లాలి. తెల్లవారినాక ఆ పూలు వాడిపోయాయా లేక తాజాగా వున్నాయా అని చూడాలి. పూలు పూర్తిగా తాజాగా వుంటే అక్కడి నేల అడుగున నీళ్ళు బాగా వున్నట్లు, కొంచెమే తాజాగా




వుంటే నీరు తక్కువ వున్నట్లు, పూలు వాడిపోతే అసలు నీరు లేనట్లు గుర్తు.

కొన్ని రకాల గడ్డిమొక్కలు పొడినేల ప్రాంతంలో కనిపిస్తే వాటి చుట్టుపక్కల నేల అడుగున నీటి జలలు వున్నాయని

అర్థం. అలాగే పువ్వులు లేకుండా ముళ్ళ పంకాయ పెరిగినా ఆ ప్రాంతంలో నీరు పడుతుందట! ఇవన్నీ పల్లెటూరి చిట్కా పద్ధతులన్న మాట.

## వ్యాపారం

ఈమధ్య లేదుగానీ మొన్న మొన్నటి దాకా రామేశ్వరం కస్టమ్స్ ఆఫీస్‌వద్ద విపరీతంగా రద్దీ ఉండేది. అక్కడ గుమి గూడినవారిలో అధికశాతం శ్రీలంక వెళ్ళాలని తహతహలాడేవారే. వీళ్ళ చేతుల్లో ప్రయాణ సమయంలో వుండే హోల్డాల్స్, ట్రంకు పెట్టెలూ గాక ఖాళీ ప్లాస్టిక్ బక్కెట్లు, బాస్కెట్స్ వుండేవి. సగటున రామేశ్వరం నుంచి రోజుకు తొమ్మిది వందలమంది శ్రీలంకకు పయగు లెత్తడంలోని రహస్యం ఏమిటి? కారణం కనుక్కోవడం పెద్ద కష్టమేమీ కాదు. శ్రీలంక వెళ్ళేవారిలో 90 శాతం మంది అక్కడ బాగా గిరాకీవున్న భారతీయ వస్తువులను తీసుకెళ్ళి అమ్మేవారే. తిరుగు ప్రయాణంలో అక్కడ చౌకగా దొరికే వస్తువులను తెచ్చి ఇండియాలో అమ్ము తుంటారు. పూర్వం శ్రీలంకను 'పొరుగు దేశాల ప్రయాణ పథకం' కింద చేర్చింది భారతదేశం. కాని ఇప్పుడు శ్రీ లంక 'విదేశీ ప్రయాణ పథకం' కిందకు వస్తుంది. పాత చట్టాల ప్రకారం శ్రీలంక వెళ్ళేటపుడు 2,500 రూపాయల విలువ గల వస్తువులను మాత్రమే తీసికెళ్ళే వీలుండేది. ఇపుడు ఐదువేల రూపాయల విలువగల వస్తువులను తీసుకెళ్ళవచ్చు. అదీగాక శ్రీలంకలో 'డ్యూటీ ఫ్రీ' షాపులు చాలా కనిపిస్తాయి.

శ్రీలంక వెళ్ళే ప్రయాణికులు చాలా సాధారణ వ్యక్తుల్లా కనిపిస్తుంటారు. మరి తరచూ శ్రీలంక ఎలా వెళ్ళగలుగుతున్నా రన్న ప్రశ్న వెనుక ఓ చిదంబర రహస్యం ఇమిడివుంది. నిజానికి వీరు కొందరు పెద్దల చేతిలో కీలుబొమ్మలు మాత్రమే. వీరు వారి ఏజెంట్లుగా వ్యవహరిస్తారు. పెద్దలు వీరికి పాస్‌పోర్ట్‌లు సంపాదించి పెడుతుంటారు. 20 మందిని ఒక గ్రూప్‌గా




ఏర్పాటు చేస్తారు. ఒక్కో వ్యక్తి 5,000 రూపాయల విలువచేసే వస్తువులను తీసు కెళ్ళవచ్చు గనక, వారు శ్రీలంక నుంచి ఒకలక్ష విలువగల అవసరమైన వస్తు వులను తిరుగు ప్రయాణంలో తీసుకు రావచ్చు. ఆ లక్ష విలువగల సామానులను ఇండియాలో రెండు లక్షలకు అమ్ము కుంటారు. లాభం నూటికి నూరుశాతం. పేంట్, షర్ట్ పీస్‌లకు టాక్స్ పడకుండా వాటిని నడుముల్లా కట్టి తెస్తారు. శతకోటి వ్యాపారాలకు అనంతకోటి ఉపాయాలు మరి. *

FORM IV [See Rule 8]

Statement about ownership and other particulars of CHATURA

| | | |
|---|---|---|
| 1. Place of Publication | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 004. |
| 2. Periodicity of its Publication | : | Monthly |
| 3. Printer's Name | : | RAMOJI RAO |
| Whether citizen of India? | : | Yes |
| If Foreigner, state the country of origin | : | —— |
| Address | : | 6-3-570, Eenadu Compound Somajiguda, Hyderabad-500 004. |
| 4. Publisher's Name | : | RAMOJI RAO |
| Whether citizen of India? | : | Yes |
| If foreigner, state the country of origin | : | —— |
| Address | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 004. |
| 5. Editor's Name | : | RAMOJI RAO |
| Whether citizen of India? | : | Yes |
| If foreigner, state the country of origin | : | —— |
| Address | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 004. |
| 6. Names and addresses of Individuals who own the news paper and partners or share holders holding more than one percent of the total capital. | : | VASUNDHARAPUBLICATIONS 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 004. |

I, RAMOJI RAO, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

for VASUNDHARA PUBLICATIONS.

Date : March 1, 1984.

Sd/- RAMOJI RAO
Publisher.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications
Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly
Eenadu Compound, Hyderabad - 500 004.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004,                Regd. No. H/ HD /4